THE LARGEST CIRCULATED TELUGU MONTHLY

# చతుర

నవంబరు 1998
రూ. 7/-



## నరమేధం

గోపరాజు నాగేశ్వరరావు




ఈ శీర్షికద్వారా ప్రతినెలా 'చతుర'లో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని కల్పిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మొత్తం మళ్ళీ చెప్పకుండా, అవసరమైనమేరకే ప్రస్తావిస్తూ రాయాలి.

1. సమీక్ష అరఠావుకి మించకుండా కాగితానికి ఒకవైపునే రాయాలి.
2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేటట్లు పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.
4. కవరుపై 'చతుర సమీక్ష'కు అని పేర్కొని ఎడిటర్, 'చతుర', ఈనాడు కాంపౌండ్, హైదరాబాద్-500 482 అనే చిరునామాకు పోస్టుచేయాలి.

**మాకు సకాలంలో అందిన సమీక్షలలో ఎన్నికచేసిన అయిదు ఉత్తమ సమీక్షలకు రు. 100/- ప్రథమ బహుమతి, రు: 75/- ద్వితీయ బహుమతి, రు: 50/- చొప్పున మూడు తృతీయ బహుమతులను అందజేస్తున్నాం. పాఠకుల పరిశీలనాశక్తిని, రచనాసక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటుచేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.**

★ కొందరు బహుమతి విజేతలు తమ బహుమతి తాలూకు చెక్కు అందలేదనీ, అడ్రసు మారిందనీ రాస్తున్నారు. బహుమతి మొత్తాలు ప్రతినెలా మొదటివారంలోనే పంపుతున్నాం. అడ్రసుల విషయంలో కూపన్‌లో రాసేటప్పుడే జాగ్రత్తపడటం మంచిది. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు సాధ్యంకాదు.

**కూపన్**

**నవంబర్ చతుర నవల నరమేధం**

.....................................................................

**సమీక్షకుని పేరు:** .....................................................................

**చిరునామా:** .....................................................................

.....................................................................

.....................................................................

.....................................................................

# ఏరినముత్యాలు

★ స్వర్గం, నరకం ఎక్కడోలేవు. నీ మనసులోనే వున్నాయి

-రాజ్‌పాల్

★ కర్తవ్య నిర్వహణకు వ్యక్తిగత కారణాలు అడ్డు రాకూడదు.

-యూలిసిస్‌గ్రాంట్

★ పనిచేయడంకన్న, పనిచేయాలన్న ఆలోచన బద్ధకస్తులకు అలసట కలిగిస్తుంది.

-ఒక సూక్తి

★ నీ గురించి నువ్వే తొలిసారిగా నవ్వుకోగలిగినరోజున నువ్వు ఎదిగినట్టు లెక్క.

-ఎథెల్ బ్యారీయోల్

★ ఎవరి గురించీ అప్రమత్తంగా వుండకపోవడమే అతి పెద్ద తప్పు.

-కార్‌లైన్

★ మొండి తనంతో కూడిన సద్గుణంకంటే సర్దుబాటుతో కూడిన దుర్గుణం మిన్న.

-మొలియర్

★ విజయానికి ఆత్మవిశ్వాసమే ముఖ్యం.

-విలియమ్ హాడ్‌బిట్

★ ఆలోచించకుండా వ్యక్తంచేసే అభిప్రాయమే అపోహ.

-వోల్టేర్

★ ప్రజాభిప్రాయం దన్నుగా ఉన్నప్పుడే చట్టం సమర్థవంతంగా అమలు జరుగుతుంది.

-వెండెల్ ఫిలిప్స్

★ స్వాంతన చేకూర్చే మాటలను నేర్పుగా పలకటమే మనిషికి తెలిసిన పురాతన వైద్యం.

-లూయిస్ నైజర్

★ తక్కువ చేసేవారే ఎక్కువ చేస్తామని ఆర్భాటం చేస్తారు.

-లియోమాగ్నెట్

★ భారతదేశ బలం నైతిక విలువల్లోనే వుంది. కానీ ఆయుధాల్లో కాదు.

-సల్మాన్ ఖుర్షీద్

★ నేను మారితే ప్రపంచం మారుతుందా అనేది తప్పు. నిజంగా మారిచూడు నీకే తెలుస్తుంది.

-జిడ్డు కృష్ణమూర్తి

★ అబద్ధాలాడడం దుర్గుణాలలో రెండవది అయితే అప్పులు చేయడం మొదటిది.

-లియోనార్టో జాలెన్సీ

సేకరణ : బి. నందీశ్వరరెడ్డి

# సచిత్రవిచిత్రం



## అమెరికన్ అధ్యక్షుల పెన్షన్లు

అమెరికా అధ్యక్షులకు రిటైర్ అయ్యాక ప్రభుత్వం నుంచి పెన్షన్ అందుతుంది. ఇంతేకాక సీక్రెట్ సర్వీస్ రక్షణ, ఆఫీస్ అద్దె, తనకింద పనిచేసేవాళ్లకి జీతాలు, పరిమితిలేని ఉచిత పోస్టేజి, టెలిఫోన్ సౌకర్యం, ప్రయాణఖర్చులు, ఆరోగ్యసంరక్షణ ఖర్చులు కూడా ఇస్తారు. ఒకప్పుడు అమెరికా అధ్యక్షులుగా వున్న జెరాల్డ్ ఫోర్డ్‌కి 2,42,275 డాలర్లు, జార్జ్‌బుష్‌కి 1,28,625 డాలర్లు, రోనాల్డ్ రీగన్‌కి, జిమ్మీకార్టర్‌కి తలా 1,48,000 డాలర్లు అమెరికన్ ప్రభుత్వం చెల్లిస్తోంది. వీళ్లు అధ్యక్షులవకముందు కొన్ని రాష్ట్రాలకి గవర్నర్లుగా పనిచేయడంతో ఆ పెన్షన్ కూడా ముడుతోంది. ఈవిధంగా అమెరికన్ ప్రభుత్వం 20 లక్షల డాలర్లు వీళ్ల రిటైర్‌మెంట్ బెనిఫిట్స్ కోసం ఖర్చుచేస్తోంది. ఏడాదికి 30 వేల డాలర్ల చొప్పున 100 మంది టాక్స్ పేయర్స్ కట్టే టేక్స్‌కి ఈ 20 లక్షల డాలర్లు సమానం.

# చతుర

సంపుటి:21 సంచిక:10 నవంబర్ 1998

పాటిచేల గాలులూ, పాలపిట్ట పలుకులూ... పల్లెపడుచుల పాటలూ... లేగదూడల అరుపులు... అరకల చప్పుళ్లూ... ఆనందంగా ఊగే చెట్లు... బాలభానుణ్ణి తమవెనుక చూపించి ఊరికీ మేలుకొలుపు పాడే కొండలూ... పచ్చికబయళ్లూ... మూర్తీభవించిన ప్రకృతి సౌందర్యం... ఆ ఊరు. ప్రకృతిని చూసి ఆ అమ్మాయి తన జీవితంలో విషాదాన్ని కూడా... ప్రకృతిలోనే వెదుక్కుంటూ పెద్దదయింది.

కళ్లముందే కరిగిపోయి... నాగరికత ఉక్కుపిడికిలిలో నలిగిపోతున్న ప్రకృతిసౌందర్యం... తనతోపాటు ఆమెకీ, ఆ ఊరికికూడా దుఃఖాన్ని తెచ్చిపెట్టింది.

అంతవరకూ తనకోసమే బతికిన ఆ అమ్మాయి... ఊరికోసం బతకబోయినప్పుడు... ఎదురయిన అనుభవాలెలాంటివి?

తన అనాకారితనాన్ని నిందించుకుంటూ తననెవరూ ప్రేమించలేరనుకునే ఆ అమ్మాయిని చేపట్టేందుకు ముందుకు వచ్చిందెవరు?

నాగరికత ముసుగులో అణగారుతున్న పల్లె సౌందర్యాన్ని అక్షరరూపంలో ఆవిష్కరించిన

## గోపరాజు నాగేశ్వరరావు

# నరమేధం

ఈ నెల చతుర సమగ్ర నవల.

సుందరి అందగత్తెకాదు! నలుపు రంగు పులిమిన చెక్క బొమ్మలా వుంటుంది! లోతు కళ్లూ, కోలముఖం, మరేదో భారీ కాయానికి అమర్చాల్సిన ముక్కూ, చెవులను సృష్టికర్త ఏమరపాటున ఆమెకు అమర్చినట్లే వుంటుంది!

సన్నదనానికి తోడు కాస్త వొంగి నడుస్తుంది సుందరి.

సుందరికింకా వివాహం కాలేదు!

ఆమెనొక ఇంటిదాన్ని చేసి బాధ్యతల నుంచి బయటపడేందుకు అనంతరామయ్య చేస్తోన్న ప్రయత్నం ఇంకా ఓ కొలిక్కి రాలేదు!

సంబంధాలకోసం ఎన్ని ఊళ్లు తిరిగేడో! ఎన్ని గడపలు తొక్కేడో!

పెళ్లి చూపులకు వచ్చి అమ్మాయిని చూసేందుకు కొంతమంది మగపెళ్లివాళ్లు దయతో అంగీకరించి వచ్చేరు కూడా!

వాళ్లు సుందర్ని చూసింతర్వాత ఫలహారాలు ఆరగించకుండానే తిరిగి వెడుతూ అనంతరామయ్య దంపతులతో "క్షమించండి! మీ అమ్మాయి మాకు నచ్చలేదు. వెళ్లింతర్వాత ఉత్తరం రాస్తామని మిమ్మల్ని మభ్యపెట్టలేం! అందుకే మా అభిప్రాయాన్ని ముఖంమీదే చెప్తున్నాం! ఇలా అన్నామని మీరేం నొచ్చుకోవద్దు! అభిప్రాయం తేల్చిచెప్పకుండా లౌక్యంగా తప్పించుకుని వెళ్లటం కేవలం పాతకాలపు మర్యాద! అలాంటివి మాకు నచ్చవు" అని విలక్షణంగా చెప్పిన వాళ్లూ తారసపడకపోలేదు.

అలాగే "వెళ్లగానే ఉత్తరం రాస్తాం" అని చెప్పి అజాపజా లేకుండా వెళ్లినవాళ్లూ వున్నారు.

తిరస్కారాన్ని కూడా సున్నితంగా తెలియపరచటం సంస్కారంలో ఒక భాగం! ఆధునికులే కాదు ఆదిమానవులు అలాంటి సంస్కారాన్ని పాటించినా వారిని ఆదర్శంగా తీసుకోవచ్చు. కానీ అలౌక్యం, నిష్కాపట్యం పేరిట ఎదుటివాళ్ల మనసుల్ని గాయపరిచే వాళ్లు ఏ సమాజంలోనూ క్షంతవ్యులు కారు.

అలా క్షంతవ్యులు కానివాళ్లే ఎక్కువగా తారసపట్టంతో అనంతరామయ్య ధైర్యం సడలిపోయింది. అమ్మాయికిక వివాహం చెయ్యలేనేమో అన్న అనుమానం కూడా తట్టింది. దాంతో అతడి ప్రయత్నాల జోరు తగ్గింది. సమస్య పరిష్కారాన్ని కాలానికి వదిలిపెట్టి నిర్వికారంగా తన పని తాను చేసుకుని పోతున్నాడు అనంతరామయ్య.

ఆయనది మధ్యతరగతి కుటుంబం. మగ్గాలమీద చీరలు నేయటం వాళ్ల వృత్తి. గతంలో ఆదాయం బాగానే వుండేది. కానీ కాలక్రమేణా మిల్లు వస్త్రాలు గ్రామీణ ప్రాంతాలక్కూడా విస్తరించటంతో చేనేత చీరలకు ఆదరణ తగ్గింది. వాళ్ల ఆదాయమూ తగ్గింది.

ఆ రాత్రి బాగా పొద్దుపోయినా అనంతరామయ్యకు నిద్రపట్టలేదు. ఆరు బయట మంచంమీద వెల్లకిలా పడుకుని ఆకాశంలో వెలుగుతోన్న మినుకు చుక్కలవేపే ధ్యానంగా చూస్తున్నాడు. పక్కనే మరో మంచంమీద భాగ్యమ్మ, సుందరి పడుకున్నారు.

చాలా సేపటివరకు తన ధోరణిలో కూని రాగాలు తీసీతీసి ఎప్పుడు నిద్రలోకి జారుకుందోగానీ సుందరి సన్నగా గురకపెడుతోంది. ఆ నిశ్శబ్దంలోంచి ఆమె గురక విని అనంతరామయ్య తపోభంగమైన మునిలా లేచి కూర్చుని కూతురువేపు జాలిగా చూసేడు.

అనంతరామయ్యకే కాదు భాగ్యమ్మక్కూడా అంతదాకా నిద్రపట్టనట్టుంది. అనంతరామయ్య అలా లేచి కూర్చోగానే తనూ మంచంమీంచిలేచి పట్టెమీద కూర్చుని "యేవండీ ఇంకా నిద్రపోలేదా? " అని అడిగింది.

అనంతరామయ్య సమాధానం చెప్పలేదు.





శూన్యంలోకి చూస్తూ మౌనంగా కూర్చు న్నాడు.

అతడి మౌనం ఆమెకు దుర్భరంగా తోచింది. "అమ్మాయి పెళ్లి విషయమేగా మీరు బెంబేలు పడుతోంది. అయినా ఇప్పుడే దానికంత వయసేం మించిపోయిం దని. మనతోపాటే కలో గంజో తాగు తోంది. కాలం కలిసి రానివ్వండి. కళ్యాణం వచ్చినా కక్కొచ్చినా ఆగదంటారుకదా. చూద్దాం. దాని జాతకం ఎలా వుందో మనసు పాడుచేసుకుని మనం మాత్రం సాధించేదేముంది గనుక? " అంది భాగ్యమ్మ తాత్వికంగా.

ఆకాశంలో మందంగా వెలుగుతోన్న మినుకు చుక్కల కాంతిలోకూడా అనంతరా మయ్య నిర్లిప్తంగా నవ్విన నవ్వును ఆమె గ్రహించకపోలేదు.

"దాని జాతకం మంచిదే అయితే మా అక్కా, బావా రోడ్డు ప్రమాదంలో చనిపో వటం, మన అమ్మాయినిచ్చి పెళ్లి చేద్దామను కున్న వాళ్లబ్బాయి రామ్మూర్తి అంత చిన్న వయసులోనే దేశాలమీదికి వెళ్లటం ఎందుకు జరుగుతుంది? " అన్నాడు అనంత రామయ్య బాధగా.

భాగ్యమ్మ సమాధానం చెప్పలేదు.

కొద్దిసేపలా నిశ్శబ్దంగా గడిచిపోయేక అనంతరామయ్యే అడిగేడు, "భాగ్యం! అందరూ మన సుందరిని అనాకారి అంటు న్నారు"

భాగ్యమ్మ వొత్తంటించిన తారాజువ్వలా చర్రున లేచింది.

"వాళ్ల కళ్లల్లో నిప్పులు పొయ్య! నా బిడ్డను అనేపాటివాళ్లా ఎవరైనా" అని చివాల్న మంచంమీద వాలిపోయి కూతురు పొట్టమీద చెయ్యివేసి పడుకుంది భాగ్యమ్మ.

★ ★ ★

'భారతీపురం' అన్న పేరు ఆ ఊరికి బాగానే నప్పేదిగానీ అది ఒకప్పటిమాట! భారతీయ తత్వానికి దర్పణం పడుతూ నిర్మలమైన తపోవనంలా కనిపించేది ఆ ఊరు. చెయ్యి తిరిగిన చిత్రకారుడు కాన్వా సుమీద అందమైన రంగులతో గీసిన ప్రకృతి చిత్రానికి మల్లే వుండేది. విశాలమైన వీధులూ, మురుగు కాల్వలూ, వాటిని సొంత ఇళ్లతోపాటు నిత్యం పరిశుభ్రం చేస్తోండే గ్రామ ప్రజలూ...

ఊరికి తూర్పు దిక్కున వున్న బూడిద రంగు కొండలు రెండు గంభీరంగా కని పిస్తూ గ్రామానికి ధీమాను పెంచేవి. ఉషో దయంలో ఎర్రటి సూర్యుడు ఆ రెండు కొండలమధ్యని ఖాళీగుండా తన తొలి వెల్తురు కిరణాల్ని సంధించి గ్రామాన్ని స్పృశించగానే ఊరికి చైతన్యం వచ్చేది. పెద్దలూ, పిల్లలూ నిద్రలేచి, కాలకృత్యాలు ముగించుకుని ఎవరి ధర్మాన్ని వారు నిర్వ ర్తించేందుకు సన్నద్ధమౌతోంటే ఊరు ఊరంతా సందడే!

ఒకవేపు అమ్మలు తమ పిల్లల్ని ముస్తా బుచేసి బడికి పంపించే పనిలో తలమునక లౌతోంటే కొట్టాల్లోంచి విముక్తమైన పశు వులు నిర్వికారంగా రోడ్లవారగా నడుస్తూ మేతకోసం బీళ్లకు వెడుతోండేవి మందలు మందలుగా. వాటిని కర్రలతో అదిలించి క్రమశిక్షణలో పెట్టే కాపరుల అవసరం అంతగా కనిపించేదేకాదు.

నీళ్లలో పేడ ముద్దలు పిసికి ఆడవాళ్లు కసువూడ్చాక కళ్లాపులు చల్లుతోంటే సంబరా నికి వెడుతోన్నట్టే మగవాళ్లు పొలాలకు తర లివెళ్లేవాళ్లు. సరిగ్గా ఇళ్లముందు రంగవ ల్లులు తీర్చిదిద్దుకునే వేళకల్లా కమ్మరి కొలిమి అగ్గిరాజుకుని నిప్పుల సెగలూదేది. బండ్లకూ, అరకలకూ కావలసిన కమ్ములూ, చక్రాలూ చేసేందుకు రంగంలోకి దిగే ఆ కమ్మరి ఇంటినుంచి ఇనుమును సుత్తెతో బాత్తోన్న చప్పుడు ఊరంతా లయబద్ధంగా వినిపించేది.

కుండలు చేసే కుమ్మరి చక్రం గిర్రున

తిరుగుతూ మౌనగీతం పాడుతూనే మట్టి ముద్దలకు ఆకారాలనిస్తోంటే, అక్కడ బడిలో పిల్లలకు పాఠాలు చెప్తోన్న పంతుళ్ల కంఠాలు వినిపించేవి.

'మాదీ స్వతంత్రదేశం మాదీ స్వతంత్ర జాతీ. భరత దేశమే మా దేశం. భారతీయులం మా ప్రజలం..' అంటూ పిల్లలతో సహా పంతుళ్లూ గొంతు కలిపి పాడింతర్వాతనే బడిలో బోధన మొదలయ్యేది. ఆ పాటను వాళ్లంతా సామూహికంగా అలా గొంతెత్తి గానం చేస్తోంటే అప్పుడే స్వతంత్రం వచ్చినట్లు వొళ్లు పులకించేది.

సుందరిని కూడా బళ్లో చేర్పించారు.

ప్రాథమిక విద్యలో ఊరంతటికీ వున్నది అది ఒక్కటే బడి. గ్రామ జనాభా, పిల్లల సంఖ్యనుబట్టి అవసరాలు తీర్చేందుకు ఆ ఒక్క బడి చాలు.

సాధారణ కుటుంబాలనుంచి వచ్చిన పిల్లల నుండి మోతుబరి రైతుల పిల్లలూ, మునసబు, కరణంగారి పిల్లలూ అంతా కలిసే బళ్లో చదివేవాళ్లు. ఆర్థిక స్థితిగతుల్ని బట్టి పిల్లల వేషధారణలో వ్యత్యాసాలు వున్నా వాళ్లమధ్య ఎలాంటి అరమరికలూ భేదభావాలూ వుండేవికావు. అందరూ చాలా అన్యోన్యంగా కలిసి చదువుకునేవాళ్లు. వాళ్లమధ్య నిత్యం జరిగే పోటీ అల్లా పంతులుగారు అడిగే ప్రశ్నలకు ముందుగా ఎవరు జవాబులు చెప్తారో అన్న అంశం మీద మాత్రమే.

ఒక్కో సంవత్సరం గడిచిపోయి ఎదుగుతోన్నకొద్దీ సుందరి ఆలోచనలూ ఊహలూ విచిత్రంగా మారసాగేయి!

ప్రాథమిక విద్య పూర్తయి పెద్దబడిలో చేరింది సుందరి, మిగతా నేస్తాలతో సహా. నేస్తాలంతా ఖరీదైన అందమైన రంగురంగుల వస్త్రాలను పట్నంనుంచి తెప్పించుకుని వాటిని ధరించి స్కూలుకు వస్తోంటే ఇంట్లో స్వయంగా అమ్మానాన్నా మగ్గాలమీద చేత్తో నేసిన వస్త్రాలు ధరించి స్కూలుకు వెళ్లటం సుందరికి యిబ్బందికరంగా తోచేది. అయినా తన మనోభావాలను ఎవ్వరి ముందూ బయటపెట్టేదికాదు లోలోపలే మథనపట్టంతప్ప.

ఆ చిన్న వయసులోనే జీవితంపట్ల ఆమెకు ఎంతగా అసంతృప్తి పేరుకునిపోయిందో మనసులో రోజులు గడిచేకొద్దీ నేస్తాలకు సాధ్యమైనంత దూరంగా వుండటం, వాళ్లు పలుకరించినా పలుకకుండా తప్పించుకుని వెళ్లటం అలవాటు చేసుకుంది సుందరి.

తను అనాకారినన్న విషయం ఆమె పూర్తిగా గ్రహించేక ఆమెకూ నేస్తాలకూ మధ్య అంతరం మరింత పెరిగింది. అనుక్షణం ఏదో న్యూనతకు గురౌతోన్నట్లు ఏవేవో ఊహించుకుని అంతరంగంలో కాలిపోతూ లోలోపలే కుమిలిపోతోంది సుందరి.

ఆమె ఇప్పుడు ఒంటరి తనాన్ని ప్రేమిస్తోంది. బాధలో ఆనందాన్ని ఆస్వాదిస్తూ ఆవేదనను అమితంగా కాంక్షిస్తోంది. నిత్య జీవితంలో ఆమె ఆశించేంతటి ఆవేదన, బాధ ఎదురుకాకపోవటంతో ఊహలతోనే వాటిని ఆపాదించుకుని ఆనందిస్తోంది. ఆమెకు ఇష్టమైన పాట "పుత్తడిబొమ్మ పూర్ణమ్మ"



అది సుందరి బాల్యంలో... అనంతరామయ్య చేనేత బట్టల వ్యాపారం జోరుగా సాగుతోన్న రోజుల్లో ఆయన అక్క అరుంధతి ఒకరోజు కబురుపెట్టింది. వాళ్ల ఊళ్లో మగ్గాల పనులు అంతగా లేక పోవటంతో కుటుంబం గడవటమే కష్టంగా వుందని. తమ్ముడు ఏదైనా జీవనాధారం చూపిస్తే భారతీపురం వస్తామని. పట్నంలో నూలు చేనేత వస్త్రాలకు గిరాకీలేదని.

అనంతరామయ్య ఆ కబురు వినగానే





భార్యతో సంప్రదించేడు.

ఎటూ వ్యాపారం బాగుంది. ఊళ్లో మగ్గాల వాళ్లంతా రెండు చేతులతో ఆర్జిస్తు న్నారు కనుక బంధువులను కూడా భారతీ పురానికి ఆహ్వానించి వాళ్లతో వ్యాపారం పెట్టించేందుకు భాగ్యమ్మ కూడా తన సమ్మ తిని భర్తకు తెలియపరిచింది. పైగా వాళ్ల నలా ఆహ్వానించటం అనివార్యం కూడా. వాళ్లబ్బాయి రామ్మూర్తికి సుందరినిచ్చి పెళ్లి చెయ్యాలని పెద్దల సంకల్పం.

అనంతరామయ్యనుంచి కబురందగానే బావ, అక్క రామ్మూర్తిని వెంటపెట్టుకుని భారతీపురానికి బయల్దేరేరు.

ఆ ఊరికి పట్నంనుంచి ఒకే ఒక్క బస్సు పొద్దున ఒకసారి సాయంత్రం మరోసారీ భారతీపురానికి తిరుగుతుంది.

ఆ బస్సులో కొద్దిపాటి సామాన్లతో వచ్చి ఊరి వెలుపల వున్న బస్టాండ్లో దిగేరు వాళ్లు.

ఆ బస్సుకు అక్కా, బావా వస్తారని తెలి సిన అనంతరామయ్య బస్టాండ్లో వాళ్లను కలిసేడు. ఇంటివరకు గుర్రబ్బండి మాట్లాడి అందర్నీ ఎక్కించి వెనగ్గా తనూ ఎక్కి కూర్చున్నాడు.

బండి అనంతరామయ్య ఇంటివేపుకు సాగిపోతోంది.

మట్టి మిద్దెల్ని దాటుకుంటూ రోడ్డెంట అలా బండి సాగిపోతోంటే అరుగులమీద కూర్చున్న మగవాళ్లూ, ఇళ్లల్లోంచి బయటి కొచ్చి గడపలను ఆనుకుని నించున్న ఆడ వాళ్లూ ఆ బండివేపే పరీక్షగా చూట్టం అంత చిన్న వయసులో కూడా రామ్మూర్తి గమనించకపోలేదు.

"మన అనంతరామయ్య ఇంటికెవరో చుట్టాలు వచ్చినట్టుందేవ్!" అన్న మాటలు ఓ అరుగుమీంచి వినిపించేయి.

"వాళ్లది ఏ ఊరు? " అనంతరామయ్యను అడిగేరెవరో.

"మా అక్కా, బావ, వాళ్లబ్బాయి వచ్చారు. ఇకనుంచి మనూళ్లోనే వుంటారు" అని దారి పొడుగునా అడిగిన వాళ్లందరికీ ఓపిగ్గా సమాధానం చెప్తూనే వున్నాడు అనంతరా మయ్య.

బండి ఇంటి ముందు ఆగింది. అందరూ బండిదిగి ఇంట్లోకి వెళ్లేరు.

"అమ్మా... సుందరీ! మీ బావొచ్చాడే" అంది భాగ్యమ్మ సుందరిని ఉడికిస్తూ.

"బావేంటే మరదలా... మొగుడొచ్చాడని చెప్పక" అంది వదిన భాగ్యమ్మతో.

అంతా ఘొల్లున నవ్వేరు. సుందరి మూతి ముడుచుకుని లోపలికి వెళ్లిపో యింది సిగ్గుతో.

స్నానాలు ముగించి భోజనాలకు కూర్చు నేందుకు అందరూ సంసిద్ధులౌతోన్న సమ యంలో రామ్మూర్తే అనంతరామయ్యను అడిగేడు. "మామయ్యా! దార్లో అందరూ మమ్మల్ని చూసి ఎవరనీ? ఏ ఊరనీ? ఎన్నాళ్లుంటారనీ అడిగారు. వాళ్లకెందు కట? " అని.

అనంతరామయ్య నర్మగర్భంగా నవ్వేడు.

"నగరాల్లోని, పట్టణాల్లోని వాళ్లు నాగరి కత నేర్చుకున్న జనం.. వాళ్లు తమ విష యాలు తప్ప మరేం పట్టించుకోరు. ఇత రుల పట్ల ఆసక్తి చూపించరు. ఇది పల్లెటూ రుగదా అంచేత గ్రామంలోకి కొత్తవాళ్లు ఎవరు వచ్చినా వాళ్లను గురించి అందరూ ఆరా తీస్తారు. ఎవరింటికి? ఏ ఊరు? ఎన్నాళ్లుంటారు? అని వాళ్లు అడిగితే ఎబ్బె

ట్టుగా అనిపిస్తుందికానీ అలా అడగటం వెనుక చాలా సామాజిక స్పృహవుంటుంది. ఈ గ్రామంలోనే కానీ చుట్టుపట్ల గ్రామాల్లోనే కానీ దొంగతనాలు, దోపిడీలు మొదలైన అవాంఛనీయ సంఘటనలు జరిగితే గ్రామస్తులే వెంటనే కొత్తవాళ్లు అక్కడ సంచరించిన వైనం చెప్తారు. వాళ్ల వివరాలు చెప్తారు. దాంతో నేరస్తులను పట్టుకోవటం సులువౌతుంది. ఒకవిధంగా వాళ్లు చేసేది పట్టణాల్లో నిఘాపోలీసులు చేసేపనే! కాకుంటే వాళ్లు జీతం రాళ్లకోసం అలా చేస్తే గ్రామీణులు సంఘ భద్రతకోసం అలా విధులు నిర్వర్తిస్తారు" అని వివరించి చెప్పేడు.

రామ్మూర్తి మౌనంగా ఆలోచిస్తూ కూర్చున్నాడు.

సరిగ్గా భోజనాలు వడ్డించే వేళకు ఎవరో ఇద్దరు స్త్రీలు అనంతరామయ్య ఇంటికి వచ్చి రెండుకుండల్ని ఇంట్లో పెట్టేరు. భాగ్యమ్మను "అక్కా..." అని కేకేసి పిల్చి "మరేం లేదు, మీ ఇంటికి బంధువులు వచ్చారుగదా! పాలూ, పెరుగూ తెచ్చాంలే" అని చెప్పి వెళ్లిపోయారు.

భోజనానికి కూర్చుంటూ రామ్మూర్తి అడిగేడు "మామయ్యా! వాళ్లు పాలకూ పెరుక్కూ డబ్బులు తీసుకోలేదేం? "

"అలా డబ్బులు తీసుకోరు. ఊళ్లో ఎవరింటికి బంధువులు వచ్చినా మిగతా అందరూ అలాగే మర్యాదలు చేస్తారు. కావలసిన సంబారాలు సమకూరుస్తారు. అది వీళ్ల అలవాటూ, సంప్రదాయం!" చెప్పేడు అనంతరామయ్య.





అందరూ ఆనందంగా కబుర్లు చెప్పుకుంటూ భోజనాలు ముగించేరు.

నాలుగు రోజులలా గడిచిపోయేక రామ్మూర్తిని బళ్లోవేసేరు. అక్కా, బావలకు ఓ చిన్న ఇంట్లో బస ఏర్పాటు చేసి వాళ్ల వృత్తికి కావాల్సిన మగ్గాలను, నూలు కొనుగోలుకూ, రంగులకూ కావాల్సిన పెట్టుబడినీ సమకూర్చేడు అనంతరామయ్య.

కొద్దిరోజులకే వాళ్ల వ్యాపారం కూడా ఊపందుకుంది. ఒడిదుడుకుల్లేకుండా కాలం సాఫీగా సాగిపోతోంది.

వేళకు బడికి వెళ్తోన్నా రామ్మూర్తి చదువు పట్ల అంతగా శ్రద్ధ చూపటం లేదన్న ఫిర్యాదులు వచ్చాయి. ఆ విషయం పంతుళ్లే కాదు సుందరి కూడా రూఢి పరిచింది.

అనంతరామయ్య ఒకరోజు రామ్మూర్తిని చేరదీసి అడిగేడు, "నువ్వు సక్రమంగా చదువుకోటం లేదటగా? " అని.

రామ్మూర్తి అందుకు సమాధానం చెప్పలేదు. మామయ్య అలా అడిగేడన్న భయంతో మాత్రం కాదు, ఏం చెప్పాలో పాలుపోకనే!

"మీరన్నా బాగా చదువుకుని వృద్ధిలోకి రండి. కులవృత్తుల్నే నమ్ముకుంటే రానున్న కాలంలో సుఖంగా జీవించటం సాధ్యపడేలా లేదు. కులవృత్తులనుంచి దారిమళ్లి మరో మార్గం ఎంచుకుందుకు ఎంతో సామర్థ్యం కావాలి. అవకాశాలు రావాలి. అది ఒకపట్టాన కుదిరే పనికాదు. అందుకే మీరన్నా ఎక్కువగా చదువుకోండి. రానున్న కాలానికి అనుగుణంగా జీవించే మార్గాలు మీకప్పుడే అందుబాట్లోకి వస్తాయి. మీరిప్పుడు చదువును అశ్రద్ధ చేస్తే ఒక జీవితకాలం ఈ మురుగులోనే మగ్గిపోవాల్సి వుంటుంది. ఇకపైన నీ ఇష్టం" అని అక్కడ్నించి వెళ్ళిపోయాడు అనంతరామయ్య.

ఆయన వాదన రామ్మూర్తిమీద ఎలాంటి ప్రభావం చూపించలేదు. పైగా ఆరోజు బడి

మానేశాడు కూడా!

సుందరి ఇంటికి వచ్చింది.

"రామ్మూర్తి బావ బడికి రాలేదా?" సుందర్ని అడిగింది భాగ్యమ్మ.

సుందరి సమాధానం చెప్పకుండా భయం భయంగా చూస్తూ నించుంది.

"అడిగిందానికి సమాధానం చెప్పవేం?" రెట్టించి అడిగింది భాగ్యమ్మ.

"చెప్తే తంతానన్నాడుగా, ఎలా చెప్పను?" అంది సుందరి బిక్కముఖంతో.

భాగ్యమ్మకు నవ్వాగలేదు! "అయితే ఇద్దరి మధ్య కీచులాటలు అప్పుడే మొదలయ్యాయన్నమాట. పద... పద! కాళ్ళు కడుక్కుని వస్తే టిఫిన్ పెడతాను" అంది భాగ్యమ్మ.

వాళ్ళ సంభాషణను విన్నాడు అనంతరామయ్య. కాళ్ళు కడుక్కుని వచ్చి ఫలహారం చేస్తోన్న సుందరి దగ్గరికి వెళ్ళి అనునయంగా అడిగేడు. "ఏమ్మా... బావ ఇంట్లో చెప్పొద్దని నిన్ను బెదిరించి బడికి ఎగనామం పెట్టాడుకదూ?"

సుందరి కళ్లు టపటప లాడిస్తూ చూసి "నీకెలా తెలుసు?" అడిగింది ఆశ్చర్యంగా.

"పెద్దవాళ్ళంగదా... మాకన్నీ తెలుస్తాయి"

"అయితే, బావ బడికి వెళ్తున్నానని ఇంట్లోంచి పుస్తకాలు, పలక తెచ్చి, అవి నా సంచీలో పెట్టి వెళ్ళింది కూడా తెలుసా?"

"ఓ... తెలుసు!" అన్నాడు అనంతరామయ్య.

"అయితే బావ ఇప్పుడు ఎక్కడుంటాడో చెప్పు చూద్దాం..." అంది కిలకిలా నవ్వుతూ సుందరి.

అనంతరామయ్య క్షణంసేపు ఇరకాటంలో పడిపోయాడు. "నీకూ తెలియదుగా" అన్నాడు నెమ్మదిగా.

చివాల్న తలెత్తి చూసింది సుందరి. "నాకెందుకు తెలీదూ... బావ చెరువు దగ్గరుంటాడు" అంది గర్వంగా.

అనంతరామయ్య దీర్ఘంగా ఆలోచించాడు. రామ్మూర్తి విషయం అక్కా బావలకు చెప్తే వాళ్ళతన్ని మందలిస్తారే తప్ప చదువుపట్ల వాడికి ఏర్పడిన విముఖతకు కారణాలను తెలుసుకునే ప్రయత్నం చెయ్యరు. వాళ్ళేకాదు, చాలామంది తల్లిదండ్రుల వైఖరి అంతే! అందువల్ల ప్రయోజనం శూన్యం అన్న విషయం అనంతరామయ్య స్వీయానుభవం!

అనంతరామయ్య కూడా బాల్యంలో అలాగే ప్రవర్తించేవాడు. బడికి వెళ్తున్నానని చెప్పి పుస్తకాల సంచి భుజానికి తగిలించుకుని వెళ్ళి ఊరి వెలుపలి చింతల తోపులో కోతికొమ్మంచి ఆడేవాడు. చెరువు గట్టున పుస్తకాలు, బట్టలూ రాయికింద పెట్టి చెరువులో దూకి ఈతలు కొట్టేవాడు. బడి విడిచిపెట్టేవేళకు ఇంటికి వెళ్ళి పుస్తకాల సంచి గూట్లోపెట్టి మగ్గాలమీద అమ్మా, నాన్నా బట్టలు నేస్తుంటే ఆసక్తిగా చూస్తూ కాలం గడిపేవాడు.

ఒకరోజు పంతులుగారు అనంతరామయ్య బడి ఎగ్గొట్టి ఆటలకు వెళ్తోన్న విషయం తెలియజేస్తే ఆగ్రహించిన తండ్రి చింతబరిగతో చావగొట్టాడు. అనంతరామయ్య మరీ మొండికి తేలి బెత్తానికి శరీరం అప్పగించాడే తప్ప అటు తర్వాత మళ్ళీ బడి ముఖం చూళ్ళేదు.

బాల్యం గుర్తొచ్చి అనంతరామయ్య పెదాలు విచ్చుకున్నాయి. అసంకల్పంగానే పల్చగా నవ్వేడు. ఆ నవ్వులో ఎంత విషాదమో!

ఇప్పుడు రామ్మూర్తి ప్రవర్తన కూడా అలాగే తోస్తోంది. ఎదుగూ బొదుగూలేని తన జీవితంలాంటి జీవితమే రామ్మూర్తిని కూడా వరిస్తే అతగాడు భవిష్యత్తులో ఎన్ని ఇక్కట్లకు గురౌతాడో! పైగా అతన్తోపాటు తన బిడ్డ సుందరి కూడా!

చివరికి అనంతరామయ్య ఓ నిర్ణయానికి వచ్చాడు! చెరువు దగ్గరికి వెళ్ళి రామ్మూర్తికి

కనిపించి అతడి భయం పోగొట్టి మొండికి తేల్చేకన్నా రహస్యంగా అతడి కదలికల్ని గమనించాలి. అతని అభిరుచుల్ని తెలుసు కోవాలి. వాడికి నచ్చిన మార్గంలోనే వాడి భవిష్యత్తుకు పునాదులు వెయ్యాలి!

అలాంటి ఆలోచన కలగ్గానే అనంతరా మయ్య ఇక ఆ విషయం ప్రస్తావించకుండా మౌనంగా వెళ్ళిపోయాడు.



**రా**మ్మూర్తి బాదం చెట్ల దగ్గర చక్కర్లు కొడుతూ బాదం పండ్లకోసం ఆశగా తలెత్తి చెట్టు కొమ్మలవేపే చూస్తూ గంటల తరబడి కాచుక్కూర్చునేవాడు.

పచ్చటి బాదం ఆకులమధ్య పండిన బాదంపండ్లు ఎర్రగా గుత్తులు గుత్తులుగా కనిపించేవి. చిరుగాలికి సుతారంగా ఊగే బాదం కొమ్మలమీద వాలిన రామచిలుకలు, కోకిలలూ ఉయ్యాల లూగుతోన్నట్టే సుతా రంగా కదుల్తోంటే ఆ దృశ్యం ఎంత బావుం టుందో!

రామ్మూర్తి చూపులు ముందుగా బాదం చెట్లకింది నేలమీదికి ప్రసరించేవి. బాదం పండ్ల ఎర్రటి బెరడు ముక్కలు ముక్కలుగా అక్కడి నేలమీద రాల్తూ కనిపిస్తే చెట్టుమీది పండ్లను చిలుకలు కొడుతున్నట్లే లెఖ్ఖ! అప్పు డతనికి ఎంత సంతోషం వేసేదో! చివాల్న తలెత్తి చెట్టుకొమ్మలమీదికి చూపులు నాటే వాడు. పండ్లను ముక్కుతో పొడుస్తోన్న చిలుక కనిపించేది. నోరూరేది. ఆ చిలుక బాదంపండు తొడిమను కొరికితే కిందికిరాలే పండును తలచుకొని ఎంతగా ఆనందించే వాడో!

అతని అంచనా నిజమయ్యేది. బాదం పండు ఎప్పటికో కిందరాలేది. ఆత్రంగా దాన్ని చేత్తో తీసుకొని ఆబగా కొరికి తినే వాడు. చిలక్కొట్టిన బాదంపండు ఎంత మధురంగా వుంటుందో!

ఊరికి తూర్పుదిక్కున వున్న ఆ రెండు బూడిదరంగు కొండల్లో ఎలాంటి ధ్యేయమూ లేకుండానే సంచరించేవాడు రామ్మూర్తి. ఊరి వెలుపలి పచ్చిక బయ ళ్ళలో కాలం గడిపేవాడు. పచ్చటి పంటపొ లాల గట్లమీద కేరింతలు కొడుతూ తిరిగే వాడు.

సాయంకాలపు వేళల్లో చెరువుకు చేరి గట్టుమీదే కూర్చునేవాడు.

అలా ఎంత సమయం ఇట్టే గడిచిపో యేదో!

మలిసంధ్య సూర్యుడి నారింజరంగు కాంతి కిరణాలు ఆ చెరువు నీటిమీద పడి పరావర్తనం చెందుతూ చెరువూ, గట్లూ, కొంతమేరకు చెరువుపైని శూన్యంగూడా కెంపువర్ణంలో అందంగా మెరిసేవి.

క్రమంగా సూర్యుడు పడమటి కనుమ ల్లోకి జారిపోయి పల్చటి చీకటితెరలు ప్రకృ తిని కమ్ముకునేవి.

వెల్తురునించి చీకటికి పరివర్తన చెందే ఆ సమయంలో పరచుకునే నిశ్శబ్దం ఎంత హాయిగా వుంటుందో! అలసిన మనసులకు విశ్రాంతినిచ్చే చిత్రమైన మహిమ ఆ సమ యానికే వుంది!

సరిగ్గా ఆ సమయానికే చెరువు గట్టుమీ దున్న అమ్మవారి చిన్న గుడి దగ్గరికి తత్త్వాలు పాడే సాధువు తాత వచ్చి కూర్చు నేవాడు.

చీకట్లు ముదిరి, ఆకాశంలో చుక్కలు సింగారించుకుని చెరువు నీటి అద్దంలోకి తొంగి చూస్తోంటే అలలమీద అలవోకగా కదుల్తూ అవ్వన్నీ వజ్రాల్లా మెరుస్తుండేవి.

తత్వాల సాధువు తాత అప్పుడే కంఠం విప్పేవాడు. చుట్టూ పరుచుకున్న నిశ్శబ్దాన్ని చీల్చుకుంటూ తాత రాగాలాపన వినిపించేది. ఆ ఆలాపనకు నీటి అలలు కూడా పరవశం చెందినట్లు చలనం మాని, చుక్కలను కూడా కదలనీయక సందిట్లో బంధించేవి.

ఆశాసౌధాలేవో ఫెటేల్మని పేలిపోయి, బ్రతుకు మిగిల్చిన విషాదపు సారానికి స్వర కల్పనే సాధువు తాత పాడే తత్వాలు. సర్వం ఛిద్రమై శాపవశాత్తు ఒంటరిగా ఆవేదన చెందేందుకు మాత్రమే మిగిలే వ్యధా తప్త జీవితాల ఆక్రందనలకు అక్షరరూపాలే తాత తత్వాలు!

అంత చిన్న వయసులోనే రామ్మూర్తిని ఆ తత్వాలు బాగా ఆకర్షించేవి. అందుకు కారణం ఆ తత్వాలలోని సాహిత్యమో, సందేశమో, లేక ఆ సాధువు తాత శ్రావ్యమైన కంఠంలోని లయ, తూగు, ఆర్తి, ఆర్ద్రత, విషాదమో ఏమో!

రాత్రివేళల్లో అలా చెరువుగట్టుకు వెళ్ళి ఇంటికి చాలా ఆలస్యంగా వచ్చేవాడు రామ్మూర్తి. అతని తల్లిదండ్రులు ఆ విషయంలో అనంతరామయ్యను ఆరా తీసేరు కూడా.

"అబ్బే! వాడు ఎక్కడికీ వెళ్ళటంలేదు. మా ఇంట్లోనే చదువుకుని పొద్దుపోయాక ఇంటికి వెళ్తోన్నాడు" అని చెప్పి వాళ్ళను సమాధానపరిచేవాడు అనంతరామయ్య.

అతను ఆలోచనాపరుడు కాకపోయి వాళ్ళకు నిజం చెప్పివుంటే రామ్మూర్తి ఏమయిపోయేవాడో!

★ ★ ★

ఆరోజు అనంతరామయ్యకు వంట్లో నలతగా వుండి మగ్గం వెయ్యలేదు. కషాయం ఏదో మింగి విశ్రాంతిగా పడుకున్నాడు.

రామ్మూర్తి వచ్చాడు. అనంతరామయ్య పడుకున్న మంచం దగ్గర నిలబడి "మామయ్యా..." అని పిల్చేడు నెమ్మదిగా.

అనంతరామయ్య కళ్లు తెరిచి చూసి "ఏంటి? " అని అడిగాడు.

"ఇంట్లో చిలకపచ్చరంగు అయిపోయిందిట. నూలు తడపాలిట. మీ ఇంట్లో రంగుంటే తెమ్మన్నాడు నాన్న. పట్నంనించి రెండురోజుల్లో తెప్పించి ఇస్తానని చెప్పమన్నాడు"

"నువ్విలా వచ్చి కూర్చో" పిల్చేడు అనంత రామయ్య పైకిలేస్తూ.

రామ్మూర్తి వెళ్ళి మంచం పట్టీమీద ఒదిగి కూర్చున్నాడు.

"అమ్మా... సుందరీ!" పిల్చేడు అనంతరామయ్య పెద్దగా.

ఇంట్లోంచి వచ్చింది సుందరి.

"చిలకపచ్చ రంగు డబ్బా పట్టుకు వెళ్ళి మామయ్యగారింట్లో ఇచ్చిరా. బావ మనింట్లో ఉన్నాడని చెప్పు" అన్నాడు అనంతరామయ్య.

"అలాగే!" అని సుందరి లోపలికి వెళ్ళింది.

ఇంకా తల వంచుకునే కూర్చున్న రామ్మూర్తి భుజంమీద చేత్తో తట్టి "బాగా చదువుతున్నావా? " అడిగాడు అనంతరామయ్య.

రామ్మూర్తి జవాబు చెప్పలేదు.

"నేను నీ వయసులో వున్నప్పుడు నాకూ బడికి వెళ్ళాలనిపించేది కాదు. ఎప్పుడూ పచ్చటి పంటపొలాల వెంట తిరగాలనీ, కోతికొమ్మంచులు ఆడాలనీ, చెరువు నీళ్ళలో ఈదాలనీ, చెరువు గట్టుమీదే సాయంత్రాలు గడపాలనీ అనిపించేది..."

అనంతరామయ్య చెప్పేదింకా పూర్తికాకుండానే రక్కున తలెత్తి అతనివేపు చూశాడు రామ్మూర్తి.

"ఆ వయసులో అలా అనిపించటం సర్వ

సాధారణం! అయినా చదువుకోమని చెప్పా ల్సిన అవసరం అంతగా ఎవ్వరికీ కనిపిం చదు, కొన్ని సందర్భాల్లో తప్ప! చదువుమీద ఆసక్తి వుంటే ఎవరికి వాళ్ళే చదువుకుం టారు. అలా చదువుకోలేదంటే మనసు, ఆసక్తికరమైన మరో అంశంమీద లగ్నమై నట్లే! కాకుంటే నేను చేసిన పొరపాటల్లా బడికి వెళ్ళి చదువుకోకపోవటం కానేకాదు. నిర్భయంగా నాకు దేనిపట్ల ఆసక్తివుందో పెద్దలకు చెప్పకపోవటమే!" అని రామ్మూర్తి వైపు పరీక్షగా చూశాడు అనంతరామయ్య.

రామ్మూర్తి దవడ కండరాలు కంపిం చేయి. మెల్లగా పెదాలు విప్పి మాట్లాడేడు. "నాకు... నాకు... బడంటే ఇష్టంలేదు!" అన్నాడు దృఢంగా.

"మరి ఏంచేస్తావ్?"

"ఇంట్లోనే పనిచేస్తాను. రంగుల నీళ్లలో ముంచి నూలు తడపటం అంటే నాకు చాలా ఇష్టం" చెప్పాడు రామ్మూర్తి.

అనంతరామయ్య దీర్ఘంగా ఆలోచిం చాడు. వాడ్ని మందలించేకన్నా వాడి పసి మనసు నొచ్చుకోకుండా నచ్చచెప్పేందుకు మార్గం నిర్ణయించుకుని, "సరే! నీ ఇష్టప్రకా రమే కానీ! సమయం చిక్కినప్పుడల్లా ఇంట్లో నీకు నచ్చినపనే చెయ్యి. కాకుంటే ఇప్పుడే బడి మానెయ్యకు. కొంతకాలం ఎలాగోలా బడికి వెళ్ళి కొంతవరకన్నా చదువుకో! నిదా నంగా చదువు మానేసి పన్లో పడుదువు గాని" అన్నాడు అనంతరామయ్య.

రామ్మూర్తి ముఖంలో సంతోషం తొంగి చూసింది. "అలాగే మామయ్యా!" అన్నాడు ఆనందంగా.

అటు తర్వాత రామ్మూర్తి బడికి వెళ్ళటం మానెయ్యలేదు! సెలవు రోజుల్లో, బడిలేని సమయాల్లో ఇంట్లో రంగులు కలపటం, మగ్గాల దగ్గర నిలబడి నేతనేయడాన్ని శ్రద్ధగా గమనించటం, అప్పుడప్పుడూ బయ టకు వెళ్ళి ప్రకృతి అందాలను గమనిం చటం, బాదంపండ్లు తింటూ చెరువుగట్టున కూర్చోటం, ఈత కొట్టటం కూడా మానేదు.

★ ★ ★

అప్పటిదాకా పెద్ద పెద్ద గ్రామపంచా యితీ కార్యాలయాల్లో మాత్రమే పనిచేసిన గుమాస్తా సుబ్బారావు సర్వీసులో ఏవో అవ కతవకలకు పాల్పడితే ప్రథమ తప్పుకింద మన్నించి కనీస శిక్షగా భారతీపురానికి బదిలీ చేశారు.

గ్రామవ్యవస్థ వరకు భారతీపురం బాగానే వుంటుందిగానీ మిగతా ప్రపంచంతో పోలి స్తేనే అది వెనకబడి వుంది. రైలుమార్గం లేకపోవటం, ఉన్న ఒకేఒక్క ప్రైవేటు బస్సు రోజుకు రెండుసార్లు మాత్రమే ఆ గ్రామాన్ని దర్శించటం.

బాహ్య ప్రపంచంతో భారతీపురానికి నిత్య సంబంధాలుండే అలాంటి సౌకర్యాలు లేక పోవటంవల్లనే ప్రభుత్వం దృష్టిలో ఆ గ్రామం శిక్షార్హులైన ఉద్యోగులను బదిలీచేసే ఊరుగా మాత్రమే నమోదైంది. గ్రామప్ర జలు మాత్రం స్వపరిపాలనలో ఎలాంటి ఒడిదుడుకుల్లేకుండా ప్రశాంత జీవనం సాగిస్తూ ఇంకా మానవీయ విలువలకు దూరంకాకుండా బ్రతుకుతోన్నందుకు ఆనం దిస్తోన్నారు.

కొత్తగా వచ్చిన పంచాయితీ గుమాస్తా సుబ్బారావు కూతురు రమణి కూడా బళ్ళో చేరింది.

కొత్తదనపు బెదురు, బిడియం పోయేం దుకు పట్టిన వ్యవధిలో బడిపిల్లలకు రమణి ఎలాంటి తలనెప్పీ తేలేదుకానీ కాలం గడిచే కొద్దీ కొత్తదనపు బెదురుపోయి ఆ అమ్మాయి కయ్యానికి దిగటం మొదలుపె ట్టింది.

ఆరోజు రామ్మూర్తి జ్వరం తగిలి బడికిపో లేదు. పంతులుగారు పిల్లలచేత ఎక్కాలు చెప్పించి బడి విడిచిపెట్టగానే పిల్లలంతా వీధిలో కొచ్చారు.

రమణి సుందరి వెనుకనే నడుస్తూ పద





డుగులు వేసేక పంతులుగారు చూట్టంలేదని నిర్ధారించుకుని సుందరి జడపట్టుకుని బలంగా వెనక్కు లాగింది. సుందరి వెనక్కు పడబోయి చివరి క్షణంలో ఎలాగో తట్టుకుని కోపంగా రమణిని చూస్తూ, "ఎందుకే నా జడ లాగావ్?" అనడిగింది, వచ్చే దుఃఖాన్ని తమాయించుకుంటూ.

నిజానికి రమణి అలా ప్రవర్తించటానిగ్గానీ, సుందరిపై కోపం తెచ్చుకునేందుకుగానీ ప్రత్యేకమైన కారణం ఏమీలేదు. కాకుంటే సుందరి కాస్త అందవికారంగా వుంటుంది. వేషధారణ కూడా 'అనాగరికం'గా వుంటుంది.

మునసబుగారమ్మాయీ, కరణంగారమ్మాయీ, మోతుబరి రైతుల పిల్లలూ ఎంతో అందంగా ముస్తాబై బడికి వస్తారు. సుందరి మాత్రం చేనేత నీరుకావి బట్టలు ధరించి నూనెమరకల గుడ్డసంచీ భుజానికి తగిలించుకుని దర్భపుల్లకు కాళ్ళొచ్చినట్టే కదిలి వస్తుంటుంది.

సుందరిపట్ల ఏహ్యాభావానికి రమణికి ఆ కారణం చాలు. నాగరికత బాల్యంలోనే రమణి మనసులో నాటిన సంస్కారపు బీజాలు అలాంటివి!

"ఏంటే, అలా గుడ్లు మిటకరించి చూస్తావ్? కొడతావా ఏం?" అని రమణి సుందరివేపు ఆగ్రహంగా చూసి, "పోవే బక్కముండా! నువ్వూ, నీ అవతారం!" అంది ఛీత్కారంగా.

మునసబుగారి అమ్మాయి మధ్యలో కల్పించుకుని ఇద్దర్నీ విడదియ్యటంతో ఎవరిదారిన వాళ్ళు వెళ్ళిపోయారు.

బడినించి ఇంటికి వెళ్ళి సంచిని గిరాటేసి మంచం మీద ఏడుస్తూపడుకుంది సుందరి.

భాగ్యమ్మ ఏదోపనిమీద అక్కడికి వచ్చి సుందర్ని చూసింది. ఆత్రంగా వెళ్ళి పక్కనే కూర్చుని చేత్తో తల నిమురుస్తూ "ఏంటమ్మా సుందరీ ఏడుస్తున్నావ్?" అని అడిగింది లాలనగా.

సుందరికి అమ్మ స్పర్శ మరింత ఏడుపు తెప్పించింది. పెద్దగా ఏడుస్తూ లేచి కూర్చుని, వెక్కిళ్ల మధ్య ఒక్కోమాటనే పెగల్చుకుంటూ "అమ్మా! నేను బక్కదాన్నా?" అనడిగింది.

"ఎవరన్నారమ్మా?"

"ఎవరైతేనేం! నిజం చెప్పు!"

క్షణకాలపు సంధిగ్దం తర్వాత అంది భాగ్యమ్మ.

"ఇలా బక్కగా ఎల్లకాలం ఉండవులే తల్లీ! బాగా చదివి పెద్ద ఉద్యోగంలో చేర్తే ముందు ముందు కార్లలోనే తిరుగుతావ్. అప్పుడు వంటికి కొవ్వు అదే పడుతుంది. నువ్వూ లావవుతావమ్మా"

"ఇప్పుడు నేను బక్కదాన్నేగా?"

"అలా ఎవరన్నారూ?"

"రమణి"

"దాని ముఖం" అంది భాగ్యమ్మ తేలిగ్గా.

"నా బట్టలు అసహ్యంగా ఉంటాయా?" మళ్ళీ మరో సమస్యను లేవనెత్తింది సుందరి.

"అది అబద్ధం! చాలా బాగుంటాయి!"

"మరి అది అలా అంటుందేం?"

అంతలో అనంతరామయ్య అక్కడికి వచ్చాడు.

సుందరి పక్కనే కూర్చుంటూ "గాంధీగారి పాఠం నువ్వు చదివావా తల్లీ?" అడిగాడు గంభీరంగా.

"ఓ... చదివాను" గర్వంగా అంది సుందరి.

"బాపూజీకి తొడుక్కునేందుకు మంచి బట్టల్లేకనా అలా ఓ చిన్న కొల్లాయి గుడ్డతో కాలం వెళ్ళదీసింది. మనుషులకు కావాల్సింది డాంబికాలు కావమ్మా, చిత్తశుద్ధీ, విజ్ఞానం, లక్ష్యశుద్ధి మాత్రమే"

సుందరికి తండ్రి చెప్తోంది పూర్తిగా అర్థం కాలేదు.

"...మనం జీవిస్తోంది చేనేత బట్టల వ్యాపారంతో! మనం ఉత్పత్తి చేస్తోన్న బట్ట

లకు మనమే విలువ ఇవ్వకపోతే ఎలా? మనం స్వయంగా నేసుకున్న బట్టలు ధరించినప్పుడే మనకు ఆనందం. గాంధీగారూ నూలు వడికేవారు తెలుసా? " అన్నాడు అనంతరామయ్య.

సుందరి వింతగా చూసింది.

"... అంచేత మనం ఈ బట్టలే వేసుకోవాలి. మనమేం గాంధీగారికన్నా గొప్పవాళ్ళమేం కాముగా"

"మరైతే మునసబుగారమ్మాయి, కరణం గారమ్మాయి, గుమాస్తాగారమ్మాయీ గాంధీ తాతకన్నా గొప్పవాళ్ళా? "

"కారు! కాలేరు!"

"మరి వాళ్ళు మంచి బట్టలు ఎందుకు వేసుకుంటారు? "

అనంతరామయ్య ఫక్కున నవ్వాడు! సుందరి తలమీద ఆప్యాయంగా పిడికిలితో చిన్నగా మొట్టి "నువ్వు పాటలు బాగా పాడ్తావుకదూ? " అని అడిగాడు చర్చను దారి మళ్ళిస్తూ.

"ఓ బాగానే పాడ్తాను" అంది సుందరి.

"మరి మీ నేస్తాలెవ్వరూ అలా పాడలేరేం? "

సుందరికి సమాధానం తోచలేదు. మౌనంగా చూస్తోంది.

"అందుచేత, ఎవరి ఇష్టం వాళ్ళది. ఎవరి అభిరుచి వాళ్ళది. ఎవరి గొప్పతనం వాళ్ళది. మనం ఆదర్శంగా తీసుకోవాల్సింది త్యాగపురుషుల జీవితాలనే కానీ డాంబికాలను కాదు!"

సుందరికి తండ్రి చెప్పింది పూర్తిగా అర్థం కాకపోయినా గాలికి మబ్బులు విడిపోయినట్టు మనసుకేదో శాంతి లభించింది. ఇక ఏడవలేదు సుందరి.

మరుసటిరోజు పొద్దున్నే సంచి భుజానికి తగిలించుకుని బడికి బయల్దేరింది.

రమణి గుర్తొచ్చి సుందరికి భయమేసింది!





అది అంత చిన్నతనంలోనే గవిడిగేదెలా వుంటుంది. నిన్న సమయానికి మునసబుగారమ్మాయి సర్ది చెప్పింది కానీ లేకపోతే ఆ గేదె ఒకపట్టాన తనను విడిచిపెట్టేది కాదు.

బడికి వెళ్ళేందుకు సంకోచిస్తూ చిన్న చిన్న అడుగులు వేస్తూ నడవసాగింది సుందరి.

సరిగ్గా బొడ్రాయి దగ్గర వచ్చి కలిశాడు రామ్మూర్తి.

రామ్మూర్తిని చూడగానే సుందరికి ఎక్కడలేని ధైర్యం వచ్చింది.

"బావా! జ్వరం తగ్గిందా? " అని అడిగి "తగ్గింది" అని అతను చెప్పింతర్వాత నిన్న జరిగిందంతా పూసగుచ్చినట్టు చెప్పింది సుందరి.

రామ్మూర్తి ముఖంలో ఎలాంటి భావమూ కనిపించలేదు. "నిన్ను జడపట్టుకుని లాగిందా? " అని శాంతంగానే అడిగాడు.

"ఒట్టు" తలమీద చెయ్యి పెట్టుకుని అంది సుందరి.

రామ్మూర్తి మరేం మాట్లాళ్ళేదు.

ఇద్దరూ బడివేపుకు సాగిపోయారు.

ఆ సాయంత్రం బడి విడిచిపెట్టగానే సరిగ్గా నిన్నటి వేళకే రోజారమణి జడపట్టుకుని లాగి వెనక్కు పడవేశాడు రామ్మూర్తి.

ఆ దృశ్యం చూసిన సుందరికి ఎంత సంతోషం కల్గిందో, అంతకన్నా రెట్టింపు అభిమానం బావమీద ఏర్పడింది!

★ ★ ★

పంచాయితీ గుమాస్తా సుబ్బారావు తాగి తూల్తూ, కర్రసాము చేసేటప్పుడువేసే అడుగులకు మల్లేనే అడ్డదిడ్డంగా అడుగులు వేస్తూ కోపంగా రామ్మూర్తి ఇంటివేపుకు సాగిపోతున్నాడు.

అతను పూటుగా తాగినట్లు అతడి వాలకం చూస్తేనే అర్థమైపోతోంది! ఊరు ఊరంతా ముక్కుమీద వేలేసుకుంది.

సుబ్బారావలా వీధిలోంచి నడిచి వెడుతోంటే అరుగులమీద గుసగుసలు మొదలయ్యాయి. ఆడవాళ్ళు కూడా ఇళ్ళల్లోంచి

బయటికి వచ్చి గుమ్మాల దగ్గర నిలబడి వింతగా చూస్తున్నారు.

తాగినవాడ్ని అంత చోద్యంగా చూట్టం వెనుక కారణం లేకపోలేదు.

భారతీపురంలో తాగుడు నిషిద్ధం! తాగే వాళ్ళను ఆ గ్రామస్తులు అసహ్యించుకుంటారు. ఊరంతా కట్టుబాటుగా వుండి ఒకే మాటమీద అందరూ నిలబట్టం, సాంఘిక దురాచారాలకూ, వ్యసనాలకూ గ్రామస్తులందర్నీ దూరంగా ఉంచటం ఆ ఊళ్లో ఆనవాయితీ! ఆచారం కూడా!

ఆ గ్రామస్తులకు తెలిసిందల్లా 'తాగటం' అంటే బతుకులో అన్నింటికీ రోసిపోయిన చట్టధిక్కారులూ, సంఘధిక్కారులూ, వృధాగా, నిష్కారణంగా జీవిస్తోన్నవాళ్ళూ త్వరగా తనువు చాలించేందుకు తీసుకునే విషం అని మాత్రమే!

చట్టం, ప్రభుత్వం అందర్నీ తాగమన్నా ఆ గ్రామం మాత్రం అలా తాగుడుకు దూరంగా ఉందంటే తాగుడుపట్ల వాళ్ళ మనసుల్లో కుదురుకున్న ఆ అభిప్రాయమే! వారి అభిప్రాయం సడలిపోనందుకే ఆ గ్రామంలో తాగుడు అలవాటు చేసేందుకు చేసిన కొందరి చర్యలన్నీ విఫలమయ్యాయి.

సుబ్బారావు ఎలాగైతేనేం కష్టపడి నడిచి వెళ్ళి రామ్మూర్తి ఇంటిముందు నిలబడి పెద్దగా రంకెలు వెయ్యటం ప్రారంభించాడు.

"ఎవడ్రా... ఇంట్లో? దమ్ముంటే బైటికి రాండి! ఎవడ్రా డ్రామ్మూర్తంటే? ఇది గవర్నమెంటాఫీసర్ సుబ్బారావ్ ఛాలెంజ్! సుబ్రావ్ ఛాలెంజ్రా ఇది! బైటకి రాండి!"

సుబ్బారావు రంకెలు కూడా నంగిగానే ఉన్నాయి!

రామ్మూర్తి నాన్న, అమ్మ మగ్గాలు వదిలి పెట్టి వచ్చారు.

"ఏమైందండీ?" అడిగేరు.

"రామ్మూర్తంటే ఎవడ్రా?" అనడిగేడు సుబ్బారావు.

"మా అబ్బాయే!"

"పిలువ్ వాడ్ని! గవర్నమెంటాఫీసర్నా... మజాకా? మా అమ్మాయినే జడ పట్టుకుని... జడ పట్టుకుని... జడ పట్టుకుని..."

"రేపు మాట్లాడొచ్చులే వెళ్ళండి సుబ్బారావుగారూ!" అన్నారు అక్కడ గుమికూడిన జనంలోనించి ఎవరో.

"రేప్ కాదు! జడ్లాగాడు! తేలాలిప్పుడే!"

"ఏందోయ్ తేల్చేది? తాగిన తిక్కలో పిచ్చివాగుడు వాక్క! పిల్లల తగవుకు తగుదునమ్మా... అంటూ మందు కూడా వేసుకొని వచ్చావా? ఇది ఏ ఊరనుకుంటున్నావ్, భారతీపురం! మక్కెలు విరగ్గలవు జాగ్రత్త!"

"హాయ్, నన్నే అంటారా! గవర్నమెంటాఫీసర్ని..."

"చేసేది బోడి గుమాస్తా ఉద్యోగం... ఆఫీసరంట, ఆఫీసరు"

"హాయ్! చూపిస్తా...న్నా ఆఫీసర్తనం! వీళ్ళ.. వీళ్ళ మగ్గాలకు పన్నులు ఎక్కువ వేయించకపోతే నేను ప్రభుత్వాన్నే కాదు" అన్నాడు సుబ్బారావు తొడగొట్టి సవాలు చేస్తూ.

సుబ్బారావలా అధికారపు పంజాను విసిరే సమయంలో సరిగ్గా అప్పుడే అనంత రామయ్య కబురు తెలిసి అక్కడికి వచ్చాడు. కరణం, మునసబు కూడా వస్తున్నారని తెలిసింది.

"సుబ్బారావుగారూ! చిన్న విషయానికి అనవసరంగా తాగి రాద్ధాంతం చెయ్యకండి"

సుబ్బారావుతో అన్నాడు అనంతరామయ్య.

సుబ్బారావు ఆ మాటతో మరింతగా రెచ్చిపోతూ "తాగి" అంటావేం? నా డబ్బుతో నా మందు నేను కొనుక్కుని నేన్తాగుతున్నాను. రోజూ తాగుతాను! నా ఇష్టం! ఏం... తాగితే తప్పా? నా మీద గవర్నమెంటుకు రిపోర్టిస్తావా? నేన్తాగుతుండాగవ

ర్నమెంటు మందే!" అని వెకిలిగా నవ్వేడు సుబ్బారావు.

అతడి నోటినించి ఆల్కహాల్ వాసన గుప్పుమంటోంది.

మునసబు, కరణం వచ్చారు.

మునసబును చూడగానే సుబ్బారావు మరింతగా రెచ్చిపోతూ "సార్! మునసబు గారూ! మీరూ గవర్నమెంటే! నేనూ గవర్న మెంటే! చూడండి సార్, గవర్నమెంటుమీద వీళ్ళంతా..." అన్నాడు అసందర్భంగా.

"నువ్వు తాగున్నావా?" అడిగేడు మునసబు.

"అ... అవును!"

"మా భారతీపురంలో తాగుడు నిషిద్ధం!"

"మనదేశంలో నిషేధంలేదుగా సారూ... ఎవరైనా ఇక్కడ తాగవచ్చునన్నదే చట్టం!"

"ఆ చట్టాలతో మాకు ప్రమేయంలేదు. ప్రజల హితవుకోరి తయారుచేసిన చట్టాలకు మాత్రమే ఇక్కడ గౌరవం దక్కుతుంది. అవి మాత్రమే ఇక్కడ అమలు జరుగుతాయి" అని సుబ్బారావువేపుకు తీక్షణంగా చూసి-

"సుబ్బారావ్! దేవాలయాల్లోకి చెప్పులు వేసుకుని వెళ్ళటాన్ని ఏ చట్టమూ నిషేధించలేదు. అలా ప్రవేశిస్తే శిక్షించేందుకు భారతీయ శిక్షా స్మృతిలో సెక్షన్లేలేవు. అయినా ఎవ్వరూ పవిత్రమైన దేవాలయాల్లోకి చెప్పులతో ప్రవేశించరు. అది ఆచారాలకు, సంస్కారానికి, నైతిక విలువలకూ సంబంధించిన విషయం! అలాగే తాగుడు విషయంలో కూడా మా ఊరికి కొన్ని అభిప్రాయాలున్నాయి. ప్రజలను తాగమని ప్రభుత్వం ప్రోత్సహించినా మా గ్రామంలో అలాంటి ఆటలు సాగవ్. అవసరమైతే మేం ప్రభుత్వానిక్కూడా ఎదురు తిరుగుతాం తప్ప నైతిక విలువలను కోల్పోము. నువ్వు ప్రభుత్వం చెప్పిందని తాగుతూ నీ సంస్కృతిని భారతీపురంలో ప్రవేశపెట్టే ప్రయత్నం చేస్తే నీకు మా గ్రామం విధించే శిక్ష సంఘ బహిష్కారం! ఇది ప్రథమ తప్పుగా నిన్ను క్షమిస్తున్నాం. ఇకపైన ఇలా జరిగితే నువ్వు మా క్షమకు అర్హుడివి కాదు. ఇక నీ ఇష్టం!" అని మునసబు వెళ్ళిపోయేడు.

సుబ్బారావుకు నిషా దిగిపోయింది. రాయి దెబ్బ తిన్న దొంగపిల్లిలా నిశ్శబ్దంగా అక్కడ్నించి వెళ్ళిపోయేడు.

'ప్రభుత్వం' అలా తోక ముడిచింది!

ఆ రాత్రి, చాలాకాలం తర్వాత చెరువుగట్టుకు వెళ్ళి సాధువు తాత తత్వాలను విని ఆలస్యంగా ఇంటికి వచ్చిన రామ్మూర్తి తండ్రి చేతిలో చావుదెబ్బలు తిన్నాడు.

తెల్లవారింది.

మంచంమీద రామ్మూర్తి కనిపించలేదు.

అంతా వెదికారు. ఎక్కడా లేడు. అతడి పలకమీద అక్షరాలు మాత్రం కనిపించాయి.

"నాన్నా! నేను తప్పుచెయ్యలేదు. అయినా నువ్వు నన్ను కొట్టావు"

రామ్మూర్తి మళ్ళీ కనిపించనేలేదు.



**ము**నసబుగారి కృషితో కొత్తగా ఆ సంవత్సరమే భారతీపురానికి హైస్కూలు మంజూరైంది. దానికోసం ఆయన సొంత డబ్బు ఖర్చుపెట్టి జిల్లాపరిషత్తుకూ, రాజధా

నికీ ఎన్నిసార్లు తిరిగేడో!

జిల్లా పరిషత్తు అధ్యక్షుడు రామిరెడ్డితో మునసబుగారికి వున్న స్నేహం స్కూలు మంజూరు విషయంలో కీలకపాత్ర వహించింది. జిల్లా పరిషత్తువరకు జరగాల్సిన తతంగం మొత్తం రామిరెడ్డే పూర్తిచేసి ఆపైన ప్రభుత్వం ఇవ్వాల్సిన పర్మిషన్ల కోసం ఆయనే మునసబుగార్ని వెంటపెట్టుకుని స్వయంగా రాజధానికి నాలుగు పర్యాయాలు వెళ్ళేడు. విద్యాశాఖా మంత్రితో సిఫార్సు కూడా చేయించాడు.

దాంతో పని సులువైంది!

భారతీపురం గ్రామస్తుల ఆనందం అంతా ఇంతాకాదు! గతంలో పిల్లలను ఐదోతరగతి కాగానే హైస్కూల్లో చేర్పించేందుకు గ్రామస్తులు చాలా ఇబ్బందులు పడేవాళ్లు. పట్నం వెళ్ళి పిల్లల్ని హైస్కూల్లో చేర్పించలేక చాలా మంది బిడ్డల విద్యను అర్ధాంతరంగా ఆపివేసిన సందర్భాలూ ఉన్నాయి.

వేసవి సెలవులు కాగానే హైస్కూలు కూడా ప్రారంభం కావాలన్న పట్టుదలతో గ్రామస్తులంతా శ్రమదానంచేసి వసతి కల్పించారు. చందాలు వేసుకున్నారు. కొత్తగా రాబోయే హైస్కూలు సిబ్బంది నివాసం ఉండేందుకు ముందుగానే కొన్ని ఇళ్ళు ఖాళీ చేసి కడిగి శుభ్రంచేసి ఉంచారు. క్లాసుల్లో కావాల్సిన నల్లబల్లలు కూడా తయారు చేయించారు. హైస్కూలు నిర్మాణానికి స్థలాన్ని మునసబుగారే ఇచ్చారు.

ఒకరోజు జిల్లాపరిషత్తునించి అధికారులెవరో వచ్చారు. హైస్కూలు ప్రారంభానికి గ్రామస్తులు స్వయంగా చేసిన ఏర్పాట్లను చూసి తమ సంతృప్తిని వ్యక్తంచేసి వెళ్ళేరు.

విద్యార్థులకు వేసవి సెలవులు పూర్తి కావస్తోన్నాయి.

భారతీపురం హైస్కూలుకు నియమించిన సిబ్బంది ఒక్కొక్కరే కుటుంబాలతోసహా వస్తున్నారు. గ్రామస్తులు చూపించిన ఇళ్లలో కుదురుకుంటున్నారు.

స్కూలు ప్రారంభానికి సన్నాహాలన్నీ పూర్తయ్యాయి.

వారం రోజుల్లో స్కూలు ప్రారంభం కాబోతుందనగా ఒకరోజు జిల్లాపరిషత్తు అధ్యక్షుడు రామిరెడ్డి తణిఖీకి వచ్చాడు.

ఏదో ఆనవాయితీగా స్కూలును పరిశీలించి మునసబుగారింట్లో మధ్యాహ్నం భోంచేశారు.

మునసబు రామిరెడ్డి చేసిన సహాయానికి కృతజ్ఞతలు చెప్పబోగా మిత్రుడ్ని వారించి.

"అది సరేగానీ, స్కూలు ప్రారంభానికి మంత్రిగారు మీ ఊరికి వస్తున్నారు. ఏర్పాట్లు ఘనంగా చెయ్యండి. ఆయన సహాయంతోనే కదా ఈ స్కూలు మంజూరైంది" అన్నాడు గతాన్ని గుర్తుచేస్తూ.

"ఇంత కుగ్రామంలో ప్రారంభించే చిన్నపాటి స్కూలుకు విద్యాశాఖామంత్రిగారు వస్తారా? " సంభ్రమాశ్చర్యాలతో తబ్బిబ్బవుతూ అడిగేడు మునసబు.

"అవును! వస్తున్నారంతే! ప్రత్యేకంగా భారతీపురానికి పనిగట్టుకుని రావటం మాత్రం కాదు! అదంతా ఓ పెద్ద రాజకీయం! మిత్రుడివి కనుక చెప్తోన్నాను! ఏదో ఒక నెపంతో మంత్రిగారు రాష్ట్రమంతా పర్యటిస్తారట! ముఖ్యమంత్రిని దించి ఆయన ముఖ్యమంత్రి కావాలట!"

"దానికీ మా కుగ్రామ పర్యటనకూ ఏం సంబంధం? "

"ఉంది! ఈ పర్యటనలతో ప్రజలను సమీకరించటం, పనిలో పనిగా ఈ ప్రాంతపు శాసనసభ్యులతో మంతనాలు జరపటం, కార్యక్రమం లేకుండా పర్యటన జరిపితే ముఖ్యమంత్రికి అనుమానం వస్తుందని ఇలా ప్రారంభోత్సవాలు చేస్తోన్నారు రాష్ట్రవ్యాప్తంగా!"

మునసబుకు అంతా అయోమయంగా తోచింది. ఏదో రొంపిలోకి దిగుతోన్నట్టు తోచి బేలగా చూసేడు!



"సరే! అదంతా పెద్దోళ్ళ వ్యవహారం! ముద్దొచ్చినప్పుడే చంకెక్కాలన్నారు పెద్దలు! పన్లోపనిగా మంత్రిగార్తో మీ ఊరికి కావాల్సిన వసతులు చెప్పండి! పనులు చేయించుకోండి! ఈ అదను దాటితే ఆనక మీ మొర ఆలకించే నాథుడే ఉండడు!" హెచ్చరించాడు రామిరెడ్డి.

"మాకు... మాకు అవసరాలేమున్నాయ్! కావాల్సిన స్కూలు మంజూరైంది. అది చాలు!" అన్నాడు మునసబు!

రామిరెడ్డి అతనివేపు విచిత్రంగా చూసేడు!

"మీరింకా ఆదికాలంలోనే ఉన్నట్టుంది!" అని నవ్వి, "అయినా మీకు తెలియకపోయినా మీ అవసరాలేంటో మంత్రిగారికి తెలుసు. వారే అన్నీ చూసుకుంటారు" అని హామీ ఇచ్చి రామిరెడ్డి వాహనంలో ఎక్కి వెళ్ళిపోయాడు.

హైస్కూలు ప్రారంభమౌతోందనీ, అందుకు మంత్రిగారు వస్తున్నారనీ కలిగిన ఆనందంలో రోజులు త్వరగా గడిచిపోయాయి!

ఆరోజు రానే వచ్చింది!

ఉదయం పదిగంటల ఇరవై నిముషాల నలభై సెకండ్లకు మంత్రిగారు స్కూలు గుమ్మానికి కట్టిన రిబ్బను కత్తిరించాలని పండితులు నిర్ణయించారు.

భారతీపురం చాలా కోలాహలంగా ఉంది!

మంత్రిగారు వస్తున్నారు కనుక ఆరోజు పొద్దున్నే అందరికన్నా ముందుగా పోలీసు పటాలం వచ్చి గ్రామంలో దిగింది. వచ్చే పోయే ప్రభుత్వ వాహనాల రొదతో భారతీపురం హోరెత్తిపోతోంది.

అధికారులంతా అప్పటికే వచ్చారు.

ఆ నియోజక వర్గపు ఎం.ఎల్.ఏ.తోసహా చుట్టుపట్ల నియోజకవర్గాలకు చెందిన మరో ఐదుగురు శాసనసభ్యులు కూడా గ్రామానికి చేరుకున్నారు.

మునసబుకు వాతావరణం అర్థమైంది! రామిరెడ్డి చెప్పింది మననం చేసుకున్నాడు!

భారతీపురంలో ఓ కుట్రకు ఆరంభం జరగబోతోంది!

పోలీసు విజిళ్ళు...

అందరిలో ఏదో ఉత్సాహం...

అంతలోనే కలకలం...

వాహనాలు వస్తోన్నాయి...

అవి రేపుతోన్న దుమ్ము మేఘంలా ఊర్ని కమ్ముతోంది...

'భొ... భొ... భొ...భొ' అంటూ ఎస్కార్టు వాహనం మంత్రి రాకకు సంకేతంగా సైరన్ మోగిస్తూ వస్తోంది. దాని వెనుక బారులు తీరిన వాహనాలు వేగంగా వచ్చి స్కూలుముందు ఆగేయి.

మంత్రిగారు కారు దిగేరు.

శాసన సభ్యులు వారి చుట్టూ మూగేరు. దండలు వేసేరు. దణ్ణాలు పెట్టేరు. జనం మూగేరు. జనానికీ నాయకులకూ మధ్య వలయంలా నించొని పోలీసులు శాంతిని పరిరక్షిస్తున్నారు...

పంచాయితీ గుమాస్తా సుబ్బారావు హడావుడి అంతా యింతా కాదు! అందర్నీ తప్పిచుకుంటూ సరాసరి మంత్రిగారి పర్సనల్ సెక్రటరీ దగ్గరికి వెళ్ళి తననుతాను పరిచయంచేసుకున్నాడు. ఫారిన్ విస్కీ ఉందనీ, అవసరం అయితే కాకితో కబురు పెట్టమనీ చెప్పి, వెళ్ళి స్కూలు గేటు దగ్గరే నించున్నాడు.

మంత్రిగారి అలవాట్లు ఏంటో సుబ్బారావు గతంలోనే విన్నాడు! భారతీపురం కట్టుబాట్లు మంత్రికి తెలియవు కనుక మధ్యాహ్న భోజనాలకు ముందు గ్రామంలో వారికి 'మందు' ఏర్పాట్లు జరగవనీ, ఒకవేళ మంత్రిగారే ఆ ఏర్పాట్లు చూడమని ఆఖరి క్షణంలో ఆదేశించినా భారతీపురంలో బ్రాందీషాపులేదు కనుక సప్లై జరగదనీ సుబ్బారావు ముందుగానే ఊహించాడు.

అద సుబ్బారావుకు మంచి అవకాశంగా తోచింది! ఓ కుగ్రామంలో, మందు దొరకని





పరిస్థితుల్లో మంత్రిగారికి తను మందు సప్లై చెయ్యగల్గితే వారి దృష్టిలో పడేందుకు వీలుంటుంది. పైగా అలాంటి పరిచయం మిగతా అన్ని పరిచయాలకన్నా మహత్తర మైందని సుబ్బారావుకు తెలియంది కాదు!

అందుకే సుబ్బారావు పట్నం వెళ్ళి 'సీమ సరుకు' పట్టుకొచ్చాడు.

తన అమోఘమైన పథకానికి సుబ్బారావు గుంభనంగా నవ్వుకున్నాడు.

ముహూర్తం వేళయింది!

మంత్రిగారూ, కత్తెరా సరే... వేళకు రిబ్బను తెగిపోయింది!

మునసబుగారి అమ్మాయి ముందుగా ఫీజు కట్టటంతో అడ్మిషన్లు మొదల య్యాయి. సుందరి కూడా అదే రోజు స్కూల్లో చేరింది.

ఒకవేపలా అడ్మిషన్లు జరుగుతుంటే, మరోవేపు మంత్రిగారి ఉపన్యాసం మొద లైంది!

"డియర్ భర్తీపురం టెల్గూ బ్రదర్స్"

జనం ఘొల్లున నవ్వారు. "భర్తీపురం కాదు, భారతీపురం!" అని అరిచేరెవరో.

"సారీ! టెల్గూ వాడ్నే అయినా మంచిగ టెల్గూరాద్! ఇస్టడీస్ మొత్తాం ఫారిన్లనే! టెల్గూ లేంగ్వేజ్ మర్సినా భీ టెల్గూకూ, టెల్గూ పబ్లిక్కూ సర్వీస్ జేస్త! భర్తీపురానికి మెటల్ రోడ్లేపిస్త! విలేజ్ విలేజ్‌కో బస్సు సిస్టంల నంబరాఫ్ బస్సెస్ నడ్పిస్తా! మీ విలేజ్ల బఫెలోస్ మోర్‌గున్నయ్! మిల్క్ వేస్టయితది మిల్క్ ఛిల్లింగ్ సెంటర్కు మిల్క్ సేల్జేసుడు ఇస్టార్టు జెయ్యండ్రి! మీ విలేజ్ల మిల్క్ కలెక్షన్ సెంటర్... గదే న్వయ్యా... ఐ మీన్. పాల దొబ్బుడు కేంద్రం ఇస్టార్టు జేపిస్త! కేంద్రంల మిల్క్ సేల్జెయ్యండ్రి! మీ విలేజ్ల యానిమల్స్‌కు దవాఖానాలేదు. థర్టీబెడ్డ్ హాస్పిటల్ శాంక్షన్ జేపిస్త! జైహింద్!"

బహిరంగసభ జయప్రదమైంది.

వివిపీ సంతా మునసబుగారింటికి చేరుకు న్నారు.

అక్కడ ఎం.ఎల్.ఏలతో సమావేశం ఉంది. తర్వాత భోజనాలు, విశ్రాంతి, అనం తరం తిరుగుప్రయాణం.

మునసబు ఇంట్లో అందరూ విశ్రాంతిగా కూర్చున్నారు.

"విలేజ్ ప్రెసిడెంట్ ఎవరయ్యా?" మున సబును అడిగేడు మంత్రి.

"స్కూలు దగ్గరే ఉన్నారు. వస్తారు" చెప్పేడు మునసబు.

"రామ్రెడ్డీ!" జిల్లాపరిషత్తు అధ్యక్షుడ్ని దగ్గ రికి పిల్చేడు మంత్రి.

రామిరెడ్డి మంత్రిగారు కూర్చున్న కుర్చీ మీద చెయ్యేసి, కొంచెం కిందికి వొంగి "ఏంటి సార్?" అడిగేడు.

"ప్రైవేట్? అరేంజ్‌మెంట్స్ జెయ్యండ్రి. మీటింగ్ ఇస్టార్ట్ జేస్త!" అన్నాడు మంత్రి మంచినీళ్ళ గ్లాసుల వేపు నిర్లక్ష్యంగా చూస్తూ.

రామిరెడ్డికి అన్యాపదేశంగా మంత్రి చెప్పింది అర్థమైంది! హడావుడిగా మున సుబు దగ్గరికి వెళ్ళి చెవిలో రహస్యంగా అడి గేడు. "మందు తెప్పించలేదా?" అని.

మునసబు నిర్ఘాంతపోయాడు!

"మందా... మందా... అది మా ఇంటా వంటా లేదు! మా ఊళ్లో అది నిషిద్ధం!" చెప్పేడు మునసబు.

"అలాగంటే ఎలా... పెద్దవాళ్ళతో వ్యవ హారం! దేనికైనా పట్టువిడుపులుండాలి"

"క్షమించండి! ఈ విషయంలో రాజీలేదు!" కరాకండిగా అన్నాడు మునసబు.

రామిరెడ్డి నిస్పృహాయంగా చూసేడు! క్షణం తర్వాత, ఇక చేసేదేం లేదన్న నిర్ణ యానికి వచ్చి నెమ్మదిగా మంత్రిగారి దగ్గ రికి వెళ్ళి భారతీపురంలో మందు నిషేధం అన్న విషయం చెప్పేడు.

మంత్రి ముఖం కొలిమిలా మండింది!

"వెరీ బ్యాడ్! కంట్రీబ్రూట్స్! లిక్కర్ బ్యాన్జేసుడుకు ఎవళ్ళిచ్చారు అధికారం!

యాంటీ గవర్నమెంట్ కాన్స్పిరసీ జేస్తన్నరా... ఏం? " అన్నారు కటువుగా.

"పోనీ సార్! మీటింగ్ స్పాట్ మార్చుదాం. మున్సబింట్లో కాకుంటే ప్రెసిడెంటింట్లో మీటింగు చేద్దాం." చెప్పేడు స్థానిక ఎం.ఎల్.ఎ.

"ఆడేపార్టీ? " అడిగేడు మంత్రి ముఖం చిట్లిస్తూ.

"మన పార్టే!"

"మందుగిట్ల గొట్టేటోడేనా? "

"ఊరిభయానికి ఊర్లోకొట్టడు. నెలకి పాతిక రోజులు పట్నంలోనే ఉంటాడు!"

"అరే... ఏం కష్టం వచ్చింది వయ్యా వాన్కి!" నొచ్చుకున్నారు మంత్రి.

సరిగ్గా అప్పుడు జోక్యం కల్పించుకున్నాడు రామిరెడ్డి "సార్! మీటింగు ప్రెసిడెంటు ఇంటికి మార్చినా ప్రయోజనంలేదు. ఇప్పటి కిప్పుడు మందు కావాలంటే దొరకదు"

"వై? "

"ఈ ఊళ్ళో బ్రాందీషాపు పెట్టనివ్వలేదు!

మంత్రి ముఖం వాడిపోయింది. "అరే... ఏం కష్టం వచ్చింది వయ్యా విలేజర్సుకు! ఫికర్చెయ్యకండ్రి, దుకానం పెట్టిపిస్త" హామీ యిచ్చేరు మంత్రి.

అప్పటిదాకా అంతా మౌనంగా వింటున్న మంత్రిగారి పి.ఏ. మౌనం వీడి మంత్రి చెవిలో ఏదో చెప్పగానే "కాల్ మిష్టర్ సుబ్రావ్!" అని పెద్దగా అరిచేరు మంత్రిగారు.

పి.ఏ. ఆనందంగా వెళ్ళిపోయాడు.

మంత్రి రామిరెడ్డి వేపు గర్వంగా చూస్తూ "రెడ్డీ! లిక్కర్ ఈజ్ రెడీ! వాట్ ఎబౌట్ వెన్యూ? " అడిగేడు.

ఎం.ఎల్.ఎ.ల ముఖాలు వికసించాయి!

"ఎక్కడుంది మందు? " అడిగేడొక ఎం.ఎల్.ఎ

"మిష్టర్ సుబ్రాబ్! వర్కింగిన్ పంచాయత్ ఆఫీస్! దట్ నైస్ జంటిల్మన్ ఈజ్ ప్రొవైడింగ్!"

వెన్యూ ఎక్కడ? అన్న సందిగ్ధం తొలగిపోయింది స్థానిక ఎం.ఎల్.ఎ.కి. "సార్! మునసబు ఇంట్లో మీటింగుకు అభ్యంతరం ఉంటే ఇక అక్కడా ఇక్కడా ఎందుకు? సుబ్బారావింట్లోనే సెటిలౌదాం" అన్నాడు ఉత్సాహంగా.

మంత్రి అతనివేపు కోపంగా చూసేడు! మరో ఎం.ఎల్.ఎ మంత్రి భావాన్ని గ్రహించి స్థానిక ఎం.ఎల్.ఎను వారిస్తూ "నీకసలు లోకజ్ఞానంలేదు. అందుకే నూరు బూతుల్లో రిగ్గింగు చేయిస్తే నూటపాతిక ఓట్లతో గెల్చావ్! ఎంత అవసరానికి మందు సప్లై చేసినా ఆఫ్టాల్ ఓ గుమాస్తా ఇంటికి మంత్రిగారు వస్తారా? " అని మందలించేడు.

రామిరెడ్డి మళ్ళీ మునసబు దగ్గరికి వెళ్ళేడు.

"మందు విషయంలో వాళ్ళ తిప్పలేవో వాళ్ళే పడ్డారు. ఆ పాపం నీది కాదు. వాళ్ళను ఇక్కడే ఉండమను. లేకుంటే భవిష్యత్తులో మీ గ్రామం చాలా నష్టపోతుంది. అయినా అతిథిదేవోభవ అన్నారు కదా! ఇంటికి వచ్చిన వాళ్ళను ఆదరించటం నీ ధర్మం" అని నచ్చచెప్పేడు.

మునసబు దీర్ఘంగా నిట్టూర్చేడు. "సరే! అలాగే కానివ్వండి!" అన్నాడు అయిష్టంగానే.

సుబ్బారావు సరుకుతో వచ్చాడు. మీటింగు జయప్రదంగా జరిగింది. అంతా అయ్యాక వెడుతూ, వెడుతూ సుబ్బారావు తన వేపు గర్వంగా చూసిన చూపులూ, మంత్రిగారు కొరకొరా చూసిన చూపులూ మునసబుకు ఇప్పటికీ జ్ఞాపకమే!

★ ★ ★

ఏండ్లూ పూండ్లూ గడుస్తున్నా రామ్మూర్తి జాడేలేదు! అతడి ఆచూకీకోసం చేసిన ప్రయత్నాలన్నీ విఫలమయ్యాయి. అనంత




రామయ్య కూడా కాలికి బలపం కట్టుకుని తిరిగేడు. ప్రయోజనం లేదు!

ఒక్కగానొక్క కొడుకు అలా దూరం కావటంతో రామ్మూర్తి తల్లిదండ్రుల ఆవేదన వర్ణనాతీతంగా ఉంది! వ్యాపారం పట్ల కూడా వాళ్ళ ఆసక్తి సన్నగిల్లింది. మగ్గాలు మూలపడ్డాయి. రంగులు గడ్డకట్టి పోతోన్నాయి క్రమంగా వాళ్ళకు జీవితాలపట్ల కూడా ఆసక్తి సన్నగిల్లి పోసాగింది.

ఒకరోజు భారతీపురానికి భూత, భవిష్య ద్వర్తమాన కాలాలను కళ్ళతో చూసి చెప్ప గల మహానుభావుడొకరు వేంచేసేరు!

ఆరోజు అనంతరామయ్య ఊళ్లోలేడు. నూలు కొనుగోలుకోసం పట్నం వెళ్లేడు.

రామ్మూర్తి తల్లిదండ్రులు బలభద్రస్వామి మానవాతీత శక్తుల్ని ఆనోటా ఆనోటా విని రామ్మూర్తి విషయం అడిగేందుకు వారిని దర్శించేరు.

కరుణను వర్షించిన స్వామి చూపులకు వాళ్ళకు తొలి క్షణంలోనే ఎంతో ధైర్యం కల్గింది. ఆనందమూ కల్గింది. రామ్మూర్తి భూగోళంమీద ఎక్కడున్నా స్వామివారు ఇట్టే పట్టివ్వగలరన్న విశ్వాసమూ కుదిరింది.

పట్నం విడిచిపెట్టి బతుకు తెరువుకోసం భారతీపురం వచ్చిందగ్గర్నించి జరిగిందంతా స్వామివారికి విన్నవించుకున్నారు.

అర్ధనిమీలిత నేత్రాలతో స్వామివారు కొద్ది క్షణాలు మౌనంగా ఆలోచించారు. ఎందుకోగానీ చిరునవ్వు నవ్వేరు.

"అబ్బాయి జన్మించిన కాలం సరిగ్గా చెప్పండి" ఆదేశించారు కళ్ళు పూర్తిగా తెరిచి చూస్తూ.

వాళ్ళు వివరంగా రామ్మూర్తి జననకాలం, తేదీ, వారం, సంవత్సరం చెప్పారు.

"నక్షత్రం తెలుసా? "

నక్షత్రం చెప్పారు.

"మీ మేనకోడలు సుందరి సన్నగా, కొంచెం నల్లగా ఉంటుందని చెప్పారు కదూ? "

"అవును స్వామీ!"

"ఆ నక్షత్రంలో పుట్టిన మీ అబ్బాయికి ఆ అమ్మాయినిచ్చి పెళ్ళి చెయ్యాలని అనుకోవటమే మీరు చేసిన పొరపాటు! మీ వాడు వెళ్ళిపోవటానికి కారణం అదే! ఇద్దరి జాతకాలు విరుద్ధం! ఇకనైనా ఆ అమ్మాయి విషయం మీరు మర్చిపోగల్గితే మీ అబ్బాయి నిక్షేపంగా తిరిగి వస్తాడు" చెప్పేరు స్వామి.

వాళ్ళ ముఖాలు ఆనందంతో విచ్చుకున్నాయి!

"అయితే స్వామీ! తమరి ఆజ్ఞను అక్షరాలా పాటిస్తాం. ఒక్కగా నొక్కకొడుకు! వాడిని దూరం చేసుకుని మానసిక చిత్రవధ అనుభవిస్తున్నాం. ఇక మాకా శక్తి లేదు. తమరు దయతో అబ్బాయి ఆచూకీ చెప్పండి. ఆఘమేఘాలమీద వెళ్ళి వాడ్ని తెచ్చుకుంటాం"

స్వామివారు వారివేపు మెరుపు కళ్ళతో సౌమ్యంగా చూసేరు.

"భద్రాచలం వెళ్ళండి. గోదావరి పుణ్యనదిలో స్నానంచేసి శుచిగా రాములవారిని దర్శించి పూజించండి. మీరు ప్రసాదాలు ఆరగించే లోపే మీ అబ్బాయి మీకు కనిపిస్తాడు. రాములవారి అనుగ్రహం పొందండి!" అన్నారు స్వామి.

వాళ్ళ ఆనందం అంతాయింతాకాదు! సంవత్సరాలతరబడి గుండెల్ని పిండుతోన్న బాధంతా స్వామివారి ఒక్క మాటతో మటుమాయమైంది! అంత గొప్ప ఉపశమనానికి వాళ్ళు చెల్లించిన మూల్యం కేవలం నూట పదహారు రూపాయలు మాత్రమే!

స్వామివారి దగ్గర సెలవు తీసుకుని ఆరోజే భార్యా భర్తలిద్దరూ కలిసి భద్రాచలం ప్రయాణమయ్యారు.

రెండురోజుల తర్వాత అనంతరామయ్యకు భద్రాచలం రూరల్ పోలీసులు



పంపించిన కబురు అందింది!

భద్రాద్రి రాముడ్ని దర్శించుకునేందుకు వెళ్ళిన తన అక్క, బావ రోడ్డు ప్రమాదంలో మృతిచెందారు!

అనంతరామయ్య వెంటనే బయల్దేరి భద్రాచలం వెళ్ళేడు. అక్కా బావల శవాలను ఆస్పత్రినించి స్వాధీనం చేసుకుని అక్కడే శవ సంస్కారం జరిపించి బరువు గుండెతో ఇంటికి తిరిగివచ్చాడు.

స్కూలు ఇంటర్వెల్ సమయంలో వకుళ సుందర్ని అడిగిందారోజు,

"సుందరీ! నీ జాతకం బాగా లేనందుకే మీ బావ దేశాలమీదికి వెళ్ళాట్ట! అత్త, మామయ్య యాక్సిడెంట్లో చనిపోయారట..."

"ఎవరు చెప్పారు?" వకుళవేపు దీనంగా చూస్తూ అడిగింది సుందరి.

"అదే... రోజారమణి! అలా అందరి దగ్గరా వాగుతోంది"

"నువ్వూ నమ్మావా?"

"నేను ఆ విషయాన్ని అంతగా పట్టించుకోలేదు. దాని బుద్ధి మనకు తెలిసిందేకదా! మాధవితో కూడా అందిట. మొదట్లో మాధవీ నమ్మలేదు. కానీ అది ఆ విషయం వాళ్ళ పెద్దవాళ్ళతో చెప్తే 'నిజమే కావచ్చు' అన్నారట. పైగా ఆ విషయం చెప్పింది సాక్షాత్తు స్వామివారే కనుక నమ్మితీరాలన్నారట! దాంతో మాధవి కూడా నీ నష్ట జాతకంపట్ల నమ్మకం కుదిరింది" అంది వకుళ.

సుందరి కళ్లు తప్పిన చలమలయ్యాయి. కనుగొలుకుల వెంట జారిన కన్నీళ్లను భుజాలతో తుడుచుకుని వకుళవేపు చూసింది.

"పిచ్చిదానా! ఏడుస్తున్నావా? అయినా మాధవి నమ్మితే నేనూ నమ్మాలన్న రూలేం లేదుకదా!" అంది వకుళ శాంతంగా.

"అయితే నువ్వది నమ్మలేదుగా. నాకు అంతే చాలు! మాధవి ఎలాపోతే నాకేం? అయినా స్వామివారు చెప్పింది నమ్మాలంటే ఆయన చెప్పిందంతా నిజం కావాలిగా. బావ కనిపిస్తాడని స్వామివారు చెప్పింది నమ్మి వెళ్ళిన మా అత్తా, మామయ్య గడ్డి లారీకిందపడి చనిపోయారు. హైస్కూలు చదువు చదువుతున్న మాధవికి ఆపాటి ఆలోచనా జ్ఞానం లేకుండా గుడ్డిగా అలా నమ్మటం బాధగా ఉంది" అంది సుందరి జాలిగా.

"పోన్లే, దాని ముఖం! నీకు వచ్చిన అనుమానం నాకూ వచ్చింది. స్వామి చెప్పిందానికి భిన్నంగా జరిగిందికదా? అని అడిగేను దాన్ని. అది కూడా మొదట్లో సందేహించింది. ఇంటికి వెళ్ళి పెద్దలను అడిగిందిట! అందుకు వాళ్ళు అమ్మాయి జాతక ప్రభావం అంచనాలకు మించి అనర్థాలు తెచ్చిపెడుతోంటే గడ్డి లారీకిందపడి చావటం ఏం గొప్ప! గడ్డిపోచ గుచ్చుకునైనా చస్తారు! అన్నారట..."

సుందరి బరువుగా శ్వాస పీల్చుకుంటోంది!

రెండు క్షణాలు మౌనంగా గడిచేక "వకుళా! నా మనసేం బాగాలేదు. నేను ఇంటికి వెళ్ళిపోతాను. నువ్వు క్లాసుకు వెళ్ళు!" అంది సుందరి.

వకుళ సుందరి పరిస్థితి అర్థం చేసుకుంది. మరేం మాట్లాడకుండా క్లాసురూమ్ వేపుకు సాగిపోయింది.

పుస్తకాలను చేత్తో పట్టుకుని సుందరి ఇంటివేపుకు నడిచింది.

రామ్మూర్తి దేశాలమీదికి వెళ్ళిపోయిన కొత్తల్లో సుందరికి ఎంతో బాధనిపించింది. క్రమంగా ఆ బాధను మనసు పొరల్లో నిక్షిప్తం చేసుకుని దైనందిన జీవితంలోకి ప్రవేశించినా అంతా ఏదో యాంత్రికంగా గడిచిపోవటమే తప్ప ఆమెకు జీవితం ఆనందంగా అనిపించలేదు.

ఆ సాయంత్రం కరణంగారి తోటకు వెళ్ళి





చల్లగాలిలో కొంచెంసేపు కూర్చుని వస్తానని ఇంట్లో చెప్పి తోటవేపుకు బయల్దేరింది సుందరి.

తోటలో జాజిపందిరి కింద అరుగుమీద కూర్చుంటే బాగుంటుందన్న విషయం సుందరికి రామ్మూర్తివల్లనే అనుభవంలోకి వచ్చింది.

సాయంకాలపువేళలో పూలను స్పృశించి సుగంధాన్ని దొంగిలించి తెచ్చి పరిసరాలకు పంచిపెట్టే చల్లగాలులూ, నీరెండలో మెరిసే ప్రకృతీ, క్రమంగా చీకటి తెరలు కమ్ముకోగానే గూళ్లకు చేరి కువకువలాడే పక్షులూ, తమకంతో ఊగే లతలూ, కొమ్మలూ ఆకాశంలో మందంగా మెరిసే మినుకు చుక్కలూ...

దుఃఖం ఉపశమించేంతదాకా తనివిదీరా ఏడ్చేందుకు ఆ వాతావరణం ఎంతగా సహకరిస్తుందో!

సుందరి వెళ్ళి తోట తడిక తలుపును ఎత్తి దారిచేసుకుని లోపలికి వెళ్ళి అరుగు మీద కూర్చుంది.

దూరంనించి గాలి తెమ్మెర ఈలవేస్తూ వచ్చి పరామర్శించి వెళ్ళింది.

ఆ గాలి ఊపుకు ఆమె శరీరం జలదరించింది.

రామ్మూర్తీ, తనూ కలిసి ఎన్ని సాయంకాలాలు ఆ తోటలో అదే అరుగుమీద కూర్చున్నారో! వయోరీత్యా అతని మనసులో స్పష్టాస్పష్టంగా అప్పుడప్పుడే కలుగుతోన్న భావాలను అతడికి వచ్చిన మాటల్లో చెప్తోంటే ఆసక్తిగా వినేది సుందరి.

అతడి మాటల్లోని అర్థం తెలియకపోయినా ముఖకవళికలు మాటమాటకూ మార్చూ ఒక్కోసారి ఆవేశంగా, ఒక్కోసారి కన్విన్సింగ్‌గా చేతులు తిప్పుతూ, కళ్లను కదిలిస్తూ అనేక విషయాలు చెప్తోంటే పొద్దు ఇట్టే గడిచిపోయేది!

బాదంపండ్లు బాగుంటాయయట!

"అదేం కొత్త విషయం! బాగుంటాయని నాకూ తెలుసు!" అనేది ఉడికిస్తూ.

"నీకు తెలియదు! ఎర్రగా పండిన పండ్లన్నీ బాగుంటాయని మాత్రమే నీకు తెలుసు! కొన్ని చెట్లపండ్లు పైకి తెల్లగా ఉంటాయి! బెరడు కొరికి చూస్తే తెలుస్తుంది వాటి రుచి!" అనేవాడు రామ్మూర్తి.

చెరువుగట్టుని సాధువు తాత పాడే తత్త్వాలను గుర్తుచేసేవాడు.

"మసక మసక చీకటిలో ఆ తత్త్వాలు వింటుంటే బాగుంటుంది" అని రామ్మూర్తి అంటే-

"అంతా బడాయి! అర్థం తెలియదుగా... ఎలా బాగుంటాయి? " అనేది సుందరి

అతడు ముఖం గంటుపెట్టుకునేవాడు.

కొంచెంసేపు తీవ్రంగా ఆలోచించి "అర్థం తెలీకపోయినా తాతపాడే తత్త్వాలు బాగుంటాయంతే" అనేవాడు.

ఊరికి తూర్పుదిక్కుని ఆ కొండలను గురించీ, పచ్చటి పంటపైర్లను గురించీ, చెరువూ, దాని గట్టుమీది చిన్నగుడిని గురించీ కథలు కథలుగా చెప్పేవాడు రామ్మూర్తి.

తొలకరి జల్లులు కురిసినప్పుడు ఊరి మట్టి మిద్దెలు వానకు తడిసి వచ్చే మట్టి వాసనంటే అతడికి చాలా ఇష్టమట! పేడ ముద్దలమీద పూలుగుచ్చి, ముగ్గులమధ్య పెట్టే సంక్రాంతి పండుగ రామ్మూర్తికి ఇష్టమైన పండుగట! ఇంకా అలా ఎన్ని విషయాలు చెప్పేవాడో!

ఆమెకలా రామ్మూర్తి నిర్విరామంగా గుర్తొస్తున్నాడు.

ఇప్పుడూ బావ అరుగుమీద తన పక్కనే కూర్చుని కబుర్లు చెప్తున్నాడన్న భావన!

ఆమె సంతోషంతో పొంగిపోతోంది!

బావ కనిపించాడనీ, తను నష్టజాతకురాలన్నది నిజంకాదనీ భువన భువనాంతరాలూ పిక్కటిల్లేలా గొంతెత్తి అరిచి చెప్పాలన్న ఆత్రం!

ఆ గాలీ, కువకువల పక్షులూ, తలకిందులుగా ప్రపంచాన్ని చూసే గిజిగాళ్ళూ, నీలాకాశం, మినుకుచుక్కలూ, పూలతలూ, చెట్లూ... అన్నీ అందుకు సాక్ష్యం!

"అడుగో రామ్మూర్తి బావ! అడుగో రామ్మూర్తి బావ!" అంటూ ఉన్మాదినిలా పెద్దగా అరుస్తోంది సుందరి.

పొద్దుపోయినా ఇంకా అమ్మాయి ఇంటికి రాలేదని తోటలోకి అప్పుడే వచ్చిన అనంతరామయ్య ఆ అరుపులు విన్నాడు.

హడావుడిగా సుందరి దగ్గరికి వెళ్ళి ఆత్రంగా అడిగాడు- "బావ వచ్చాడా? ఏడీ? ఎక్కడ? " అని.

తను చెప్పింది నిజం కావాలన్న కాంక్షతో అది అబద్ధం అన్న నిజాన్ని జీర్ణించుకోలేని దుర్బలమైన మనస్తత్వంతో అది భ్రమే అయినా ఆ భ్రమలోని సంతోషాన్ని కోల్పోయేందుకు మనసు యిచ్ఛగించక, దృఢంగా అరిచి చెప్పింది సుందరి.

"అడుగో... బావ నిన్ను చూసి ఆ కొండలవేపుకు పారిపోతున్నాడు నాన్నా!"

"ఇంటికి త్వరగా వెళ్దాంపద. నిన్ను ఇంట్లోదించి నేను బావను పట్టుకొస్తాను" అన్నాడు అనంతరామయ్య.

సుందరి అరుగుమీంచి లేచింది.

తండ్రి వెంటే నడిచింది.

అనంతరామయ్య వడివడిగా నడుస్తూ ఇంటికి చేరేడు. సుందరిని ఇంట్లోదించి ముల్లుగర్ర, బ్యాటరీ లైటూ పట్టుకుని బయటికి నడిచాడు. ఇద్దరు మనుషుల్ని వెంటపెట్టుకుని కొండలవేపుకు సాగిపోయాడు.

భర్త హడావుడి గమనించిన భాగ్యమ్మ కూతుర్ని అడిగింది. "ఏం జరిగిందమ్మా? "

"బావ కనిపించాడు. నాన్నను చూసి పారిపోయాడు. వెదికి తెచ్చేందుకే హడావుడి!" అంది నిస్సంకోచంగా సుందరి.

భాగ్యమ్మ సంతోషంతో మనిషి రెండింతలైంది.

ఎప్పటికో అర్ధరాత్రి దాటింతర్వాత ఇంటికి నీరసంగా తిరిగి వచ్చాడు అనంతరామయ్య. కాళ్ళూ, చేతులూ కడుక్కుని బట్టలు మార్చుకుని లుంగీ కట్టుకుని వచ్చి మంచంమీద వాలేడు.

భాగ్యమ్మ కూడా అప్పటిదాకా మెలకువగానే ఉంది.

రామ్మూర్తి కనిపించాడనీ, అతడ్ని వెదికి తెచ్చేందుకు భర్త వెళ్ళాడనీ విన్న భాగ్యమ్మకు కొండంత బరువు దించినట్లనిపించింది. సుందరిని అతనికిచ్చి ముడివేస్తే అమ్మాయి పెళ్లి బాధ్యత సులువుగా తీర్చుకోవచ్చుననీ, అందునా అయిన సంబంధం, అమ్మాయి అదే ఊళ్లో కళ్ళముందు ఉంటుందనీ అనుకుంటే అలా రామ్మూర్తి అదృశ్యం కావటం, చాలా ఏళ్లకు తిరిగిరావటం జరిగింది.

అందుకే భాగ్యమ్మ భర్త, రామ్మూర్తిల రాకకోసం ఎదురుచూస్తూ కనురెప్పలు కూడా ముయ్యకుండా అలాగే కూర్చుని ఎదురుచూస్తోనే ఉంది.

అనంతరామయ్య ఒంటరిగా వచ్చి అలా నీరసంగా మంచంమీద వాలటంతో రామ్మూర్తి కనిపించలేదన్న విషయం ఆమె గ్రహించింది. అయినా మనసులోని ఆరాటాన్ని అణచుకోలేక భర్త దగ్గరికి వెళ్ళి "రామ్మూర్తి కనిపించలేదా? " అడిగింది చిన్నగా.

"కనిపిస్తే వెంట తెచ్చేవాడ్నికదా!" అన్నాడు విసుగ్గా అనంతరామయ్య.

"మీరు భోజనం చెయ్యకుండానే వెళ్ళారు. ఎక్కడెక్కడ తిరిగేరో, ఏమో! లేవండి. కొంచెం ఎంగిలిపడుదురు!"

"ఆకల్లేదు! కొంచెంసేపు మాట్లాడకుండా నన్ను ప్రశాంతంగా ఉండనీ!"

భాగ్యమ్మ వెళ్ళి కూతురు పక్కలో పడుకుంది.

తెల్లవారింతర్వాత అనంతరామయ్య యథావిధిగా తన దినచర్యలోకి వెళ్ళిపో




యాడు తప్ప రామ్మూర్తిని గురించి సుందర్ని ఒక్క మాట కూడా అడగలేదు.

ఇంట్లోంచి తెమిలి, స్కూలుకు వెళ్ళేదాకా తండ్రి ఎప్పుడు ఆ విషయం ప్రస్తావిస్తాడో, ఏం సమాధానం చెప్పాలో? అని సుందరి లోలోపలే చాలా ఆందోళన పడ్డది. తండ్రి ఆ విషయం గురించి అడక్కపోవటంతో ఊపిరి పీల్చుకొని రోజుటికన్నా పదినిము షాలు ముందుగానే స్కూలుకని బయల్దేరి వెళ్ళిపోయింది.

అనంతరామయ్య మగ్గానికి నూలుకం డెల్ని బిగిస్తూ యాంత్రికంగా పనిచేసుకుని పోతున్నాడే తప్ప అతడి ముఖంలో ఎప్పటి శాంతిలేదు. అలజడి, ఆందోళన స్పష్టంగా కనిపిస్తున్నాయి.

"అలా ఉన్నారేం? " భర్త వాలకం గమ నించి అడిగింది భాగ్యమ్మ.

"మరేంలేదు" అన్నాడతను సమాధానం దాటవేస్తూ.

రాత్రి భాగ్యమ్మ కూడా గాఢనిద్రలోకి జారుకున్న తర్వాత సుందరి నిద్రలో కలవ రించిన కలువరింతలు విన్నాడు అనంతరా మయ్య. ఆమె నిద్రలో ఒకసారి పగలబడి నవ్వింది. ఆ వెంటనే భోర్న ఏడ్చింది.

కూతుర్ని నిద్రలేపి మంచినీళ్లు తాగించేం దుకు అక్కడికి వెళ్ళాడు అనంతరామయ్య.

"బావా! నేను నష్టజాతకురాలినని అందరూ అంటుంటే బాధేసింది. నువ్వు కనిపించావని అబద్ధం చెప్పాను. అది విని అమ్మా, నాన్న కూడా ఆనందించారు. నాకూ సంతోషం అనిపించింది. నువ్వు కని పించింది అబద్ధం అన్న విషయం ఎవ్వరికీ చెప్పను. ఎవ్వరి ఆనందాన్నీ ధ్వంసం చెయ్యను" అని పెద్దగా మళ్ళీ నవ్వింది సుందరి, నిద్రలో కలువరింతల్లో!

అనంతరామయ్య నవనాడులూ కుంగిపో యాయి. నిర్విణ్ణుడై కొద్దిక్షణాలు అక్కడే నిలబడి నెమ్మదిగా గుండె దిటవుపరుచుకు న్నాడు.

భర్త ఇక ఎలాంటి సమాధానమూ చెప్ప డని గ్రహించి భాగ్యమ్మ వంటగదిలోకి వెళ్ళి పోయింది.

అనంతరామయ్య తనపని తను చేసుకు పోతున్నాడు.

సుందరి, వకుళ ఇంటికి వెళ్ళింది కలిసి స్కూలుకు వెళ్ళేందుకు.

రామ్మూర్తి సుందరికి కనిపించిన విషయం, అనంతరామయ్యను చూసి కొండ ల్లోకి పారిపోయిన విషయం రాత్రే ఊరంతా గుప్పుమంది.

"మీ బావ వచ్చాట్టగా? " వకుళ ఇంట్లో వాళ్లు సుందర్ని అడిగారు.

అంగీకారంగా మౌనం దాల్చింది సుందరి.

"పోన్లే! ఇన్నాళ్ళకయినా తిరిగొచ్చాడు. వాడిచేత నీకు ముక్కుతాడు వేయిస్తే ఇద్దరూ చిలుకాగోరింకల్లా ఊళ్ళోనే పడుం టారు!"

సుందరి సిగ్గుతో ముడుచుకునిపోయింది.

వకుళ కూడా బడికి వెళ్ళేందుకు పుస్తకా లతో సిద్ధంకాగానే ఇద్దరూ కలిసి ఇంట్లోంచి బయటపడ్డారు. స్కూలువేపుకు నడిచారు.

దార్లో ఎదురైంది మాధవి.

తనే చొరవ తీసుకుని సుందర్ని చిర్న వ్వుతో పలుకరించి "ఏమే సుందరీ! మీ బావ కనిపించాట్టగా? స్వామివారు చెప్పింది నమ్మి చాలామంది నిన్నాడిపోసు కున్నారు. నేనూ నమ్మక తప్పలేదు. క్షమిం చవే!" అంది నొచ్చుకుంటూ.

వకుళ కల్పించుకుని అంది "ఇక రమణికి కాలక్షేపం లేనట్టే. ఇప్పటిదాకా సుందర్ని ఆడిపోసుకోవటంతో దానికి పొద్దుపో యింది. ఏం చేస్తుందో పాపం, ఇక" అంది నవ్వుతూ.

మాధవి కూడా ఆమె నవ్వుతో శ్రుతి కలి పింది.

వాళ్ళలా మాట్లాడుకుంటున్నా సుందరి అవేం పట్టించుకోలేదు. ఎక్కడో ఆలోచి



స్తోంది.

ఏదో ఒక భావోద్రేకంలో తను చెప్పిన అబద్ధం అంతగా పరిస్థితులను తనకు సానుకూలంగా మారుస్తుందని ఆమె ఊహించలేదు.

అమ్మా నాన్నల ముఖాల్లో ఆనందం చూసింది. ఊరంతా తనే చర్చనీయాంశంగా మారింది. నష్టజాతకురాలన్న అపవాదు పోయింది. మాధవి కూడా తనను అర్థం చేసుకుంది. రమణి విమర్శలకు అడ్డుకట్ట పడింది.

రామ్మూర్తి కనిపించాడన్నది అబద్ధం అన్న నిజాన్ని శాశ్వతంగా మనసులోనే సమాధిచేసి భ్రమలోనైనా అలా కొంతకాలం ఆనందించాలని సుందరి దృఢమైన నిర్ణయం మనసులోనే తీసుకుంది ఆ క్షణంలో!



భారతీపురం హైస్కూల్లో పనిచేస్తున్న పంతులు దానియేలు ఆదివారం పొద్దున్నే అదే స్కూల్లో రికార్డు అసిస్టెంటు మూర్తి ఇంటికి వెళ్ళాడు.

అప్పటికే మూర్తి స్నానంచేసి బట్టలు వేసుకుని ముస్తాబై దానియేలు కోసమే ఎదురుచూస్తున్నాడు.

పట్నం వెళ్ళే బస్సు వచ్చే వేళయింది.

ఇద్దరూ కబుర్లు చెప్పుకుంటూ బస్టాండుకు చేరుకున్నారు.

ముందుగా అనుకున్న ప్రకారం పంచాయితీ గుమాస్తా సుబ్బారావు బస్టాండ్లో వాళ్లను కలిసేడు.

పది నిముషాలకు రబ్బరు హారను మోగిస్తూ బస్సు వచ్చి ఆగింది.

ముగ్గురూ బస్సు ఎక్కారు.

భారతీపురం గ్రామస్తులు ఎంతో అవసరం అయితే తప్ప పట్నం వెళ్లరు. అందువల్ల ప్రైవేటు బస్సు సిబ్బందికి ఆ గ్రామం అంటే తేలిక అభిప్రాయం ఉంది!

ఊళ్లో స్కూలు ఏర్పడి ఇతర ప్రాంతాల నించి స్కూలు సిబ్బంది భారతీపురానికి వచ్చి కుదురుకున్న తర్వాతే ఆ గ్రామంనించి పట్టణానికి తరచుగా టిక్కెట్లు తెగుతున్నాయి.

అంతకుముందు గ్రామంలో ఎవర్కైనా ఆచారిగారి మాత్రలకు అలవిగాని జబ్బుచేస్తేనో, ఆపరేషన్లకో, నెలకొక్కసారి సరుకుల కొనుగోలుకో పట్నం వెళ్ళేవారు. అది కూడా గ్రామస్తులందరూ కాదు! చాలామంది ఊళ్లో ఉన్న గోవిందు చిల్లరకొట్లోనే దినవారీ సరుకులు కొనేవాళ్లు.

సీజన్లో రైతులకు కావాల్సిన విత్తనాల గింజలు, నారు కొనుగోళ్లకు మాత్రం గ్రామస్తులు ఆ బస్సులో ఇతర ప్రాంతాలకు వెళ్ళేవాళ్లు.

హైస్కూలు వచ్చింతర్వాత పంచెలవాళ్ళే కాక తరచుగా ప్యాంట్లవాళ్ళు భారతీపురంలో బస్సు ఎక్కుతుండటంతో బస్సు సిబ్బందికి వాళ్ళతో చనువూ, స్నేహం కుదిరేయి.

"రాండి, సుబ్బారావుగారూ! ఓహో! పంతులుగారూ, మూర్తిగారు కూడా వచ్చారే! రండి! కూర్చోండి!" అని ఆప్యాయంగా అందర్నీ పలుకరించాడు కండక్టరు.

ముగ్గురూ ఒకే వరుస సీట్లలో కూర్చున్నారు.

కండక్టరు పట్టణానికి మూడు టిక్కెట్లు





చించి సుబ్బారావు చేతిలో పెట్టాడు. మూడు టిక్కెట్లకూ సుబ్బారావే డబ్బు చెల్లించాడు.

బస్సు రొద పెడుతూ గతుకుల రోడ్డుమీద కుదుపులతో నింపాదిగా సాగిపోతోంది.

"ఆс... ఏవిటీ ఈరోజు మన కార్య క్రమం? " అడిగాడు మూర్తి.

"మామూలే! పట్నం బస్టాండ్లో దిగ్గానే భారతరత్న బ్రాందీషాపుకు వెళ్లటం 'మెక్ డొవెల్' విస్కీ, షోడా, జీడిపప్పు... అంతే!" అన్నాడు సుబ్బారావు.

వాళ్ళ చర్చ క్రమంగా గ్రామవ్యవహారాల మీదికి మళ్లింది.

"రోజూ మందుతాగందే ముద్దయినా ముట్టని మనల్ని ఈ దరిద్రపు ఊళ్ళో ఉద్యో గులుగా వేసి నరకం చూపిస్తున్నారు. ఆది వారాలు ఇలా పట్నంవెళ్ళి తాగటం, వస్తూ వస్తూ సీసాలు రహస్యంగా తెచ్చుకుని ఇంట్లో దొంగతనంగా తాగటం నాకేం బాగా లేదు" అన్నాడు క్షణం తర్వాత సుబ్బారావు.

"ఏంచేస్తాం! అంతా మనఖర్మ! ఆ మున సబుగాడింకా ఆదిమకాలంలోనే ఉన్నాడు. అయినా ఆ పల్లెటూరి బడుద్దాయికి నాగరి కత నేర్పటం ఎవరితరం? " అని ఫక్కున నవ్వాడు మూర్తి.

"తాగే మన హక్కును గ్రామస్తులు బల వంతంగా హరించివేస్తోన్నారనీ, మనం ఊళ్లోనే తాగినా గ్రామస్తులు మనకు ఎలాంటి హానీ తలపెట్టకుండా రక్షణ కల్పిం చాల్సిందిగా పోలీసుశాఖను ఆదేశించమని మనం కోర్టులో పిటీషను దాఖలు చేస్తే? " అడిగాడు దానియేలు.

సుబ్బారావు పెదవి విరిచాడు. "అందు వల్ల ప్రయోజనం శూన్యం" అన్నాడు ముఖం చిట్లిస్తూ.

"అలా కోర్టువారు ఆర్డరు ఇవ్వరా? "

"ఎందుకివ్వరూ... ఇస్తారు! కాకుంటే చిన్న మతలబుంది! మన వకీలుకు నప్పే బెంచికే మన పిటీషను విచారణకు రావాలి! అలా మనం చేసుకోవాలి. అయినా అంతా చేసి ఆర్డరు తెచ్చుకున్నా ఈ ఊర్లో స్వేచ్ఛగా మందు తాగలేం" చెప్పాడు సుబ్బారావు.

"ఏం? కోర్టు ఉత్తర్వులు ధిక్కరించి గ్రామస్తులు మనల్ని మందు తాగన్వీరా? అలా చేస్తే కోర్టు ధిక్కార నేరంకింద వాళ్ళ మీద కేసు పెడదాం"

"అలా ఒకదానికొకటి పెంచుకుంటూపోతే మనం ఇక కోర్టులకూ, ప్లీడర్లకూ అంకితమై పోవాలి. సుఖంగా తాగేందుక్కూడా మనకు సమయం చిక్కదు"

"మరి పరిష్కారం? " అడిగాడు మూర్తి.

"ఈమధ్యనే ఒక పథకం వేశాను!"

"ఏంటది? "

"ఊళ్ళో మందుకొట్టే వీల్లేక విలేజ్ ప్రెసి డెంటు పట్నంలో కాపురం ఉంటున్నాడు కదా! ఫైళ్ళమీద వేలిముద్రలకోసం తర చుగా నేను ఆయన్ను కలుస్తుంటాను! అలా కలిసీ కలిసీ మేమిద్దరం గ్లాసులు కూడా కలుపుకున్నాం! భారతీపురంలో బ్రాందీషాపు పెడితే బోలెడు ఆదాయం వస్తుందనీ, షాపు పెట్టేందుకు మంత్రిగారి సహకారం కూడా ఉంటుందనీ చెప్పాను. ఆయనకు భారతీ పురం మునసబుదే భయం! మునసబుల కన్నా ప్రెసిడెంట్ల అధికారమే ఎక్కువనీ, ఇది రాజకీయపదవి అనీ ఆయనకు నచ్చచె ప్పాను.

"ప్రెసిడెంటు ఆలోచనలో పడ్డాడు. పైగా వాళ్ళ బావమరది పట్నంలో బ్రాందీషాపు పెట్టి కంపెనీ సీసాల్లో మిఠాయిరంగు కలి పిన నాటుసారా పోసి, సీల్లేసి అమ్మి ఇట్లా చూసేసరికే కోటీశ్వరుడయ్యాట్ట.

"ఊరి భయానికి ఊరుకున్నాడు కానీ మనసులోనిమాట మాత్రం భారతీపురంలో బ్రాందీషాపు పెట్టాలనేనట" అని సుబ్బా రావు గుండెనిండా గాలి పీల్చి వదిలి-

"అంచేత మనం ముగ్గురం కలిసి పట్నంలో బస్సుదిగ్గానే సరుకు కొనుక్కుని



నేరుగా ప్రెసిడెంటుగారింటికి వెళ్ళాలి. ఆయనకూ మందుపోసి బాతాఖానీలో విషయం ఎత్తి ముగ్గులోకి దించాలి!

"భారతీపురంనుంచి అలా తాగుబోతులు వచ్చి బ్రాందీషాపు కావాలని అడిగితే కాదనే కఠినాత్ముడు కాడు ప్రెసిడెంటు! అతని వృత్తీ రాజకీయమే గనుక!" అని ముగించాడు సుబ్బారావు.

బస్సు ఒక్క కుదుపులో పట్నం బస్టాండ్లో ఆగింది.

అందరూ కిందికి దిగారు.

భారతరత్న బ్రాందీషాపులో 'సరుకు' కొనుక్కుని, ఆదం హోటల్లో సీకులూ, పచారీకొట్లో జీడిపప్పూ తీసుకుని ముగ్గురూ ప్రెసిడెంటు ఇంటివేపుకు సాగిపోయారు.

భారతీపురంలో బ్రాందీషాపు ఆవిర్భావానికి శ్రీకారం చుట్టేందుకు చర్చలు మొదలయ్యాయి!

★ ★ ★

రాష్ట్ర రాజధానిలోని ఓ బ్రహ్మాండమైన ఐదు నక్షత్రాల హోటల్లో ఓ పండుగ ఘనంగా జరుగుతోంది.

కోరిన వారికి కోరినన్ని నిధులు.

రసికులకు రమణులు...

'నిషాచరుల'కు సముద్రాలు దాటివచ్చిన విదేశీ మద్యాంగనల అధరామృతధారలు...

పగటికీ, రేయికీ తేడా తెలియని విధంగా అధికార పార్టీ సభ్యులు ఆనందాలను జుర్రుకుంటూ అఖిలాంధ్ర ప్రజానీకానికి దయతో మరో కొత్త ముఖ్యమంత్రిని అందించేందుకు ఆరాటపడుతోన్నారు.

ఆ 'పార్టీ' విజయవంతమైంది.

ఆ తర్వాత గవర్నరు దగ్గర ప్రదర్శనా విజయవంతమైంది.

పాత ముఖ్యమంత్రి దిగిపోయి అతని మంత్రివర్గంలోని మంత్రి కొత్త ముఖ్యమంత్రి అయ్యారు. కొత్త మంత్రివర్గం ఏర్పాటుచేశారు.

పదవుల వాయనాలు పంచిపెట్టటంతో ఆ క్రతువు పూర్తయింది.

జరిగిన రాజకీయ పరిణామాన్ని తెలుసుకున్న భారతీపురం పంచాయితి గుమాస్తా సుబ్బారావుకు ఫ్లాష్ వెలిగింది. ఆనందంతో తబ్బిబ్బవుతూ దానియేలు పంతుల్నీ, రికార్డు అసిస్టెంటు మూర్తినీ కలిసి జరగాల్సిన తతంగాన్ని వివరించి చెప్పాడు.

సుబ్బారావు చెప్పింది ఆచరణసాధ్యంగానే తోచింది వాళ్ళకు.

అప్పటికప్పుడే సెలవులు పెట్టి వాళ్లు ముగ్గురూ సాయంత్రం బస్సుకు పట్నం వెళ్ళి, అక్కడ్నించి ప్రెసిడెంటును తోడ్కొని రాజధానికి బయల్దేరి వెళ్ళారు, కొత్త ముఖ్యమంత్రిని స్వయంగా కలిసి అభినందించేందుకు!

తెల్లవారుజామున వాళ్లంతా రాజధానిలో దిగారు.

బస్టాండుకు దగ్గర్లోనే ఉన్న లాడ్జిలో దిగి కాలకృత్యాలు తీర్చుకున్నారు. కొంతసేపు విశ్రాంతిగా పడుకుని పదిన్నరకల్లా ముస్తాబై సచివాలయానికి వెళ్ళారు.

విజిటర్స్ లాంజ్‌లో కూర్చుని స్లిప్పుమీద పేర్లు రాశాడు సుబ్బారావు. పేర్లతోపాటే స్లిప్పుకింద తమరు భారతీపురం స్కూలు ప్రారంభోత్సవానికి దయచేసినప్పుడు తమకు 'విందు' ఏర్పాటుచేసే భాగ్యానికి నోచుకున్న తమరి నమ్మినబంటు సుబ్బారావు అని కూడా రాసి, అటెండరు ద్వారా ముఖ్యమంత్రి ఛాంబర్లోకి పంపించాడు.

ఐదు నిముషాల్లోనే వాళ్ళకు పిలుపొచ్చింది!

సంతోషంగా మంత్రి ఛాంబర్లోకి వెళ్లేరు. వెంట తెచ్చిన దండల్ని మంత్రికి వేసేరు.

"ఈ దండలు చంద్రుడికో నూలుపోగు!" అన్నాడు సుబ్బారావు వినయంగా.

ముఖ్యమంత్రి ఛాతీ ఉబ్బింది! "మిస్టర్ సుబ్రావ్! ఎనీ ప్రాబ్లం?" అడిగేరు సౌమ్యంగా.

"సర్! దట్ విలేజ్ మున్సిఫ్ ఈజ్ నాట్





# రచయితలకు మనవి



- ★ 'చతుర'లో నవలకు వేసే చిత్రాలు, 'చతురకతలు', 'చతుర ప్రపంచం'వంటి శీర్షికలు కాక కేవలం నవలమాత్రమే అచ్చులో *100* పేజీలు ఉంటుంది. నవలనుబట్టి పేజీల సంఖ్య పెంచడంగాని, తగ్గించడంగాని వుండదు గనుక రచయిత(త్రు)లు తమ వ్రాతప్రతిని అచ్చులో *100* పేజీలకు తక్కువ కాకుండా వుండేలా చూసుకుని పంపవలసి వుంటుంది.
- ★ **ప్రచురించిన నవలలో ఓ పూర్తి పేజీని తమ చేతివ్రాతలో రాసి చూసుకుని, ఆమేరకు తమ నవల అచ్చులో 100 పేజీలకు సరిపోయేలా ప్లాన్‌చేసుకుని 'చతుర'కు అనుకూలంగా వుండేసైజులో పంపడం మంచిపద్ధతి.**
- ★ **ఆవిధంగా నవలలు 'చతుర'కు సరిపడా లేకపోయినట్లయితే ఆయా నవలలు పరిశీలనార్హాలు కావని గమనించగోరుతున్నాం.**
- ★ *ప్రచురణకై ఎన్నికకాని నవలలు తిప్పి పంపేందుకై నవలతోపాటే తగు పోస్టేజిని జతపరచాలి. వ్రాతప్రతులు పోస్టులోగాని, ఇతరత్రాగాని పోయినసందర్భాల్లో మా బాధ్యత వుండదు.*
- ★ *సాధారణంగా నవలలు మాకు అందిన 4 వారాలలోగా ప్రచురణార్హంగా భావిస్తే ఆ విషయం తెలియపరచడం, లేనిపక్షంలో తిప్పిపంపడం జరుగుతుంది.*
- ★ **ప్రతి నవలకు అందజేసే రు: *3000/–* పారితోషికం ఏనెల 'చతుర'లో ప్రచురిస్తే ఆనెల మొదటివారంలోనే పంపబడుతుంది.**

**ఎడిటర్:**

# చతుర

**'ఈనాడు' కాంపౌండ్ హైదరాబాద్-500 482.**

# ఏరిన ముత్యాలు

★ మానవుని మెదడు చాలా అద్భుతమైనది. ఒకేఒక మానవుని మెదడులో ఎలక్ట్రికల్, ఎలక్ట్రానిక్ సర్క్యూట్‌లు, ఈక్విలెంట్లు ప్రపంచంలో గల అన్ని టీవీ స్టేషన్స్, రేడియో స్టేషన్స్‌లలోనూ వుండే వాటికంటే అధికంగా వుంటాయి.

**–జెస్సీ బెయింగ్**

★ మనం కొండంత సలహానిస్తాం. కానీ తీసుకునేది ఆవగింజంత.

**–ఆర్థర్**

★ ప్రేమ అనగా వెర్రిబాగులవాని వివేకం. వివేకవంతుని వెర్రిబాగులతనం.

**–శామ్యూల్ జాక్సన్**

★ అదృష్టం కలిగినప్పుడు ఉదాసీనుడవుగా వుంటే దురదృష్టంలో దుఃఖాన్ని అనుభవించవు.

**–తిరుక్కురళ్**

★ అదృష్టానిది స్త్రీ స్వభావం. మనం వలచినకొద్దీ అది వెనుకకుపోతుంది.

**–6వ ఛార్లెస్**

★ జీవితాన్ని ధారపోసేవారికి జీవితం మోసం చేయదు.

**–డా. నార్మన్ విన్సెంట్**

★ తన లోపం ఎరిగినవాడే పరిపూర్ణమైన మానవుడు.

**–గాలిబ్**

★ ప్రపంచంలో నిరుపయోగమైనది సోమరితనం. అది తుంటరితనంకన్నా చెడ్డది.

**–ఒ.పి.శర్మ**

★ చేసినదాని గురించి మర్చిపో చెయ్యవలసినదాన్ని గురించి ఆలోచించు.

**–శ్రీనాథుడు**

★ తననుతాను తగ్గించుకొన్నవాడే హెచ్చింపబడును.

**–బైబిలు**

★ 'నేను', 'నా' అన్న స్వార్థపూరితమైన అహంకారాన్ని విడనాడు.

**–భగవద్గీత**

★ నిన్ను నువ్వెప్పుడూ గొప్పవాడివని భావించి అహంకరించకు.

**–ఖురాన్**

★ మనుష్యుల మధ్య మనుష్యుల కోసం జీవించడం మంచితనం.

**–టాల్‌స్టాయ్**

సేకరణ: **పులగం వరలక్ష్మీగాంధీ**

ఎలౌవింగ్ అజ్ టు టేక్ లిక్కర్!" చెప్పేడు సుబ్బారావు.

"దాన్లో ఛేంజయితే ఏం రాలేద్లే? "

"నో సార్! నో ఛేంజ్!"

"వాన్తో మీకెందుక్కా... మీర్తాగుండ్రి!"

"ఊర్లో బ్రాందీషాపు లేదు. పట్నంనించి తెచ్చుకోవాలి!"

"షాపెట్టండ్రి! మంచిగ పైసల్ కమాయించుడే గాక ఊర్లనే మందుదొర్కుతది!"

"మునసబు పెట్టనియ్యడు"

"వాడెవుడూ వొద్దన్నీకి! పెట్టేటోడ్ని చూడండ్రి. దుక్నం నే పెట్టిపిస్త!"

"ప్రెసిడెంటుగారికీ పెట్టాలని ఉంది! కానీ భయం!"

"ఫికర్ జెయ్యకు ప్రెసిడెంటూ! నేనున్నగా! అర్రేంజ్మెంట్ జేస్కో ఆక్షన్ లేకుండనే దుకానం యిస్యూ జేసుడుకు నీ పేర్న యిస్పెషల్ జీ.ఓ పాస్జేపిస్త"

ప్రెసిడెంటు సంతోషంతో ఉప్పొంగిపోతూ మళ్ళీ ఒకసారి ముఖ్యమంత్రికి రెండుచేతులూ ఎత్తి నమస్కరించేడు.

"సార్! దుకాణంతోపాటు పోలీసు స్టేషన్, వీల్లేకుంటే కనీసం ఔట్పోస్టయినా పెట్టకపోతే బ్రాందీషాపు పెట్టి ప్రజయోజనం ఉండదు! మునసబు ముఠావాళ్ళు మన ముఠాని తాగనివ్వరు. పోలీసు ప్రొటక్షన్ అవసరం!" అన్నాడు సుబ్బారావు ముందు చూపుతో.

"ఐ విల్ అరేంజ్! సీ... మిష్టర్ సుబ్రావ్! యూ ట్రైటు ఎలిమినేట్ దట్ బ్లడీ మున్సిఫ్ ఫ్రం విలేజ్ పాలిటిక్స్! ఎంకరేజ్ దిస్ మ్యాన్ ఇన్ ఆల్ యాస్పెక్ట్స్!" అని ప్రెసిడెంటు వేపుకు వేలు చూపించేడు ముఖ్యమంత్రి.

సుబ్బారావు వినయంగా తలూపేడు.

★ ★ ★

భారతీపురానికి కొత్తగా రోడ్డు వేసేందుకు జిల్లాపరిషత్తు నిధులు కేటాయించింది. రోడ్డు కంట్రాక్టరు మెటల్ కూడా తోలించాడు. కూలీలు వచ్చి దిగేరు. యుద్ధప్రాతిపదికమీద రోడ్డు వెయ్యటం మొదలైంది.

అప్పటిదాకా ఆ ఊరికి తిరిగేది ఒకేఒక్క ప్రైవేటు బస్సు మాత్రమే! ఇప్పుడు ప్రభుత్వం రెండు రోడ్డురవాణా సంస్థ బస్సులను ఆ ఊరికి నడిపేందుకు నిర్ణయించింది.

రోడ్డు నిర్మాణం పూర్తికాగానే కొత్తగా వేసిన బస్సులు కూడా భారతీపురానికి రాకపోకలు ప్రారంభించాయి. బస్టాండు నిర్మాణం కూడా జరిగింది.

స్కూలు ప్రారంభోత్సవానికి భారతీపురం వచ్చిన రోజు మంత్రిగారు గ్రామాభివృద్ధికి చేసిన వాగ్దానాలు ఒక్కొక్కటిగా అలా నెరవేరుస్తుండటంతో గ్రామస్తుల ఆనందం అంతా యింతా కాదు!

మంత్రిగారి చిత్తశుద్ధిని, లక్ష్యశుద్ధినీ గ్రామస్తులకు కథలుకథలుగా వర్ణించి చెప్తోన్నాడు ప్రెసిడెంటు.

ప్రెసిడెంటుకు ఆ ఊళ్ళో సొంత ఇల్లేకాకుండా ఇంటి పక్కనే పశువుల కొట్టం ఉంది.

గ్రామ పంచాయితికి ఎన్నిక జరిగి ప్రెసిడెంటుగా ఎన్నికకాగానే కుటుంబాన్ని పట్టణానికి మార్చటంతో ఇల్లు ఖాళీగానే ఉంది. సంసారం ఊళ్ళో లేనందున పశువుల్ని కూడా అమ్మివేసేడు. అలా గొడ్లకొట్టం కూడా ఖాళీగానే ఉంది.

గ్రామస్థులకు అంతుచిక్కని విషయం ఏంటంటే ఈమధ్య ప్రెసిడెంటు రోజూ పొద్దున్నే గ్రామానికి వచ్చి చీకటిపడే వేళకు పట్నం తిరిగి వెడుతోన్నాడు. పనివాళ్ళతో ఇల్లు శుభ్రం చేయించాడు. దక్షిణం వేపు గది తలుపుల్ని తొలగించి ఇనపచువ్వలతో బలిష్టమైన తలుపు చేయించి గోడలకు బిగించేడు. దానికో పెద్ద గడియ, గడియకు తగ్గ తాళం సిద్ధం చేసేడు.

పశువులకొట్టం రూపురేఖలు పూర్తిగా మారిపోయాయి!



కొట్టంపైన రెల్లుగడ్డి కప్పు అదృశ్యమై రేకులు అమర్చేరు. సింహద్వారం పైన ఓ పెద్ద బోర్డు వెలిసింది. అది పెయింటువేసి ఉంది కానీ దానిమీద ఇంకా ఎలాంటి అక్షరాలూ రాయలేదు.

రోజూ సాయంత్రం వేళకు సుబ్బారావు, దానియేలు పంతులు, మూర్తి అక్కడికి వచ్చి ఏర్పాట్లను పర్యవేక్షిస్తున్నారు.

మొత్తానికి ఊళ్ళో అనూహ్యమైన మార్పులేవో జరగబోతోన్నట్లు గ్రామస్తులకు అర్థమైంది.

"ప్రెసిడెంటుగారూ! ఏంటి హడావుడి?" అడిగేడొకరోజు మునసబు.

"ముందుముందు తెలుస్తుందిగా..." సమాధానం అలా దాటవేసేడు ప్రెసిడెంటు.

వారంరోజుల తర్వాత పట్నంనించి పోలీసు వ్యానొకటి భారతీపురం వచ్చింది!

ఒక ఎస్సై, ఒక హెడ్డూ, నలుగురు కానిస్టేబుళ్ళూ వ్యాన్ దిగేరు. ప్రెసిడెంటు ఇంట్లోకి వెళ్ళేరు. క్షణంలో ఇంటిముందు బోర్డొకటి వెలిసింది. దానిమీద పోలీసు ఔట్ పోస్ట్! అన్న అక్షరాలు రక్తంలా ఎర్రగా మెరిసేయి!

జరిగిందంతా విన్న అనంతరామయ్య పోలీసు ఔట్ పోస్టుముందునించే నెమ్మదిగా నడుచుకుంటూ మునసబు ఇంటికి వెళ్ళేడు.

అప్పటికే మునసబు ఇంటి దగ్గర చాలా మంది జనం గుమికూడేరు. వాళ్ళంతా ఏదో తర్జనభర్జనలు పడుతోన్నారు.

మునసబు ముఖం నల్లగా మాడిపోయి ఉంది!

అనంతరామయ్య జనాన్ని తప్పించుకుంటూ మునసబు దగ్గరికి వెళ్ళాడు. మౌనంగా పక్కనే కూర్చున్నాడు.

రెండు నిముషాల తర్వాత "మునసబుగారూ! మన ఊళ్ళో ఏం ఉపద్రవం ముంచుకొచ్చిందని పోలీసుల్ని దించారు?" అడిగేడు చిన్నగా అనంతరామయ్య.

"అదే నాకూ అర్థంకావటంలేదు" వేళ్ళతో నొసలు రాసుకుంటూ అన్నాడు మునసబు.

"గ్రామ మునసబుకు తెలియకుండా గ్రామంలో పోలీసు ఔట్ పోష్టా?"

"అదే విచిత్రం! తాగుబోతులంతా కలిసి ఏదో కుట్ర చేస్తున్నట్లుంది. ప్రెసిడెంటును కూడా వాళ్ళ ఉచ్చులోకి లాగినట్టున్నారు. ఈ మధ్యనే అందరూ వెళ్ళి మంత్రిగార్ని కూడా కలిశారట" ఎక్కడో ఆలోచిస్తూ చెప్పేడు మునసబు.

సరిగ్గా అప్పుడే దూరంనించి చాటింపు వినిపిస్తోంది!

'కొద్దిసేపట్లో ప్రెసిడెంటుగారింట్లో ఏర్పాటు చేసిన పోలీసు ఔట్ పోస్టును డి.ఎస్.పి.గారు ప్రారంభిస్తారు. గ్రామస్తులను ఉద్దేశించి వారు ప్రసంగిస్తారు కనుక ప్రజలంతా రావలసిందహో...

'డమ్కుడమా... డమ్ముడమాడం' అన్న డప్పు చప్పుడు క్రమంగా దూరమైపోతోంది.

మునసబు ఇంటిదగ్గర గుమికూడిన వాళ్ళంతా ఒకళ్ళ ముఖాలొకళ్ళు చూసుకున్నారు!

అరగంట గడిచింది.

పోలీసు వాహనంలో డి.ఎస్.పి. వచ్చి ఔట్ పోస్ట్ ముందు దిగేడు. ఆ వాహనం వెనకే వచ్చి ఆగిన లారీలోంచి ప్రెసిడెంటు తాలూకు మనుషులు అట్ట పెట్టెల్నిదించి కొట్టంలోకి చేర్చేరు. పెట్టెల్ని విప్పి రకరకాల బ్రాంది, విస్కీ, బీరు సీసాలను బయటికి తీసి రాకుల్లోకి సర్దేరు.

'మహాత్మా బ్రాందీషాపు' అని రాసిన బ్యానర్ను తాత్కాలికంగా బోర్డుమీద కట్టి కౌంటర్లో సుబ్బారావును కూర్చోపెట్టేరు.

భారతీపురంలోకి పోలీసులు రావటంతో అట్టుడికి పోతోంటే పులిమీద పుట్రలా క్షణంలో పోలీసు ఔట్ పోష్టు పక్కనే బ్రాందీషాపు వెలియటంతో ఊరంతా అబ్బురపోయింది.

ప్రెసిడెంటు గ్రామానికి చేసిన విద్రోహం గురించే ఊళ్ళో చర్చలు మొదలయ్యాయి.

ఊరంతా ప్రెసిడెంటు ఇంటి దగ్గరికి తరలి వచ్చింది.

సాయుధ పోలీసుల మధ్య నించొని డి.ఎస్.పి. ప్రజలనుద్దేశించి మాట్లాట్టం మొదలు పెట్టేరు.

"గ్రామ ప్రజలకు ఇదే పోలీసు హెచ్చరిక! ప్రభుత్వం అనుమతించిందే ఈ బ్రాందీ షాపు! దాన్ని ధిక్కరిస్తే ప్రభుత్వాన్ని ధిక్కరించినట్లే! ఊళ్ళో సంఘ విద్రోహులున్నారనీ, వాళ్ళు మద్యపానాన్ని అనుమతించరనీ, అలాంటివారిపై కఠిన చర్యలు తీసుకోమనీ మాకు ప్రభుత్వం నించి వైర్‌లెస్ మెసేజ్ కూడా అందింది!

కానిస్టేబిళ్ళూ, ప్రెసిడెంటు అనుచరులూ చప్పట్లు చరిచేరు.

డి.ఎస్.పి. సిబ్బందికి జాగ్రత్తలు చెప్పి వెళ్ళిపోయాడు.

ఊరి గుండెలో అగ్గంటుకుంది!

★ ★ ★

భారతీపురం మీదుగా రైల్వేలైను, అందునా బ్రాడ్‌గేజ్ మంజూరైందని వార్త!

హైద్రాబాద్‌నించి దేశంలోని దూరప్రాంతాలకు వెళ్ళే రైళ్ళు భారతీపురం గుండా వెళ్తాయట. అందువల్ల భారతీపురం పెద్ద రైల్వేజంక్షన్ అవుతుందిట!

ఈ వార్త రాగానే ఇతర ప్రాంతాల వాళ్ళు చాలామంది భారతీపురం వచ్చి కారు చవుకగా ఉన్న స్థలాలనూ, పొలాలనూ కొనటం మొదలైంది. వాళ్ళంతా అలా ఎందుకు కొంటున్నారో గ్రామస్తులకు అర్థంకాలేదు, మొదట్లో.

నిపుణులు పరిశోధించి భారతీపురం గ్రామానికి చుట్టుకొని ఉన్న భూముల్లో ఎంతో విలువైన రకరకాల ఖనిజ సంపద, క్వార్ట్జి నిక్షిప్తమై ఉందనీ, భూములను తవ్వి క్వారీలుగా మార్చి ఆ ఖనిజసంపదను వెలికితీస్తే కోట్లాది రూపాయల ఆదాయం వస్తుందని కూడా ప్రచారం మొదలయింది.

భారతీపురానికి ఖరీదైన రకరకాల కార్లొస్తూ పోతూన్నాయి. ఖరీదైన మనుషులూ వస్తున్నారు.

సర్వేలన్నీ పూర్తిగా జరిగి భారతీపురంలో భారీ ఎత్తున ఖనిజ వ్యాపారం మొదలయ్యేందుకు మరి కొంతకాలం పడుతుంది కనుక ముందు చూపుతో 'సమర్థులు' అక్కడ మేడలు కట్టేసేరు.

ఊరికి తూర్పుదిక్కున ఉన్న రెండు కొండలదగ్గర రాత్రికి రాత్రి చుట్టుగుడిసెలు వెలిసేయి!

సుమారు ఇరవై కుటుంబాల వాళ్ళు ఆ గుడిసెల్లో కాపురం పెట్టేరు.

ఆ కొండలను ఎవరో ప్రభుత్వంనించి లీజుకు తీసుకున్నారట.

కొండలను పగులగొట్టి ఇళ్ళ నిర్మాణానికి రాళ్ళూ, రోడ్ల నిర్మాణానికి గ్రావెల్ తయారు చేస్తారట!

ఆ గుడిసెల్లోకి వచ్చింది కొండలను పగులగొట్టే కార్మికులు!

ఆ రెండు కొండలకు సమీపంలోనే నాలుగు క్రషింగ్ మిషన్లు బిగించేరు. ఆ మిషన్లతో కొండరాళ్ళను సన్నసన్న రాళ్ళుగా చేసే పనివాళ్ళను నియమించారు.

ఒక శుభముహూర్తంలో కొండ గుండెకు తూట్లు పొడిచి అందులో డైనమైట్లు అమర్చి నిప్పుతో కాల్చారు! కొండ గుండె పగిలి శకలాలుగా రాళ్ళు ఎగిరి దూరంగా పడ్డాయి!

ప్రగతిపథంలో మనిషి ఆధునికతకేసి ప్రస్థానం సాగించేందుకు బాటలు పరిచే రంగం సిద్ధమైంది!

కొద్ది రోజులకు రైల్వేలైను వేసే కంట్రాక్టర్లు భారీ యంత్రాలతో దిగేరు. కార్మికులను వెంట తెచ్చుకున్నారు. భారతీపురం ఊరి వెలుపల రైల్వే స్టేషన్ నిర్మాణం మొదలైంది!



ఊరి స్వరూపమే మారిపోతోంది.

★ ★ ★

నాంచారయ్యది నిజంగా ఏ ఊరో తెలియదు కానీ మిత్రులు మాత్రం అతడ్ని 'సంచారయ్య' అంటుంటారు!

భారతీపురం అన్నిరంగాల్లో అభివృద్ధి చెంది, కార్మికవర్గం కూడా పెరగటంతో నాంచారయ్య కూడా భారతీపురం వచ్చి అక్కడే స్థిరపడ్డాడు. కార్మికుల గుడిసెల మధ్య ఓ పెద్ద పాక వేసుకుని దాన్నే కార్మిక సంఘ కార్యాలయం అన్నాడు.

మొదట్లో కేవలం ఏడుగురు క్వారీ కార్మికులతో ఏర్పడ్డ నాంచారయ్య కార్మిక సంఘం క్రమంగా బలపడి, అన్ని రంగాల్లోని కార్మికులూ సంఘంలో చేరటంతో బలీయమైన శక్తిగా మారేడు నాంచారయ్య.

ఆరోజు సాయంత్రం కార్మికులకు జీతాల బట్వాడా కాగానే యూనియన్ సభ్యత్వ రుసుము వసూలు చేసుకుని కార్యాలయానికి తాళంపెట్టి నేరుగా మునసబు దగ్గరికి వెళ్ళేడు నాంచారయ్య.

నాంచారయ్య భారతీపురంలో స్థిరపడి చాలాకాలమైనా మునసబును కలిసే అవసరం ఆరోజే కల్గింది.

తననుతాను పరిచయం చేసుకున్నాడు నాంచారయ్య.

మునసబు చిర్నవ్వు నవ్వి "ఏం పనిమీద వచ్చారు? " అడిగేడు.

"మరేం అనుకోకండి! ప్రెసిడెంటుగారు అధికారం పార్టీలో ఉన్నా, మీరు ప్రతిపక్షంలో ఉన్నా నాకు మాత్రం ఇద్దరూ సమానమే! నేను కొన్ని విషయాల్లో మీతో ఏకీభవించవచ్చు మరి కొన్ని విషయాల్లో విభేదించవచ్చు! అలాగే వారితోనూ...

"ఐక్యతా- పోరాటం అంటారే... అదే! శ్రామిక వర్గ ప్రయోజనాలకోసం మేం అన్ని పార్టీల వర్గాలవారినీ కలుస్తాం! వాళ్ళ సహకారంతో బూర్జువా వర్గంతో పోరాటం సాగిస్తాం! ఈ బూర్జువా వర్గాలలోనూ వైరుధ్యాలుంటాయి"

"ఇంతకూ మీరేం పనిమీద వచ్చారు? "

"ఇళ్ళ స్థలాలు కావాలి"

"చవకలో చూసి కొనుక్కోండి!"

"అదే! బూర్జువా అహంకారం! ఇన్నేళ్ళ స్వతంత్రం తర్వాత కూడా కార్మికులకు ఉచితంగా ఇళ్ళ స్థలాలు యివ్వటం ప్రభుత్వ బాధ్యతకాదా అని నేను సూటిగా ప్రశ్నిస్తున్నాను" అన్నాడు నాంచారయ్య ఉద్రేకంతో ఊగిపోతూ.

"ఓహో... అదా! మరి ఆ మాట చెప్పవూ... ప్రభుత్వానికి అర్జీ పెట్టుకోండి. నేనూ మాట సహాయం చేస్తాను" హామీ యిచ్చేడు మునసబు.

నాంచారయ్య ఉద్రేకం తగ్గింది.

కళ్లలో ఎర్రజీరలూ తగ్గేక "థాంక్స్!" అన్నాడు.

"ఇంతకూ మీరు ఎక్కడ్నించి వచ్చారు? " అడిగేడు మునసబు.

"అదంతా ఓ పెద్ద స్టోరీ! డాం నిర్మాణం మాంచి ఊపులో ఉన్నప్పుడు నాగార్జునసాగర్లో నాయకుడిగా పనిచేశాను. బ్యాడ్‌లక్! డాం నిర్మాణం జరిగేక కార్మిక వర్గం చెదిరిపోయింది. తర్వాత శ్రీశైలం! అక్కడ్నించి కార్మిక వర్గాన్ని వెదుక్కుంటూ మీ ఊరొచ్చాను" చెప్పేడు నాంచారయ్య.

★ ★ ★

ప్రెసిడెంటు శివయ్య భారతీపురంలో బ్రాందీషాపు పెట్టిన క్షణంనించే మునసబుకూ, శివయ్యకూ మధ్య పెద్ద అఘాతం ఏర్పడ్డది. ఎంతోకాలంగా కాపాడుకొస్తోన్న ఊరి కట్టుబాటును శివయ్య అలా భగ్నం చెయ్యటంతో అతనికీ, మునసబుకూ మధ్య విబేధాలు తారాస్థాయికి చేరుకున్నాయి. ఆ విబేధాల అగ్నికి ఆజ్యం పోస్తున్నాడు సుబ్బారావు. ఇద్దరిమధ్యా పచ్చగడ్డి భగ్గున మండే పరిస్థితి కూడా ఏర్పడింది.





అలా భారతీపురానికి దుర్దశ ప్రారంభ మైంది.

తూర్పు బజారూ, పడమటి బజారూ శివయ్య నాయకత్వంలో వుంది. అతను అధికార పార్టీవాడు కనుక అతని ప్రాభవం క్రమంగా ఊరంతా విస్తరించసాగింది.

ఇతర ప్రాంతాలనించి భారతీపురం వచ్చి రకరకాల వృత్తుల్లో, ఉద్యోగాల్లో స్థిరపడ్డ వాళ్ళలో ఎక్కువమంది బ్రాందీషాపుకు అల వాటుపట్టంతో శివయ్య వర్గం అనూహ్యంగా బలం పుంజుకుంది!

ఇక కార్మిక వర్గం కూడా తన వెంట వుంటే తన రాజకీయ భవిష్యత్తుకు ముప్పు కలగదన్న ఆలోచనతో శివయ్య వున్నప్పుడే కార్మిక నాయకుడు నాంచారయ్య ఆయన్ను కలిసేడు.

"అయితే నాంచారయ్యా! మనం మనం ఒకటి. పైగా మాది అధికార పార్టీ. ఇళ్ళ స్థలాలు కావాలంటే నేరుగా నన్నే కలవొచ్చుగా... ఆ మునసబునెందుకు కలిసేవూ? " అడిగేడు శివయ్య.

"మేం వర్గశత్రువులను గూడా కలుస్తుంటాం. వాళ్ళ ఎత్తుగడలను కనిపెడుతుంటాం!" చెప్పేడు నాంచారయ్య.

"అట్టాగైతే, ఎటూ సాగరు బ్రాంచి కాల్వ నించి మంచినీళ్ళ కుంటకు పైపులతో నీళ్ళు పెట్టిస్తాను. రక్షిత మంచినీటి సరఫరా చేస్తాను. చెరువు గట్లు తెంపి ప్లాట్లు వేయిస్తాను! మీ వాళ్ళకు పట్టాలిస్తాను!"

"చెరువు భూమే ఎందుకు గుర్తొచ్చింది? బంజర్లు, నివేశనస్థలాలూ ఇంకా ఉన్నాయిగా"

"మరేం లేదు! దక్షిణ బ్బజార్లో ఇంకా కొంతమంది జనం మునసబు వెనుకే ఉన్నారు. మీ కార్మికులు అక్కడక్కడా స్థిర పట్టంకన్నా చెర్లో ఒకేచోట స్థిరపడితే మన బలం పెరుగుతుంది. ఓట్లు కూడా ఒకేచోట ఉంటాయి. పైగా మునసబు ముఠా వాళ్ళకు చెరువు ఆయకట్టు భూములున్నాయి" చెప్పేడు ప్రెసిడెంటు.

"అయితే నా రీడింగు ప్రకారం మీరు ప్రోగ్రెసివ్వే! మీతో చేతులు కలపటానికి మాకిక సందేహంలేదు!" అన్నాడు నాంచారయ్య సంతోషంగా.

మిత్రులిద్దరూ ఆలింగనం చేసుకుని ఐక్యత ప్రకటించారు!

★ ★ ★

ఎండాకాలం సెలవులొచ్చాయి. సుందరి హైస్కూలు చదువు ఆ ఏటితో పూర్తయింది. అలాగే ఆమె నేస్తాలందరూ స్కూలు చదువు పూర్తిచేసుకుని కాలేజిలో చేరే సన్నాహాల్లో ఉన్నారు.

ఊళ్ళో అప్పటికే రెండు ప్రైవేటు కాలేజీలు ఏర్పడ్డాయి.

ప్రెసిడెంటు వర్గం కులానికి కాలేజి అన్న నినాదంతో తమ కులస్తుల దగ్గర చందాలు పోగుచేసి కార్పస్ ఫండు కట్టి కాలేజి తెరిచారు. దానికి పోటీగా మునసబు వర్గం వాళ్ళు తమ కులపు కాలేజి పెట్టారు.

రోజారమణి తొమ్మిదో తరగతితో చదువుకు స్వస్తిచెప్పి ఊళ్ళో ఇంగ్లీషు మీడియం కాన్వెంటు పెట్టింది. ఎల్. కె. జి. నించి టెన్తు వరకు అడ్మిషన్లు చేసుకుంది.

ఆమె విద్యావ్యాపారం చూసి కన్నుకుట్టిన చాలామంది తాము గూడా కాన్వెంట్లు పెట్టారు.

అమ్మను 'మమ్మీ', నాన్నను 'డాడీ' అని పిలిచే సంస్కృతి మొదలైంది! చైత్రమూ, వైశాఖమూ అనాగరికమై జాన్యువరి, ఫిబ్రవరి వచ్చాయి. ఏ ఫర్ యాపిల్... సరేసరి!

కాలేజీలు కూడా తెరిచారు.

సుందరికి ఇకపై చదువు సాగించేందుకు మనస్కరించలేదు.

అనంతరామయ్యతో ఆ విషయం కరాకండిగా చెప్పింది. ఆయన గూడా చదువు కొనసాగించమని కూతుర్ని బలవంత పెట్ట

లేదు. పెళ్ళిచేసి పంపాలనుకున్నాడు.

★ ★ ★

ఆరోజు సుందరి మనసేం బాగాలేదు. అనంతరామయ్య, భాగ్యమ్మ పరిస్థితి కూడా అలాగే ఉంది.

ఈమధ్యనే అమ్మాయిని చూసివెళ్ళిన వాళ్ళు ఉత్తరం రాశారు, సుందరికి వేరే ప్రయత్నం చేసుకోమని.

భాగ్యమ్మ నిస్త్రాణగా పడుకుని ఉంది. ఆమె గుండె బరువుగా ఉంది. విపరీతంగా నెప్పి!

సుందరే వంటచేసింది. గిన్నెల్ని గూట్లో సర్ది ముస్తాబై బయటికి వెళ్ళేందుకు బయ ల్దేరింది.

"ఎక్కడికమ్మా?" అడిగింది భాగ్యమ్మ.

"పుస్తకాల షాపుకు! వెంటనే వస్తాను" అని చెప్పి సుందరి వెళ్ళిపోయింది.

ఓ పుస్తకాల షాపుముందు పరచిన పుస్త కాల వేపు చూస్తూ యజమానిని అడిగింది సుందరి "పూర్ణమ్మ పాటల పుస్తకం ఉందా?"

"ఉంది!" అన్నాడతను.

"ఎంకి పాటలో?"

"ఉన్నాయి!"

"మల్లీశ్వరి పాటల పుస్తకం?"

"నిక్షేపంగా..."

"అవ్వన్నీ ఇవ్వు! ఎంత?"

అతను పుస్తకాలు రాసిలోంచి తీసి ఆమె కిచ్చి ఖరీదెంతో చెప్పేడు.

సుందరి అతడికి డబ్బు చెల్లించి ఇంటికి వెళ్ళేందుకు రెండడుగులు వేసేలోగా "హాయ్, సుందరీ!" అని పిల్చేరెవరో.

ఆగి చూసింది. అలా పిల్చింది రోజార మణి!

రమణి పుస్తకాల షాపు మెట్లు దిగి వచ్చి "ఏంటే ఇలా వచ్చావ్?" అడిగింది సుంద రిని చనువుగా.

"పుస్తకాలకోసం"

"నేనూ అందుకే వచ్చాను! ఈ మధ్యనే రిలీజైన రెండు సస్పెన్సు థ్రిల్లర్లూ, ఓ సెక్సు నవలా దొరికాయంతే! కౌబాయ్ పుస్తకా లన్నీ అయిపోయాయట" అంది రమణి దిగులుగా.

రమణి అలా తనను పలుకరించటం సుందరికి చాలా ఆశ్చర్యం అనిపించింది.

"వెళ్తొస్తాను!" అంది ముక్తసరిగా.

"సుందరీ! నేను కాన్వెంటు పెట్టాను తెలు సుగా? మీకు తెలిసిన పిల్లలుంటే నా కాన్వెంట్లో చేర్పించవే!" అంది రమణి.

సుందరికి రమణి తనను అంత చను వుగా ఎందుకు పలుకరించిందో అర్థమైంది.

"అలాగేలే!" అని అక్కడ్నించి కదలబో యింది సుందరి.

"ఈ విషయం నీకు తెలిసిందా? మన క్లాస్‌మేట్ మంజులలేదూ? అది ఎవడో కులం కానివాడ్ని ప్రేమించి పెళ్ళిచేసుకుం దిట. చూడవే, ఎంతగా చెడిపోయిందో!" అంది రమణి.

సుందరి మాట్లాడకుండా అక్కడ్నించి బయల్దేరింది.

ఆమె మనసులో ఏదో అలజడి మొద లైంది.

రామ్మూర్తి పదేపదే గుర్తొస్తున్నాడు.

విఫలమైన పెళ్ళి చూపులు గుర్తొస్తు న్నాయి.

తన అనాకారి తనమూ గుర్తొస్తోంది.

కరణంగారి తోటదాపులో కొచ్చింది సుందరి.

ఊరు స్వరూపం మారిపోయినా కరణం గారి ఇల్లేం మార్లేదు. తోటా మార్లేదు. ఆ బాదంచెట్టు, పూలతలు, జాజిపందిరి, ఇంటికి వెళ్ళకుండా మనసు మార్చుకుని తోటలోకి వెళ్ళింది సుందరి.

అరుగుమీద కూర్చుని పుస్తకం తెరిచింది.

"... ఏడ తానున్నాడో బావా... జాడ తెలిసిన..."





భోర్న ఏడుస్తోంది!

అలా ఎంతసేపు గడిచిందో, "అక్కా! ఏడుస్తున్నావేం? " అంటూ లేత చేతులు రెండు ఆమెను స్పృశించేయి.

దోసిట్లోంచి తలెత్తి చూసింది! వాడు కరణంగారి మనుమడు వాసుగాడు!

అప్పుడు గమనించింది సుందరి, వాసు వెంటే వాడి స్నేహితులు మరో ముగ్గురు బిక్కముఖాలు వేసుకుని ఆమెనే గమనించి చూస్తున్నారు.

కళ్ళు తుడుచుకుని "మీరంతా వచ్చి అరుగుమీద కూర్చోండి!" అంది.

అందరూ వచ్చి కూర్చున్నారు.

రెండు క్షణాల మౌనం తర్వాత వాళ్ళను అడిగింది. "నేను అందంగా ఉంటాను కదూ? "

"అవునక్కా! పాటలు కూడా బాగా పాడ్తావు!" చెప్పేడు వాసు.

ఆమె కళ్ళలో ఆనందపు మెరుపు మెరిసింది!

ఆ పిల్లల వయసు, జ్ఞానంతో ఆమెకు ప్రమేయంలేదు! తన కాల్పనిక ఊహాజనిత మనోభావాలను బహిర్గతం చెయ్యటమే ఆమె ధ్యేయం! ఆ పిల్లలు లేకున్నా చెట్టూ చేమలకైనా తనూహించుకుంది చెప్పితీర్తుంది!

"అందంగాలేని ఆడపిల్లను ఎవ్వరూ ప్రేమించరు. పెళ్ళి చేసుకోరు. అంత చిన్న వయసులోనే మా రామ్మూర్తి బావ నన్ను పెళ్ళిచేసుకోవాలని అనుకున్నాడంటే నేను అందగత్తెనేగా? " అడిగింది సుందరి మళ్ళీ.

ఎవ్వరూ సమాధానం చెప్పలేదు. ఆశ్చర్యంగా గుడ్లప్పగించి చూస్తున్నారు.

వాళ్ళ మౌనం, ఆశ్చర్యం ఆమెలో అసహనాన్ని ప్రేరేపించాయి!

ఆ భావోద్రేకానికి విఘాతం కల్గి వాస్తవంలోకి వస్తే ఎంత ఆవేదన అనుభవించాలో ఆమెకు తెలుసు. అందుకే భయం! ఆ మానసిక స్థితిలోకి మరింతగా కూరుకుని పోతూ దర్పంగా నవ్వి-

"మా ఎదురింట్లో అద్దెకుంటున్న పాల కేంద్రం సూపర్‌వైజర్ శేషతల్పశాయి తెలుసా? " అడిగింది సుందరి.

"ఓ... తెలుసు!"

"పాపం! ఆయన నాకోసం పడిచస్తున్నాడు. నన్ను ప్రేమించాట్ట! పెళ్ళిచేసుకుంటాట్ట! పెళ్ళికి నేను ఒప్పుకోకపోతే ఆత్మహత్యక్కూడా వెనుకాడడట!" అంది సుందరి.

వాసు ఆమెవేపు విచిత్రంగా చూసి "ఆయన ఎవరనీ? వీడికి బాబాయే!" అని చెప్పాడు వాడి పక్కనే నించుని ఉన్న వేణును చూపించి.

తను చేసిన పొరపాటు అర్థమై సుందరి నాలుక కొరుక్కుంది!

"అదంతా ఉట్టినే చెప్పాను, వ్వెవ్వెవ్వె!" అందామని మనసులో అనుకుంది. అయినా చెప్పలేకపోయింది.

అలా వాళ్ళకు చెప్తే ఎలా ఉండేదో కానీ చెప్పనందువల్ల రాబోయే విషపరిణామాన్ని ఆమె ముందుగా ఊహించలేకపోయింది!

అనంతరామయ్య కూతురికోసం ఊరంతా గాలించి చివరకు వగరుస్తూ హడావుడిగా తోటలోకి వచ్చాడు.

"అమ్మా, సుందరీ! మీ బావ... రామ్మూర్తి... వస్తున్నానని ఉత్తరం. రాశాడు!" అని చెప్పాడు రొప్పుతూ.

అనూహ్యమైన ఆ వార్త విని తబ్బిబ్బవుతూ నోటివెంట మాటలు పెగలిరాక ఉక్కిరిబిక్కిరైంది సుందరి!

★ ★ ★

రామ్మూర్తికి రాత్రంతా బస్సులో కంటిమీద కునుకులేదు. భారతీపురంలో గడిపిన బాల్యాన్ని తలచుకుంటూ ఆలోచనల్లో కూరుకుని పోయాడు.

తెల్లవార్తోంది.

బస్సు భారతీపురం బస్టాండ్లో ఆగింది.

బస్సుదిగేడు. చుట్టూ చూసేడు. అది

తనకు పరిచయం ఉన్న బస్టాండల్లే లేదు. పూర్తిగా మారిపోయింది.

సాధువుతాత తత్త్వాలు చెవుల్లో వినిపిస్తోన్నట్టే ఉంది!

ప్లాటుఫారమ్ దాటి కొంచెం దూరం వెళ్ళి బయటికి చూసేడు.

ఎటు చూసినా కొత్తకొత్త ఇళ్ళూ, దుకాణాలు, విశాలమైన రోడ్లు, మందంగా వెలుగుతోన్న వీధి దీపాలూ కనిపించాయి.

వాటన్నింటినీ దాటి మరి కొంచెందూరం వెళ్ళి తూర్పువేపుకు ఆశగా చూసేడు.

అక్కడి రెండు కొండలు నల్లగానూ, వాటి మధ్యని ఖాళీ గుండా ప్రభాత సూర్యుడి తొలివెల్తురు కిరణం కాంతులీనుతూ గ్రామాన్ని తేజోవంతం చేస్తోంటే ఆ దృశ్యం ఎంత ఆహ్లాదంగా ఉంటుందో!

ఆ దృశ్యం కనిపించనేలేదు! కొండల్ని తొలిచేసేరు!

ఎంత వెల్తిగా తోచిందో!

మళ్ళీ బస్టాండ్లోకి వెళ్ళేడు. ఇంటికి ఎటు వేపు వెళ్ళాలో కూడా రామ్మూర్తికి అర్థంకావటంలేదు.

సిగరెట్ల దుకాణం తెరిచే ఉంది. అప్పుడే వస్తోన్న రకరకాల పేపరు బండిల్సు విప్పుతూ దుకాణం యజమాని బిజీగా ఉన్నాడు.

రామ్మూర్తి అక్కడికి వెళ్ళి సూట్ కేస్ కిందపెట్టేడు. చేతి వేళ్ళు విరుచుకుంటూ, ఆవులించి ఎదురుగా చూసేడు.

బస్టాండ్లో ఒక మూలగా 'మరుగుదొడ్లు' అని గోడమీద రాసుంది.

"సార్! కొంచెం ఈ సూట్ కేస్ చూస్తుంటారా, నేను మరుగుదొడ్డికి వెళ్ళొస్తాను" అని అడిగేడు దుకాణం యజమానిని.

అతను చివరి బండిల్ విప్పి పేపర్లను బల్లమీద పేర్చి రామ్మూర్తివేపు విసుగ్గా చూస్తూ "ఏఊరు? " అడిగేడు.

"ఈ ఊరే!" అన్నాడు రామ్మూర్తి. అతనికి ఆ ప్రశ్న విని సంతోషం వేసింది.

"మరి ఈ ఊరు అయితే ఇంటికి వెళ్ళింతర్వాత మరుగుదొడ్డికి వెళ్ళొచ్చుగా! పొద్దున్నే వాళ్ళ ముఖాన రూపాయి కొట్టటం ఎందుకూ? రూపాయంటే మాటలా? " అన్నాడతను.

"రూపాయి ఏంటి? " అతడి మాటలకు నిర్ఘాంతపోయి అడిగేడు రామ్మూర్తి.

"బస్టాండ్లో పాయిఖానాకు వెళ్తే యివ్వద్దూ..."

రామ్మూర్తి ముఖం వివర్ణమైంది! మౌనంగా నించున్నాడు.

"ఏంచేస్తుంటావు? " అడిగేడతను.

"మగ్గాలతో బట్టలు నేస్తాం!"

"సాలీలా! అయితే మీరూ మా పార్టీ వాళ్ళే!"

"పార్టీనా? " తెల్లబోయేడు రామ్మూర్తి.

"నీ పేరు? "

"రామ్మూర్తి!"

"నా పేరు ఆంజనేయులు! మేం ఇక్కడి వాళ్ళం కాదు, దక్షిణాదివాళ్ళం! మా ప్రాంతంలో కరువొస్తే బతుకుతెరువుకోసం వంద కుటుంబాల వాళ్ళం ఇక్కడికి వలసొచ్చాం. వ్యాపారాల్లో కుదురుకున్నాం. హోటళ్ళూ, లాడ్జింగులూ పెట్టాం. మడత మంచాలు అద్దెకిచ్చాం. మేమందరం ఒకే కులం వాళ్ళం కనుక కలిసికట్టుగా ఉన్నాం. అభివృద్ధి చెందాం. ఇక్కడి ఓటర్లమయ్యాం. అన్ని రంగాల్లోనూ ఆధిపత్యం పొందాం.

"ఇంతకూ ఇదంతా ఎందుకు చెప్పొచ్చానంటే మీ కులం వాళ్ళంతా మా ప్రెసిడెంటు పార్టీనే! అనంతరామయ్య అనేవాడొక్కడు తప్ప! మొదట్లో వాడు మునసబు ముఠాలో ఉండేవాడు. బ్రాందీషాపుదగ్గర మునసబుకూ ప్రెసిడెంటుకూ గొడవైంది. ప్రెసిడెంటు అధికార పార్టీవాడు కనుక ఆయన్దే పైచెయ్యి అయింది. అనంతరామయ్య తప్ప మీ వాళ్ళంతా అధికార పార్టీవేపే మొగ్గారు. దాంతో మునసబుకు దిక్కుతోచక




ముఠాను పోషించి రాజకీయం చెయ్యాలంటే డబ్బు కావాలి కనుకా ఊరిబయటి బీళ్ళలో రహస్యంగా నాటుసారా బట్టీలు పెట్టించాడు. మునసబూ తెలివితక్కువ వాడేంకాదు! నాటుసారాను మార్కెట్లోకి దించితే బ్రాందీ షాపులకు వ్యాపారం తగ్గుతుంది! అలా ప్రెసిడెంటు వర్గాన్ని ఆర్థికంగా దెబ్బతియ్యాలనీ, తనూ ఆదాయం పొంది రాజకీయంగా ముణుగడ సాగించాలనీ ఆయన ఆలోచన!

మద్యపాన నిషేధం అమలు జరపాలని గతంలో అన్న మునసబు కేవలం ఉనికికోసం, ఆదాయంకోసం అలా సారాబట్టీలు పెట్టించటంతో అనంతరామయ్య ఆయనకు దూరమయ్యాడు. అలాగని మాకు దగ్గర కాలేదనుకో!" అని ఒక్క క్షణం ఆగి, ఏదో గుర్తొచ్చి,

"ఇంతకూ నువ్వు మరుగుదొడ్డికి వెళ్ళనే లేదు!" అన్నాడు ఆంజనేయులు.

"ఇంటికి వెళ్ళాక!" చెప్పేడు రామ్మూర్తి.

"అలాగైతే చెక్కబల్లమీద కూర్చో" అని, రామ్మూర్తి కూర్చోగానే,

"అయినా నువ్వూ ఈ ఊరివాడివే అన్నావుగా... జరిగింది నీకు తెలీదూ? " అడిగేడు ఆంజనేయులు.

"తెలీదు! నేను ఈ ఊరు విడిచిపెట్టి చాలాకాలమైంది" అని.

"సరే! తెల్లవారింది. వెళ్తానిక!" అంటూ లేచేడు రామ్మూర్తి.

"ఇందాక నువ్వన్న అనంతరామయ్యగారింటికి ఎటు వెళ్ళాలి? " అడిగేడు రామ్మూర్తి సూట్‌కేసు చేత్తో తీసుకుంటూ

"ఆయన్తో నీకేం పని? "

"మా ఇల్లూ అక్కడే! పైగా ఆయన మా మామయ్య!"

ఆంజనేయులు వేల్తో దారిచూపి మౌనంగా తల వంచుకున్నాడు.

రామ్మూర్తి వీధుల్ని పరిశీలనగా చూస్తూ పాత దారులను మనసులోనే నెమరువేసుకుంటూ ముందుకు సాగిపోతున్నాడు.

ఆడవాళ్ళు అప్పటికే ఇళ్ళముందు ముగ్గులు పెట్టి ఆ ముగ్గుల మధ్య గొబ్బెమ్మల్ని అలంకరించేరు. ఇంటి గుమ్మాలకు తోరణాలు కట్టేరు.

చాలాకాలం తర్వాత అలాంటి అలంకరణను అబ్బురంగా చూస్తూ నడుస్తున్నాడు రామ్మూర్తి.

అతనికి అర్థంకానిదల్లా తన చిన్నప్పుడు ఆ ముగ్గుల గొబ్బెమ్మల పక్కనించి నడుస్తుంటే పేడ వాసన తగిలేది! మామిడి తోరణాలగుండా పసరు వాసన ముక్కులకు సోకేది! అలాంటిదిప్పుడు గొబ్బెమ్మల నించి కానీ, తోరణాలనించి కానీ ఎలాంటి వాసనా లేదు!

రామ్మూర్తి మరికొంత దూరం నడిచేక కరణంగారి ఇల్లు కనిపించింది. గుర్తుపట్టేడు. వేగంగా నడుస్తూ మరికొంచెం ముందుకు వెళ్ళాడు.

అదే అనంతరామయ్య ఇల్లు!

ఇంటిముందు గొబ్బెమ్మల్ని ముగ్గుల్లో అమరుస్తోన్న సుందరి హఠాత్తుగా తలెత్తి దారివెంట నడిచి వస్తోన్న రామ్మూర్తిని చూసిందిగానీ, ముందు గుర్తుపట్టలేదు.

రామ్మూర్తి బాగా ఎదిగేడు. మంచి ఎత్తూ, ఎత్తుకు తగిన కండలు తిరిగిన భారీ శరీరం, ఒక్క రంగులో తప్ప శరీర పుష్టిలో గ్రీకు శిల్పానికి దీటుగా.

గుడ్లప్పగించి చూస్తోంది సుందరి.

రామ్మూర్తి దగ్గరి కొచ్చాడు "సుందరీ!" అని పిల్చేడు ఆర్ద్రంగా!

అప్పుడు గుర్తుపట్టింది సుందరి "బావా!" అంది తడబడుతూ.

పళ్ళెంలో ఉన్న చివరిగొబ్బెమ్మను ముగ్గులో పెట్టేసి, తుర్రుమని ఇంట్లోకి వెడుతూనే "నాన్నా! బావొచ్చాడు!" అని పెద్దగా అరిచింది సుందరి.



**చతుర ... 43**

అనంతరామయ్య, భాగ్యమ్మ గుమ్మం దగ్గరికి వచ్చి రామ్మూర్తిని ఇంట్లోకి తీసుకుని వెళ్ళారు.

దశాబ్దం పైన ఎడబాటు తర్వాత కలిసినందువల్లనేమో కొంతసేపు ఎవ్వరూ మాట్లాడ్లేకపోయారు.

అందరి గుండెలూ బరువెక్కేయి.

"కాళ్ళు కడుక్కో! అమ్మా.. బావకు నీళ్ళివ్వు" అన్నాడు చివరకు అనంతరామయ్య.

సుందరి నీళ్ళగాబు దగ్గరికి వెళ్ళింది. ఆమె వెంటే రామ్మూర్తి కూడా వెళ్ళేడు.

సుందరి చెంబుతో నీళ్ళముంచి ఇస్తోంటే తదేకంగా ఆమె మెడవేపే చూసేడు రామ్మూర్తి.

"ఏంటి అలా చూస్తున్నావ్? " అడిగింది సుందరి.

"పెళ్ళయిందేమోనని!"

"పెళ్ళయితే తాళిబొట్టు ఉండేదిగా!"

"అదే చూస్తున్నాను! హమ్మయ్య, బతికించావ్!" అన్నాడు రామ్మూర్తి కొంటెగా.

సుందరి సిగ్గుతో మొగ్గతొడిగింది.

రామ్మూర్తి కాళ్ళు కడుక్కుని సుందరి అందించిన టవల్తో తుడుచుకుంటూ "మా అమ్మా, నాన్నా ఎలా ఉన్నారు? " అడిగేడు.

ఆ ప్రశ్నకు సుందరి భయంతో కంపించింది. అంతలోనే తేరుకుని "ప్రయాణం బాగా సాగిందా? " అనడిగింది మాట మారుస్తూ.

"బాగానే జరిగింది"

"ఇన్ని సంవత్సరాలు అయ్యగారు ఏ రాజ్యాన్ని పరిపాలించేందుకు వెళ్ళారో? " అంది సుందరి కొంటెగా చూస్తూ.

"ఆ కథంతా తర్వాత చెప్తాను. మామయ్యతో, అత్తయ్యతో ఒక్క నిముషం మాట్లాడి అర్జంటుగా ఇంటికి వెళ్ళి అమ్మా, నాన్నను చూడాలి" అని, టవల్ను సుందరి భుజంమీదికి విసిరేసేడు రామ్మూర్తి.

"అంత అర్జంటా? " అంది ఏమనాలో తోచక సుందరి.

రామ్మూర్తి అందంగా నవ్వేడు. ఇంట్లోకి వెళ్ళబోతూ ఆగి "సుందరీ! అన్నట్లు మర్చేపోయాను, దార్లో ఇళ్ళముందు గొబ్బెమ్మలూ, తోరణాలూ వాసనరాలేదు. ఇక్కడ మాత్రం గొబ్బెమ్మల పేడవాసనా, తోరణాల పసరు వాసనా బాగుంది!" అన్నాడు మెచ్చుకోలుగా.

సుందరి అంది "ఊళ్ళో ప్లాస్టిక్ ఇండస్ట్రీ పెట్టారు. గొబ్బెమ్మలూ, తోరణాలు కూడా వాళ్ళే తయారుచేస్తున్నారు. నువ్వు వీధిలో చూసినవన్నీ ప్లాస్టిక్ గొబ్బెమ్మలు!"

నిర్ఘాంతపోయాడు రామ్మూర్తి "మరి, మీరూ ప్లాస్టిక్ గొబ్బెమ్మలు పెట్టలేదేం? " అడిగేడు మెల్లగా.

"వాళ్ళు నాగరికులు మరి మేం అనాగరికులం గదా!" అంది సుందరి వ్యంగ్యంగా.



తల్లిదండ్రులు రోడ్డుప్రమాదంలో మృతి చెందిన విషయం తెలుసుకున్న రామ్మూర్తి ఆ దుఃఖంనించి బయటపడి తిరిగి మామూలు మనిషి అయ్యేందుకు వారంరోజులు పట్టింది. ఆ వారంరోజులూ ఇంట్లోనే ఉన్నాడు. బయటికే వెళ్ళలేదు.

ఆరోజు అనంతరామయ్య రామ్మూర్తి పక్కనే కూర్చుని చిన్నగా మాటలతో కది





పేడు.

"బాబూ... రామ్మూర్తీ! కాలం నైజమే అంత. కసాయితనం దాని స్వభావం! ఏం చేస్తాం, జీవితాలను వెళ్ళబుచ్చాలికదా? నీ భవిష్యత్తు ప్రణాళిక ఏంటి? "

"మామయ్యా! ఇంకా సుందరి పెళ్ళెందుకు చెయ్యలేదు? " అసందర్భంగా అడిగినట్లున్నా ఎన్నో దీర్ఘకాలిక సమస్యలకు ఆ ప్రశ్నే పరిష్కారం అన్నది గ్రహించేడు అనంతరామయ్య.

"ఎన్నో ప్రయత్నాలు చేశాం. కుదర్లేదు. ఇంటికి తిరిగి వస్తోన్నట్లు నువ్వు రాసిన ఉత్తరం చూసేకనే నా మనసుకు శాంతి దిక్కింది. అంతవరకూ సుందరి విషయంలో ఎంతగా ఆందోళన చెందామో!" అన్నాడు.

"ఆందోళన తీరిపోయింది కదా మామయ్యా!" అన్నాడు రామ్మూర్తి.

రామ్మూర్తి తెలివితేటలకు అనంతరామయ్య లోలోపలే సంతోషించాడు.

ఖళ్ళు... ఖళ్ళున దగ్గుతూ వచ్చి "రామ్మూర్తీ! నా ఆరోగ్యం బాగా లేదు. ఏ క్షణాన ఏమౌతుందో చెప్పలేం! నా కళ్ళ ముందే నువ్వు అమ్మాయి మెడలో మూడు ముళ్ళు వేస్తే అంతే చాలు! అటు తర్వాత నేనేమైనా పర్వాలేదు".అంది భాగ్యమ్మ.

"అంతా నీ ఇష్టం! నాకు' అత్తా, మామా అయినా, అమ్మా, నాన్నా అయినా మీరే కదా!" అన్నాడు రామ్మూర్తి.

అందరూ హాయిగా శ్వాస పీల్చుకున్నారు.

సాయంత్రం వేళకు ఇంటినించి బయల్దేరాడు రామ్మూర్తి, ఊరు చూసేందుకు.

"నాయనా, రామ్మూర్తీ!" పిల్చేడు అనంతరామయ్య.

రామ్మూర్తి ఆగి "ఏంటి మామయ్యా? " అని అడిగాడు.

"మరేంలేదు, ఊరంతా మారిపోయింది. చీకటివేళకు అరణ్యంలో క్రూరమృగాలు సంచారానికి బయల్దేరినట్లే ఈ జనారణ్యంలో సంఘవిద్రోహులూ, పరాన్నభుక్కులు, తాగుబోతులు, జూదరులు, వ్యభిచారులూ పగలే సంచరిస్తుంటారు. సంస్కారవంతులంటే వాళ్ళకు పరమచిరాకు. మంచి వాళ్ళంటే వాళ్ళ దృష్టిలో అసమర్థులు! అలాంటి ద్విపాద పశువులు తారసపడితే నువ్వే తలవంచుకుని ఇంటికి తిరిగివచ్చేయి. అనవసరంగా ఘర్షణపడకు" అన్నాడు అనంతరామయ్య.

"త్వరగానే వచ్చేస్తాను మామయ్యా!" చెప్పాడు రామ్మూర్తి.

వాకిట్లో ఎదురుచూస్తూ నించున్న సుందరి బావ అక్కడికి రాగానే అడిగింది. "కరణంగారి తోటకా? " అని.

"కాదు" అన్నాడు రామ్మూర్తి.

"బాదం పండ్లకోసమా? "

"కాదు"

"కొండల్లోకా? "

రామ్మూర్తికి అప్పుడు గుర్తొచ్చి అడిగాడు "సుందరీ! నేను ఊర్నించి వచ్చినరోజే సూర్యోదయం వేళకు కొండలవేపు చూశాను. కనిపించలేదు"

"నిజమే! ఆ కొండల్ని పగులగొట్టారు. అట్టడుగు రాతిపొరల్ని సైతం పెళ్ళగించారు. అక్కడ ఏర్పడ్డ చెరువులాటి లోతట్టు ప్రదేశానికి కట్టలుపోసి మంచినీటి రిజర్వాయరుగా మార్చారు"

"మరి దక్షిణపు చెరువో? "

"దాని కట్టలు తెగ్గొట్టి ఇళ్ళ స్థలాలుగా ప్లాట్లువేసి సగం పేదలకు పంచిపెట్టారు. మిగిలిన సగం చెరువులో ఇండస్ట్రియల్ ఎస్టేటు కట్టారు"

"సాధువు తాతో? "

"ఎప్పుడో చచ్చిపోయాడు" చెప్పింది సుందరి.

రామ్మూర్తి ముఖం వివర్ణమైంది. గుండెలో సన్నని మంట. తలదించుకుని మౌనంగా దక్షిణంవేపుకు నడక సాగించాడు.

పూర్తిగా స్వరూపం కోల్పోయిన చెరువు



భూముల్లో ఒకవేపు పెద్ద పెద్ద పరిశ్రమలు వెలిశాయి.

ప్లాస్టిక్ ఇండస్ట్రీలు రెండు, అల్యూమినియం ఇండస్ట్రీ, ప్రెసిడెంటు మురావాళ్ల బియ్యం మిల్లులూ, దక్షిణాది వాళ్ళ కంది పప్పు మిల్లులూ ఒక వరుసలో ఉన్నాయి.

కెమికల్ ఫ్యాక్టరీ అన్నింటికన్నా చాలా పెద్దది. దాని ఆవరణలో భారీ ట్యాంకర్లు, పడుకుని విశ్రాంతి తీసుకుంటోన్న రాక్షసుల్లా భయంకరంగా ఉన్నాయి. ఆ టాంకర్లనిండా విషవాయువు నిండివుంది.

ఆ కెమికల్ ఫ్యాక్టరీని ఆనుకుని ఫార్మాస్యూటికల్ కంపెనీలు, ఐరన్ రీరోలింగ్ ఫ్యాక్టరీలూ ఉన్నాయి.

ఆ ఐరన్ రీరోలింగ్ ఫ్యాక్టరీల్లో కణకణా మండుతోన్న ఇనప దూలాలు యంత్రాల్లో నలిగి సన్నటి ఊచల్లా మారి బయటికి వస్తూ ఫ్యాక్టరీల పైని శూన్యాన్ని కూడా అరుణవర్ణంగా వెలిగిస్తోన్నాయి.

యంత్రాల చప్పుడు కర్ణకఠోరంగా వినిపిస్తోంది.

ఇండస్ట్రియల్ ఎస్టేటు చివరి ప్లాట్లో ఓ ఇండస్ట్రీ వుంది. బక్క గుర్రాల రక్తం తీసి మనుషుల ఆరోగ్యానికి ఆ రక్తంతో ఔషదులు తయారుచేసే ఇండస్ట్రీ అది.

ఆవరణ చుట్టూ ప్రహరీగోడవారగా పొడవాటి కొట్టంలా నిర్మించబడ్డ రేకుల షెడ్లలో చాలా గుర్రాలు కట్టేసి ఉన్నాయి.

ఆ ఇండస్ట్రీవాళ్ళు చావుకు సిద్ధమైన బక్క గుర్రాలను, రేసుల్లో కిందపడి కాళ్లు విరగ్గొట్టుకున్న దురదృష్టపు గుర్రాలనూ కారుచవుకగా కొని వాటిని దాణావేసి మేపుతూ నిత్యం వాటి శరీరాలనించి రక్తంతోడి మందులు తయారుచేస్తుంటారు.

గుర్రాలను కదలకుండా ఇనప చట్రాల్లో బంధించి వాటి నరాల్లో సూదులు గుచ్చి సిబ్బంది రక్తం తోడుతోంటే ఆ గుర్రాలు బాధతో అరుస్తోన్న అరుపులు భయంకరంగా వినిపిస్తున్నాయి.

ఆ చెరువు నీటిలో అద్దంలోలా మెరిసే మినుకుచుక్కలు ఇప్పుడు లేవు, మూగజీవాల కన్నీటిబొట్ల తళుకులు తప్ప!

జీవితపు ఆవేదనా సారాన్ని పిండి కంఠంలో విషాదం వొలికిస్తూ ఏదో తాత్త్విక కతను మనసుకు దట్టించి నిబ్బరపరిచే సాధువు తాత రాగాలాపన వినిపించటం లేదు. కరకు యంత్రాల ఇనపరాపిడి శబ్దాలు తప్ప!

పూలను స్పృశించి సుగంధాన్ని దోచి తెచ్చి ముక్కుపుటాలకు సుతారంగా తాకే చిరుగాలి తూపులు లేవు. కల్మషభరితమై వళ్ళు గగుర్పొడిచే దుర్గంధపూరితమైన చెడు గాలి కెరటాలు తప్ప!

మనసు వికలమై, హృదయం ద్రవిస్తోంది!

రాక్షసుడెవరో ఉక్కుపిడికిళ్లతో గుండెను పిండుతోన్నట్లు వర్ణనాతీతమైన బాధ!

రామ్మూర్తి ముందుకు నడిచాడు.

పారిశ్రామికవాడ పక్కనే ఉన్న నివేశన స్థలాల్లో గుడిసెల సముదాయం ఉంది.

రోడ్ల మధ్యలో గుట్టల్లా పేరుకుపోయిన చెత్త, చిన్న చిన్న పిల్లకాలువల్లా పారుతూ మురుగూ దుర్గంధంతో ముక్కులు బద్దలవుతూ.

ఆ మురికి కూపంలోకి వెళ్లేదార్లోనే రోడ్డు పక్కన వీధి దీపం వెలుగులో కొంతమంది పందేలు కాస్తూ బొమ్మ-బొరుసు ఆడుతున్నారు.

దానికి కొంచెం అవతలగా ఉన్న గుడిసెలో పేకాట జోరుగా సాగుతోంది.

మురికికూపం మధ్యలో ఉన్న విశాలమైన పందిరిలో అయ్యరు టీ కొట్టూ, అందులో పొడవాటి రెండు చెక్కబల్లలూ ఉన్నాయి.

స్టౌవ్ కిరసనాయిల్ని పీల్చుకుని వెలుగుతూ సన్నగా శబ్దం చేస్తోంది. స్టౌ మీదున్న జర్మన్ సిల్వర్‌గిన్నెలో టీ మరుగుతోంది.

అయ్యరు హోటలు వెనుకగల పది గుడి




సెల్లో చవుకరకం భౌతికసుఖాల అమ్మకం సాగుతోంది.

వచ్చేపోయే రిక్షాలూ, తాగి తూల్తూ ఆ గుడిసెలవేపుకు వెళ్ళి వచ్చే విటులూ, అయ్యరు టీ పోయించుకుని హోటలుకూ, గుడిసెలకూ మధ్య బొంగరాల్లా తిరిగే పసి పిల్లలూ

రామ్మూర్తి నెమ్మదిగా నడుచుకుంటూ వెళ్ళి అయ్యరు హోటలు చెక్కబల్లమీద కూర్చుని 'టీ' అన్నాడు పెద్దగా.

అయ్యరు గరిటెతో గిన్నెలోంచి టీ తీసి గాజుగ్లాసులో పోసుకుని వచ్చి రామ్మూర్తి ముందు పెట్టి స్టౌ దగ్గరికి వెళ్ళిపోయాడు.

మరో చక్కబల్లమీద కూర్చున్న ఇద్దరు బీటు కానిస్టేబిళ్లు ఆరోజు కలెక్షన్ను లెక్క చూసి పంచుకుని సైకిళ్ళెక్కి చెక్‌పోస్టుకేసి వెళ్ళిపోయారు.

రామ్మూర్తి టీ చప్పరిస్తూ అయ్యరు గుడిసె హోటల్లో ఒక మూలగా ఉన్న పోర్టబుల్ టి.వి.లో వస్తోన్న ప్రోగ్రాం చూస్తూ తాపీగా కూర్చున్నాడు.

కొంచెం సేపటికి ఎవరో కుర్రాడు బాగా తాగి, గాల్లో తేల్తూ వచ్చి అయ్యరు ముందు నించున్నాడు.

అయ్యరు భయం నిండిన కళ్లతో కుర్రాడి వేపు చూసి క్షణం కూడా ఆలస్యం చెయ్యకుండా తోలుబెల్టు జేబులోంచి ఐదు రూపాయల కాయితం తీసి ఇచ్చాడు.

ఆ కుర్రాడు కాయితాన్ని మడిచి చొక్కా జేబులోకి తోసి వెళ్ళబోతూ ఎందుకో ఆగి ధ్యానంగా టీ తాగుతూ టి.వి. చూస్తోన్న రామ్మూర్తిని చూశాడు, సూది కళ్లతో!

రామ్మూర్తి ఆ ప్రాంతానికి కొత్తవాడన్నది అర్థమై కుర్రాడు స్టౌవున్న ఎత్తు బల్లమీంచి రెండు గాజుగ్లాసులు అందుకుని బలంగా కిందికి విసిరాడు.

గాజుగ్లాసులు భళ్ళుమని పగిలాయి. గాజుపెంకులు ఎగిరి చెల్లాచెదురుగా పడ్డాయి.

అయ్యరు భయంతో బిర్రబిగుసుకుని పోయాడు.

గ్లాసులు పగిలిన శబ్దానికి రామ్మూర్తి చివాల్న తలెత్తి అటువేపుకు చూశాడు. మళ్లీ తలను టి.వి.వేపుకు తిప్పి అందులో లీనమయ్యాడు.

రామ్మూర్తి నిర్లక్ష్యానికి కుర్రాడికి పట్టరాని ఆగ్రహం కల్గి పెద్ద పెద్ద అడుగులు వేస్తూ వెళ్ళి రామ్మూర్తి భుజంమీద చెయ్యివేసి "పిట్టల కోసం వచ్చావా? " అని అడిగాడు క్రూరంగా.

రామ్మూర్తి టి.వి. తెరమీంచి చూపులు కూడా మరల్చలేదు.

"సారా కోసం వచ్చావా? " అడిగేడు కుర్రవాడు.

రామ్మూర్తి సమాధానం చెప్పలేదు.

"జూదంకోసం వచ్చావా? " అడిగాడు మళ్ళీ.

రాష్ట్ర ప్రగతిని గురించి ముఖ్యమంత్రి ప్రసంగం పూర్తయి టి.వి.లో మరో ప్రోగ్రాం ఎనౌన్సు కాగానే అప్పుడు తలతిప్పి కుర్రాడి వేపుకు చూసి "ఆఁ... ఏంటంటున్నావ్? " అన్నాడు రామ్మూర్తి.

కుర్రవాడు రామ్మూర్తివేపు కళ్ళు విప్పార్చి చూశాడు.

భారీకాయం... కండలు తిరిగిన శరీరం.

అయ్యరు చూస్తుండకపోతే ఆ కుర్రాడు మౌనంగా వెళ్ళిపోయేవాడు కానీ ఇప్పుడు అలా వెళ్తే పల్చబడతానన్న భయంతో "నేనెవరో తెలుసా? " అన్నాడు పెద్దగా, రంకెలు వేస్తూ.

"తెలీదు" చెప్పాడు రామ్మూర్తి.

"గబ్బర్‌సింగంటారు నన్ను"

రామ్మూర్తి చివాల్న పైకి లేచాడు. ఆశ్చర్యంగా ఆ కుర్రాడివేపు చూస్తూ, "గబ్బర్‌సింగొస్తున్నాడని తల్లులు భయపెట్టి పిల్లలచేత పాలు తాగించే ఆ గబ్బర్‌సింగేనా? " అడిగాడు.

కుర్రవాడు ఎడంచేత్తో మీసం తిప్పుతూ

కుడిచెయ్యి పిడికిలి బిగించి బలంగా రామ్మూర్తి ముందున్న బల్లమీద గుద్దేడు.

"అయితే మీరు సింగులా? " అడిగాడు రామ్మూర్తి వ్యంగ్యంగా.

"కాదు! దక్షిణాదివాళ్ళం!"

"నేనెవరో తెలుసా? ఈ ఊరికి కొత్తగా వచ్చిన యముడ్ని" అని రామ్మూర్తి అనగానే ఆ కుర్రాడు నాలుక్కరుచుకుని భయంతో బిక్కచచ్చిపోతూ-

"సార్! మీరు పోలీసు అనుకోలేదు! అయినా మఫ్టీలో వచ్చారేం సార్? " అని గిర్రున వెనక్కు తిరిగి "అరే, అయ్యర్నాకొడకా... అయ్యగారికి నా ఖాతాలో మాంచి టీ కొట్టు!" అని ఆదేశించాడు.

సరిగ్గా అప్పుడే అయ్యరు హోటలుకు లుంగీమీద వచ్చాడు ఆంజనేయులు.

అప్పుడు బస్టాండ్లో చాలాసేపు బాతాఖానీ కొట్టింది గుర్తొచ్చి "రామ్మూర్తిగారూ! ఇలా వచ్చారేం? " అని చనువుగా రామ్మూర్తిని పలుకరించాడు.

కుర్రాడు కల్పించుకున్నాడు. ఆంజనేయులువేపు చూస్తూ "సార్ నీకు తెలుసా? " అని అడిగేడు.

"తెలుసులే!" అని ఆంజనేయులు ఆ కుర్రాడ్ని రామ్మూర్తికి చూపించి "వీడూ మా కులపోడే" అని చెప్పి-

"అరేయ్ గబ్బర్! నువ్వెళ్ళిపో!" అన్నాడు కుర్రాడితో.

కుర్రాడు బయటికి వెళ్ళిపోయాడు.

అయ్యరు రెండు టీలు తెచ్చి బల్లమీద పెట్టాడు.

ఇద్దరూ బల్లమీద కూర్చుని గ్లాసులు అందుకున్నారు.

"రామ్మూర్తిగారూ! ఇందాకటోడూ దక్షినాదోడే! మీకిదివరకే చెప్పానుగా. ఈ ఊళ్లో డామినేషన్ మాదేనని! మేమంటే ఇక్కడ అందరికీ హడల్! మా గబ్బర్‌గాడ్ని చూసేరుగా. మామూలు రౌడీ కాదు, మా కులపోళ్లు అలాంటోళ్లు పేటకిద్దరున్నారు. అందుకే స్థానికులు కూడా మాకు తలవంచి బతకాల్సిందే!" అని ఆంజనేయులు చల్లారిపోయిన టీ మొత్తాన్ని ఒక్క గుక్కలో తాగి-

"చెప్పానుగా, మీ కులపోళ్ళంతా మాకే సపోర్టు. ఊళ్లో కొంతమంది చిల్లరమల్లర కులాలవాళ్లు మధ్యమధ్యలో తోక జాడిస్తారు కానీ వాళ్ళు చెయ్యగల్గిందేం లేదు" అని ఆంజనేయులు ఇంకా ఏదో చెప్పబోతోంటే రామ్మూర్తి మధ్యలోనే ఆపి-

"ఆంజనేయులుగారూ! ఇవ్వన్నీ ప్రభుత్వం నిరుపేదలకు, కార్మికులకూ ఇచ్చిన ఇండ్ల స్థలాలేకదూ? "

"అవును" అన్నాడు ఆంజనేయులు.

"మరి ఇక్కడి వాతావరణం ఇలా ఉందేం? "

"అదంతా ఆ నాంచారయ్య మాయాజాలం! జనాన్ని వెంటేసుకుని గొడవ చేసి మరీ స్థలాలు ఇప్పించాడు. బినామీ పేర్లతో ఆయన పది ప్లాట్లు కొట్టేశాడు. వాటిల్లో గుడిసెలు వేసి 'పిట్టల'కు అద్దెకిచ్చాడు. పట్టాదారుల్ని బెదిరించి కొన్ని గుడిసెల్ని బలవంతంగా ఆక్రమించుకుని జూదం నడుపుతున్నాడు" చెప్పాడు ఆంజనేయులు.

"మరి అతడ్ని ఎవ్వరూ ప్రశ్నించలేదా? "

"వాడి ముఠా సపోర్టు మాకే! అందుకే వాడ్ని చూసీచూడనట్లు వదిలిపెట్టేశాం"

"నాంచారయ్యంటే ఎవరు? ఎక్కడుంటాడు? "

"కార్మిక నాయకుడు! క్వారీలదగ్గరే ఇల్లు!"

"వెళ్ళొస్తాను" అని చెప్పి ఆంజనేయులు వద్దని వారించినా వినకుండా అయ్యరుకు టీ డబ్బులిచ్చి అక్కడ్నించి కదిలేడు రామ్మూర్తి.

★ ★ ★

రాత్రి భోజనాలు ముగించిన తర్వాత రామ్మూర్తి నెమ్మదిగా అనంతరామయ్య దగ్గరికి వచ్చి కూర్చున్నాడు.

భాగ్యమ్మ మంచంమీద కళ్లు మూసుకుని





పడుకునుంది.

సుందరి ఇంటి వెనుక ఉన్న ఖాళీ స్థలంలో చెక్క కుర్చీ వేసుకుని కూర్చుని వుంది.

రామ్మూర్తి ఊర్నించి వచ్చాక వారంరోజులకు పైనే ఇల్లు కదలకుండా బాధపడుతూ ఉంటే అతడికి ధైర్యం చెప్పటం, అంటిపెట్టుకుని ఉండటంతో సుందరికి పొద్దుపోయింది. అలా ఒంటరిగా ఆకాశంకేసి చూస్తూ కూనిరాగాలు తీసే అవకాశం ఆమె కీరోజే చిక్కింది.

"రామ్మూర్తీ! ఊళ్లో ఎక్కడెక్కడ తిరిగొచ్చావ్? నువ్వు గతంలో చూసిన భారతీపురానికీ ఇప్పటికీ ఉన్న తేడా గమనించావా? "

పక్కనే కూర్చున్న రామ్మూర్తిని అడిగాడు అనంతరామయ్య.

"ఊరంతా చూళ్ళేదు మామయ్యా! చెరువు దగ్గరికి మాత్రం వెళ్ళి చూసొచ్చాను" అన్నాడు రామ్మూర్తి.

ఆ మాట వినగానే అనంతరామయ్య ఉలిక్కిపడ్డట్టే చూశాడు. "అక్కడికే వెళ్ళావా? " అన్నాడు అదోలా.

"అవును! ఆ ఇండస్ట్రీలూ, మురికికూపాలూ ఓహో! చాలా ప్రగతిపథంలో పయనిస్తోంది మన ఊరు!" అన్నాడు రామ్మూర్తి చివరి మాటల్ని వొత్తిపలుకుతూ.

అనంతరామయ్య దిగులుగా నవ్వాడు.

"నాంచారయ్య నీకు తెలుసా మామయ్యా? " క్షణం తర్వాత అడిగాడు రామ్మూర్తి.

"నాంచారయ్యా? నాకు వ్యక్తిగతంగా పరిచయంలేదు. కాకుంటే అతడ్ని గురించి విన్నాను. రూపాయి డబ్బులకోసం ఏంటేంటో చేస్తుంటాడు కానీ అంతగా పట్టించుకోదగ్గ మనిషేం కాదు"

"ఊళ్ళో మునసబుగారి పార్టీవాళ్ళే నాటుసారా రాజులు కదూ? " మళ్ళీ అడిగాడు రామ్మూర్తి.

"అవును. అలా చెయ్యటం నిజానికి అతనికి ఇష్టంలేదు. మనుగడకోసం తప్పనిసరై ఆ మార్గం పట్టాడు. ఎదుటి పార్టీవాళ్లు చిల్లర దొంగలైతే మనం గజదొంగలం కావాలి! వాళ్లు కులంపేరుతో బలం పుంజుకుంటే మనం మతం పేరుతో వాళ్లు రాజకీయంగా బలపడితే మనం ప్రాంతీయ విభేదాలు సృష్టించాలి.

"బ్రాందీషాపుల సిండికేటు వ్యాపారానికి కింగు ప్రెసిడెంటుకదూ? "

"సాగినంతకాలం కింగే. ఇందాక చెప్పానే ఈ వ్యవస్థలో ఎప్పుడు ఎవడు కింగవుతాడో, ఎప్పుడు ఏ కింగు పాతగోచీలా విసిరి పారవెయ్యబడతాడో అనూహ్యం! అన్నాడు అనంతరామయ్య.

రామ్మూర్తి దీర్ఘంగా నిట్టూర్చాడు.

కొంచెంసేపు మౌనంగా ఆలోచించి "మామయ్యా! ఇలాంటి అవాంఛనీయ రాజకీయ పరిణామాల పట్ల ప్రతిస్పందన, ప్రతిఘటన, ధైర్యం లేకపోవటం విచారకరం కదూ? ఇలా ఎంతకాలం"

"సహనం నశించి తెగించినంతవరకే. ఏదో ఒకరోజున ప్రతిఘటన తప్పదు. కొద్దిపాటి అసంతృప్తే కాలగమనంలో మహావృక్షమవుతుంది. తొడగొట్టి సవాలు చేస్తుంది"

"ఆ పరిణామం త్వరితం కాదా? "

"అదే మన దౌర్భాగ్యం! భిన్నమైన భారతీయ సంస్కృతి ఏకోన్ముఖమై ప్రగతివేపుకు పయనించాలంటే సామాన్యం కాదు. దానికి అన్నీ అవరోధాలే. కులం, మతం, భాష, ప్రాంతం, విద్యావిధానం, క్షుద్ర రాజకీయం...

రేడియోలో వార్తలొస్తుంటే ఇద్దరూ మాట్లాట్టం ఆపి, వార్తలు వింటూ కూర్చున్నారు.

"మామయ్యా! నీకు ఇంగ్లీషు ఎలా అబ్బింది? " ఎందుకో అనుమానం వచ్చి

అడిగాడు రామ్మూర్తి.

చిన్నగా నవ్వి "నాకు మొత్తం నాలుగు భాషలు వచ్చు వ్యాపారం కోసం దేశాలు తిరిగి సమాజం అనే బడిలో నేర్చుకున్నాను" చెప్పాడు అనంతరామయ్య.

దేశాలు తిరిగి అని ఆయన అనగానే రామ్మూర్తికి తన విషయం గుర్తొచ్చింది.

భారతీపురంనించి వెళ్ళిన తను అంత కాలం ఎక్కడుందీ, ఏం చేసిందీ మామయ్య ఇప్పటిదాకా ఒక్క మాటైనా అడగలేదు. వాళ్ళమ్మాయిని పెళ్ళి చేసుకోబోతున్నందున తన స్థితిగతుల్నీ, జీవితంపట్ల మనసులో ఏర్పరచుకున్న భవిష్యత్తు ప్రణాళికనూ ఆయనకు చెప్పే సందర్భం కోసమే ఎదురు చూస్తున్నాడు రామ్మూర్తి.

ఆ సందర్భం ఇప్పుడు వచ్చిందనిపించి "మామయ్యా! నువ్వు దేశాలు తిరగటం వెనుక ఓ లక్ష్యం ఉంది. అందుకే తిరిగేవు. కానీ ఏ ధ్యేయమూ, లక్ష్యమూ లేకుండానే నేను వెళ్ళాను. గుజరాత్‌లో కాలం గడిపాను. చిన్నా చితకా పనులుచేస్తూ పొట్ట పోసుకున్నాను. చిన్నప్పుడొకరోజు నీతో అన్నాను జ్ఞాపకం ఉందా... అమ్మా నాన్నా మగ్గంమీద బట్టలు నేస్తోంటే చూస్తుండటం అంటే నాకిష్టం అని! గుజరాత్‌లో చేనేత బట్టలకు గౌరవం ఇంకా తగ్గలేదు. అవి ధరించటం వాళ్లు గర్వంగా భావిస్తారు. గాంధీగారి ప్రభావం కావచ్చు! అక్కడ మద్యపానం కూడా లేదు.

తాగిన వాళ్ళను అక్కడివాళ్ళు అసహ్యంగా చూస్తారు. సంఘ బహిష్కృతులుగా తృణీకరిస్తారు. ఆ రాష్ట్రంలో మద్యం దొరక్కపోవటమేకాదు, ఇతర ప్రాంతాల నించి కూడా మద్యం ఆ రాష్ట్రంలోకి తెచ్చే సాహసం ఎవ్వరూ చెయ్యరు. అలా కొన్ని రంగాల్లోనైనా మన సంస్కృతి అక్కడ ఇంకా సజీవంగానే ఉందంటే ఆ గొప్పతనం గాంధీగారిదే! అక్కడ పెరిగాను మామయ్యా... నేను! చివరకు నాకిష్టమైన చేనేత మగ్గాల పన్లోనే చేరి బట్టలను మరింతగా అందంగా నేయటం, జరీతో చీరలకు బుటాలను కళాత్మకంగా వెయ్యటం నేర్చుకున్నాను. మంచి పేరూ, డబ్బూ సంపాదించాను. జీవితంలో ఒక స్థిరత్వం కలిగేక మీరంతా గుర్తొచ్చారు. అంతే! ఇంటికి తిరిగొచ్చాను" చెప్పేడు రామ్మూర్తి.

అనంతరామయ్య మౌనంగా వింటున్నాడు.

రామ్మూర్తి లేచి ఇంట్లోకి వెళ్ళి క్షణంలో తిరిగి వచ్చాడు. తన చేతిలో ఉన్న పాకెట్టును అనంతరామయ్యకిస్తూ, "మామయ్యా! సుందరికోసం ఇది నా స్వహస్తాలతో నేసిన చీర! మా పెళ్ళి నిర్ణయంకాగానే సుందరికి ద్దామని నాకు ఇష్టమైన రంగునూలుతో బుటా వేసి నేసేను. ఎలా ఉందో చెప్పవూ? " అన్నాడు తల దించుకుని.

అనంతరామయ్య పాకెట్టునించి చీర బయటికి తీసి మడతలు విప్పి పరీక్షగా చూసేడు.

అతని కళ్ళు వింత కాంతితో మెరిసేయి!

పూర్తిగా పొడి చెయ్యకుండా పసుపు కొమ్మును మధ్యకు విరగ్గొడితే కనిపించే ముదురు రంగు చీర అది. ఎర్రంచూ, జిగేల్మని మెరుస్తూ నక్షత్రాల్లా అందమైన వెండి బుటా...

చీర అనూహ్యామైనంత అందంగా ఉంది.

ఆ కళానైపుణ్యానికి లోలోపలే సంతసిస్తూ క్షణం తర్వాత రామ్మూర్తితో అన్నాడు అనంతరామయ్య. "రామ్మూర్తీ! అద్భుతంగా ఉంది చీర! పాలియస్టర్, షిఫాన్, సిల్కు చీరలను ప్రేమించే ఆధునికులు కూడా ఇలాంటి చీరలను చూస్తే అబ్బురపడక తప్పదు. రోజురోజుకూ చేనేత వస్త్రాలకు ఆదరణ తగ్గిపోతోందనీ, మగ్గాలు మూలపడుతున్నాయనీ కొంతకాలంగా నేను మానసికంగా కుంగిపోతున్నాను. ఈ వృత్తిలో ఉన్నవాళ్ళు చాలామంది అలాగే కుంగి





పోయి మగ్గాలను మూలకునెట్టి అప్పుల పాలయ్యారు. ప్రభుత్వం వచ్చి ఆదుకుంటేనే తప్ప ఆకలి చావులు అనివార్యం అన్నారు.

"రామ్మూర్తీ! నా వరకు నాకు నా ధోరణి తప్పని ఇప్పుడే తెలిసింది. నువ్వు నేసిన చీర సన్నదనం, నాజూకుతనం చూసింత ర్వాత ఇంకా కళానైపుణ్యం చూపకుండా ఆదికాలపు విధానంలోనే ముతక చీరలు నేయటానికి మాత్రమే మగ్గాలను పరిమితం చేస్తే వచ్చేని అనర్థాలు మాత్రమే!

"సంస్కృతి క్షణం క్షణం నూతనత్వాన్ని సంతరించుకుంటూ కొత్త అంశాలను యిముడ్చుకుంటూ అప్రతిహతంగా ముందుకు సాగిపోతుంటుంది. అయినా అది ప్రాథమిక విషయాలను పూర్తిగా విస్మ రించదు. వాటి పునాదులపైనే మార్పుల్ని ఆహ్వానిస్తుంది.

"అందువల్ల పూర్తిగా చేనేత వస్త్రాలను విస్మరిస్తున్నారన్నది నిజం కాదు! ఆ రంగంలో కొంచెం కళాత్మకత సాధిస్తే మగ్గా లకు మళ్ళీ మంచిరోజులొస్తాయి" అన్నాడు అనంతరామయ్య సంతోషంగా.

"మామయ్యా! నేనిక మన మగ్గాలను వెలికితీస్తాను. మన చేనేత వస్త్రాలకు పూర్వ వైభవం కల్గిస్తాను!" అన్న రామ్మూర్తి మాట లకు అనంతరామయ్య కళ్ళు చెమర్చాయి!

అభిమానంగా రామ్మూర్తివేపు చూస్తూ "అలాగే... అలాగే!" అని, క్షణం తర్వాత "రామ్మూర్తీ! నువ్వు నేసిన జరీచీరను సుంద రికి నువ్వే ఇవ్వు. ఆనందిస్తుంది" అన్నాడు.

రామ్మూర్తి చీరను పట్టుకుని సుందరి కోసం అటు వెళ్తోంటే ఆమే ఎదురొచ్చింది.

★ ★ ★

రామ్మూర్తి పరిసరాలను గమనించి చూస్తూ ముందుకు నడుస్తున్నాడు.

బాల్యంలో చదువుకున్న బడి స్థానంలో ఏదో పెద్ద మేడ వెలిసింది. ఆ మేడ ఎవరో క్వాట్జ్ గనుల యజమానిదట.

తలెత్తి చూసేడు రామ్మూర్తి!

ఆ మేడ నిర్మాణంలో ప్రతి అంగుళం డబ్బులు పొదిగినట్టే ఉంది! రాజస్థాన్ పాల రాతి పలకల తాపడంతో కాంతివంతంగా మెరుస్తోంది. రెండు కార్లూ, నాలుగు జీపులూ, కుక్కలూ.

ఆ ఇల్లు దాటి కొంచెం ముందుకు వెళ్ళేడు. ఊరి బొడ్రాయి కనిపించలేదు! నడక వేగం పెంచి తూరుపు దిక్కుకేసి సాగి పోయేడు.

దూరంగా ఉన్న రైల్వే స్టేషన్నించి రణ గొణ ధ్వని వినిపిస్తోంది. సమాంతరంగా సాగిపోతోన్న పట్టాలుదాటి రామ్మూర్తి అలా రెండు ఫర్లాంగులు ముందుకునడిచేడు.

అక్కడ స్టోన్ క్రషర్లున్నాయి. అవి పెద్ద శబ్దంతో పరిసరాలు దద్దరిల్లేలా పనిచేస్తు న్నాయి. ఆ క్రషర్లనించి వెలువడుతోన్న ధూళి ఊర్ని మింగేందుకు వస్తోన్న మాయా మేఘంలా ఉంది! ఆ క్రషర్లకు చుట్టూ కనుచూపు మేరలో ఉన్న చెట్లన్నీ ఆ ధూళిని కప్పుకుని ఎండిన మోడులై తెల్లగా కనిపిస్తోన్నాయి. పచ్చదనం అన్నదే ఎక్కడా కనిపించటంలేదు.

రామ్మూర్తి ముఖం మ్లానమైంది! జీవి తంలో అత్యంత విలువైన వేహో మనిషి చేతులారా కోల్పోతున్నాడన్న భావన!

"ఎవరు కావాలి? " అక్కడికి వచ్చిన కార్మి కుడెవరో అడిగేడు.

రామ్మూర్తికి ఏం చెప్పాలో తోచలేదు. "నాంచారయ్య ఉండేది ఎక్కడ? " అని అడి గేడు అప్రయత్నంగా.

అతను కార్మికవాడ వేపుకు వేలుచూ పిస్తూ "అదిగో! ఆ గుడిసెల మధ్యనున్న జండా గుడిసెలో ఉంటారు" అని చెప్పేడు.

రామ్మూర్తి నెమ్మదిగా నడుస్తూ వెళ్ళేడు. నాంచారయ్య కార్యాలయం తలుపు దగ్గరికి వేసుంది.

తలుపు తట్టబోయిన వాడల్లా ఠక్కున ఆగేడు.



లోపల్నించి ఒక ఆడగొంతు, ఒక మగ గొంతు వినిపించాయి.

వాళ్ళ మాటలనుబట్టి ఆమె రమణి అనీ, అతను నాంచారయ్య అనీ రామ్మూర్తి గ్రహించేడు! నిశ్శబ్దంగా అక్కడే నించు న్నాడు.

★ ★ ★

రమణి ఎంతో గారాబంగా పెరుగుతోన్న పిల్ల! తండ్రి సుబ్బారావుకానీ, తల్లికానీ ఆ అమ్మాయి మాటకు ఎదురు చెప్పరు.

అటు పంచాయితి గుమాస్తాగా, ఇటు బ్రాందీషాపు వల్లా సుబ్బారావు విపరీతంగా డబ్బు ఆర్జిస్తున్నాడు.

రమణి అడిగిందే తడవుగా ఆమె కోర్కెల్ని తీర్చటం తప్ప ఏనాడూ సుబ్బా రావు కూతురి విషయాల్లో తలదూర్చలేదు. అంతటి తీరిక అతనికి లేదు. జీవితం పూల రథంలా సాగిపోతోందని అతని భ్రమ!

రమణి చిన్నతనంలోనే అందుబాట్లోకి వచ్చిన సెక్సు, థ్రిల్లర్ సాహిత్యంతో బాగా ఆకర్షితురాలైంది. జీవితం అంటే అదే అను కునేంతగా ఆ సాహిత్యంలో కూరుకుపో యింది.

అలాంటి పరిస్థితుల్లో ఆమెకు నాంచా రయ్య పరిచయమయ్యాడు.

అతనికి మంచి వాగ్ధాటి ఉంది. ఉద్రేకపూ రితంగా ఉపన్యాసాలు యిస్తుంటాడు! ఎప్పుడూ ఖరీదైన దుస్తులు ధరించి, అందంగా ముస్తాబై పోరాటాలు సాగిస్తుం టాడు!

అలాంటి హీరోలను రమణి చాలా తెలుగు సినిమాల్లో చూసింది.

అందుకే అతడ్ని ప్రేమించి, ఆ ప్రేమ సామ్రాజ్యాన్ని పరిపాలిస్తూ థ్రిల్లు అనుభ వించాలని, ఆ సామ్రాజ్యాన్ని ఎవరైనా ధ్వంసం చెయ్యబోతే వాళ్ళను ఛేజ్ చేసి మరీ రివెంజ్ తీసుకోవాలనీ ఆమె కలలు కన్నది.

నాంచారయ్య కూడా ఆమె సరైన జోడీ అన్నది తొలి పరిచయంలోనే రుజువు చేసు కున్నాడు. ఆమె ముందు మైనంలా కరిగిపో యాడు!

మరీ సినిమాల్లోలా డ్యూయట్లు లేవుకానీ ఇన్‌స్టెన్టు లవ్వూ, ఔట్‌డోర్లో సెక్సూ మామూలే!

వాళ్ళిద్దరూ అలా రహస్యంగా కలుసుకుం టున్నారని, కార్మికుల్లో కొంతమందికి తెలి సినా ఆ విషయం బయటికి పొక్కలేదు. వాళ్ళంతా నాంచారయ్య అనుచరులే!

"మనం లేచిపోదామా? " అడిగిందొక రోజు రమణి.

"నాకేం అభ్యంతరం లేదు!" అన్నాడు నాంచారయ్య.

"అయితే నీదే ఆలస్యం!"

"నీ కాన్వెంటు నేంచేస్తావ్? "

"కాలిపోనీ... నాకేం? "

"మీ అమ్మా, నాన్నా పోలీసురిపోర్టిస్తే? "

"ఇచ్చుకోనీ ... నాకేం!"

"వాళ్ళు పట్టుకుని ప్రశ్నిస్తే? "

"నా జీవితం నాదంటాను"

"మరి నా యూనియనో? " అడిగేడు నాంచారయ్య.

"తగలబడిపోనీ! అంతగా నీకు నాయ కుడి పని తప్ప మరోపని చాతకాకపోతే మనం వెళ్ళిన చోటే ఓ చిన్న యూనియన్ పెట్టుకుని నాయకుడి పనే చేద్దువుగాని!"

"అక్కడ చెరువులో నా గుడిసెలో? "

"ఎంతకొంతకు తెగనమ్మెయ్యి. నష్టపోయేం దుకు అందులో నీ పెట్టుబడేంలేదుగా!"

"సరే! అన్నీ చక్కబెట్టుకునేందుకు కొద్ది సమయం పడుతుంది"

"ఈ క్షణంనించి ఆ ప్రయత్నంలోనే ఉండు"

"అవస్యం!" అన్నాడు నాంచారయ్య.

★ ★ ★





"ఎందుకు రమ్మని కబురుచేశావ్? " నాంచారయ్యను అడిగింది రమణి.

"నా ఏర్పాట్లన్నీ పూర్తయ్యాయి. మనం వచ్చే ఆదివారం ఊర్నించి ఉడాయించ వచ్చు" అన్నాడు నాంచారయ్య ఆమెను దగ్గ రికి తీసుకుని పొదివిపట్టుకుంటూ.

"మరైతే నేను ఆదివారంనాటికల్లా బట్టలు సర్దుకుని సిద్ధంగా ఉంటాను"

"ఇంట్లో ఉన్న బంగారం, డబ్బూ మొత్తం కూడా సర్దటం మర్చేపోకు" అన్నాడు నాంచారయ్య.

"అలాగే!" అని, కుర్చీలోంచి లేచి బయ టికి వెళ్లేందుకు తడిక తలుపును నెట్టుకుని రెండంగలు వేసి, అక్కడే నించున్న రామ్మూ ర్తిని చూసి నిర్విణ్ణురాలైంది రమణి.

నాంచారయ్య బయటికొచ్చాడు.

కొత్త వ్యక్తిని చూసి "ఎవరు కావాలి? అని అడిగేడు.

రమణి అక్కడ్నించి చల్లగా జారుకుంది.

నాంచారయ్యతో మాట్లాడేందుకు రామ్మూ ర్తికి మనస్కరించకపోయినా మాట్లాట్టం తప్పనిసరై-

"నాంచారయ్యగారంటే మీరేనా? " అనడి గేడు.

"అవును! మీరెవరు? "

"నా పేరు రామ్మూర్తి"

"ఎక్కడ్నించి వచ్చారు? "

"ఈ ఊరే! మొన్నటిదాకా గుజరాత్‌లో ఉండి ఈమధ్యనే వచ్చాను"

నాంచారయ్య తడిక తలుపును పూర్తిగా తెరిచి రామ్మూర్తిని లోపలికి ఆహ్వానిం చాడు.

ఇద్దరూ కూర్చున్నారు.

"ఏం పని? " అడిగేడు నాంచారయ్య.

"ప్రత్యేకంగా పనేంలేదు! మీలాంటి వాళ్ళ పరిచయం ఉంటే మంచిదన్న ఉద్దేశంతో వచ్చాను" అని రామ్మూర్తి అనగానే నాంచా రయ్య గుండెనిండా గాలి పీల్చుకుని, ఛాతీ ఉబ్బించి, దర్పంగా చూస్తూ-

"రామ్మూర్తీ! గుజరాత్‌లో కార్మికవర్గం ఇంకా చైతన్యం కాలేదు కదూ? " అని అడి గేడు తల ఎగురవేస్తూ.

"తమలాంటివాళ్లేరీ, ఉంటే చైతన్యం ఎంత సేపూ"

"ఇక్కడ కొంతవరకు పర్లేదు!" అన్నాడు నాంచారయ్య కించిత్తు గర్వంగా.

"అదే విన్నాను!" ఒప్పుకోలుగా అన్నాడు రామ్మూర్తి.

★ ★ ★

ఆదివారం దగ్గరపడుతోంది!

రామ్మూర్తికి ఎంతగా ఆలోచించినా రమణి విషయంలో ఏం చెయ్యాలో అర్థం కావటంలేదు. ఆలస్యం చేస్తే అనర్థం జరు గుతుంది. ఏదో ఉద్రేకంలోనో, పరిస్థితుల ప్రోత్సాహం వల్లనో, అందుబాట్లో కుప్పలు తెప్పలుగా దొరుకుతున్న దుష్ట సాహిత్య ప్రభావంవల్లనో, ఊహల్లో రంగుల ప్రపం చాన్ని చూపిస్తూ వాస్తవికతకు దూరంగా బ్రతకమని యువతను శపిస్తోన్న చవుక బారు సినిమాల ప్రభావంవల్లనో రమణి లాంటి వాళ్ళెందరో బలైపోతోన్నారు. జీవి తాలు ఛిద్రమై, కలల ప్రపంచం గేలిచేసి, ఊహాసౌధాలు భళ్లున పగిలి, పరితపిస్తూ, ఆక్రోశిస్తూ, గుండెలు చించుకుని చేస్తోన్న నిస్సహాయపు ఆక్రందనలు చెవుల్లో హోరు మంటోన్నాయి!

సందిగ్ధంలో పడ్డాడు రామ్మూర్తి!

నాంచారయ్య ఆకర్షణలోపడి రమణి చెయ్యబోతున్న నిష్ఫల సాహసం గురించి రమణి తండ్రి సుబ్బారావును ముందుగానే హెచ్చరించాలనుకున్నాడు.

కానీ, సుబ్బారావు వాస్తవిక దృష్టితో ఆలో చిస్తాడా? లేక సగటు తండ్రికిమల్లే ఆ నిజాన్ని జీర్ణించుకోలేక అది అవాస్తవం అనీ, గిట్టక వేస్తోన్న అభాండం అనీ భావి స్తాడా?

ఏమో!



శనివారం రానేవచ్చింది. సాయంత్రం వేళకు రామ్మూర్తి రమణి విషయంలో తాత్సారం చెయ్యకుండా సుబ్బారావును హెచ్చరించాలనే నిర్ణయించుకుని బ్రాందీ షాపు దగ్గరికి వెళ్ళాడు.

సుబ్బారావు కౌంటర్లోనే కూర్చుని కనిపించేడు.

"నా పేరు రామ్మూర్తి" పరిచయం చేసుకుందుకు అన్నాడు సుబ్బారావుతో రామ్మూర్తి.

"నాకు తెలుసు! గుర్తుపట్టాను. దేశాలమీదికి వెళ్ళి ఈమధ్యనే తిరిగొచ్చావు కదూ? " అన్నాడు సుబ్బారావు కౌంటర్ సొరుగు మూస్తూ.

రామ్మూర్తి మనసు కలుక్కుమంది!

రమణి విషయం చెప్పకుండా తిరిగి వెళ్ళిపోతే ఇరవైనాలుగు గంటల్లో సుబ్బారావుకు శిక్ష అదే పడుతుంది. ఒక్కక్షణం ఆలోచించేడు. చెప్పకుండా వెళ్ళేందుకు మనస్కరించలేదు.

"సుబ్బారావుగారూ! మీతో ఒక విషయం మాట్లాడాలి" అన్నాడు కోపాన్ని తమాయించుకుంటూ.

సుబ్బారావు నొసలు చిట్లించేడు. "ఏంటి? " అన్నాడు ప్రశ్నార్ధకంగా చూస్తూ.

అతని నోటివెంట విస్కీవాసన గుప్పుమంటోంది!

"రహస్యం!" అన్నాడు రామ్మూర్తి.

"పర్లేదు, చెప్పు!" అని, కౌంటర్మీద మోచేతులుంచి ముందుకు వొంగేడు సుబ్బారావు.

రామ్మూర్తి చుట్టూ చూసేడు. షాపులోపల అంతా పానప్రియులతో గందరగోళంగా ఉంది కానీ కౌంటర్ దగ్గర ఎవ్వరూ లేరు.

ఆ చర్చను ఎలా ప్రారంభించాలో రామ్మూర్తికి అర్థంకావటంలేదు.

"వచ్చిందెందుకో చెప్పు! అలా నసుగుతావేం? విస్కీ అప్పుకావాలంటే అడుగు. తాగుడు దగ్గర మొహమాటం ఎందుకూ? " అన్నాడు సుబ్బారావు కొంచెం అసహనంగా.

రామ్మూర్తికి చిర్రెత్తుకొచ్చింది! "నాంచారయ్య మీకు తెలుసు కదూ? " అడిగేడు శాంతంగానే.

"తెలుసు! మావాడే!"

"మీవాడు కనుకనే మీ అమ్మాయిని వల్లో వేసుకున్నాడు. అభంశుభం తెలియని పిల్ల! కొంచెం జాగ్రత్తగా ఉండండి" అన్నాడు రామ్మూర్తి.

సుబ్బారావు కౌంటరుకు తాళంవేసి ఆగ్రహంగా పైకి లేస్తూ "ఏం. కూసేవురా... ఎంత ధైర్యం నీకు! నేను తల్చుకుంటే నీ శవాన్ని కూడా మాయం చెయ్యగలను" అంటూ వచ్చి రామ్మూర్తి గుండె బొత్తాల దగ్గర చొక్కాను గుప్పిట్లో బిగించి షాపు సిబ్బంది నుద్దేశిస్తూ "అరేయ్... ఎవర్రా అక్కడ! మన వాళ్ళను పిలవండి" అని గర్జించేడు.

రామ్మూర్తి అతడివేపు సౌమ్యంగానే చూసేడు. "సుబ్బారావుగారూ! నామాట వినండి! నేను చెప్పేది నిజం!" అన్నాడు శాంతంగానే.

సుబ్బారావింకా రంకెలు వేస్తోనే ఉన్నాడు. రామ్మూర్తి చొక్కాను విడిచిపెట్టకుండానే "అరేయ్! నువ్వెందుకిలా మా అమ్మాయిమీద అభూత కల్పనలు అల్లావో నాకు తెలుసు! నువ్వు దేశాలమీదికి వెళ్ళటానికి కారణం నేననేగా? దమ్ముంటే నామీద కక్ష తీర్చుకో! పసిపిల్ల మీదట్రా నీ ప్రతాపం? " అంటోన్నప్పుడే షాపులోంచి వస్తాదుల్లాంటి ఇద్దరు వ్యక్తులు కౌంటర్ దగ్గరికి వచ్చి, పరిస్థితి గమనించి, రామ్మూర్తిని పెడరెక్కలు విరిచిపట్టుకుని,

"ఏం జరిగింది సారూ? " అని అడిగేరు సుబ్బారావును.

అప్పటిదాకా కౌంటరు వెనుకే ఉన్న చెక్కల గదిలో చీప్ లిక్కర్ తాగుతూ





కూర్చున్న శేషతల్పశాయి కుర్చీలోంచి చివాల్న లేచి, బయటికి రాబోయి ఏదో తట్టుకుని పడబోయి తమాయించుకుని వచ్చి,

"రామ్మూర్తంటే వీడేనా?" అని అడిగేడు సుబ్బారావును.

"అవును, వీడే!" అన్నాడు సుబ్బారావు.

"ఏం జరిగింది సారూ?" అని వస్తాదులు అడిగినా అమ్మాయి విషయం బజార్నపడుతుందన్న ఆలోచనతో చెప్పకుండా సుబ్బారావు నీళ్ళు నములుతోంటే శేషతల్పశాయి ముందుకొచ్చేడు.

"ఎంగిలి మెతుకులు గతికే వెధవనా యాల! సుబ్బారావు కూతురు నాంచారయ్యవల్లో పడ్డదని మగాళ్ళా వచ్చి చెప్తావ్రా? ఆ అమ్మాయి నాంచారయ్యవల్లో పడుతుందో, సినీయాక్టరు నాగార్జునవల్లోనే పడుతుందో దానిష్టం! మధ్యలో నీకెందుకురా..."

అని తాగిన మైకంలో వాగేశాడు.

సుబ్బారావు రామ్మూర్తి విషయం పక్కకు పెట్టి శాయిని రెండు చేతులూ పట్టుకుని బుజ్జగిస్తూ "పోనియ్యండి శాయిగారూ! మన్లాంటి మంచివాళ్ళ మీదనే అభాండాలు వేస్తారు కానీ తెగించి తిరిగే వాళ్ళ జోలికి ఎవ్వరూ పోరు. మీకెందుకూ... వెళ్ళి చెక్కల. గదిలో కూర్చోండి" అని నచ్చచెప్పినా వినకుండా శాయి మరింతగా రెచ్చిపోయాడు.

"అరే... రామ్మూర్తీ! లోకుల విషయం నీకెందుగ్గానీ నీ ఇంటి సంబడం నువ్వు చూసుకో! నీ మామకూతురు సుందర్ని నేను ప్రేమించానట! దాన్ని పెళ్ళిచేసుకుంటానట! పెళ్ళి చేసుకోకపోతే చస్తానట్ట! అది తోటల్లో దొడ్లల్లో తిరుగుతూ మానసిక వ్యభిచారం చేస్తోంది! సాక్ష్యం కావాలంటే పసిపిల్లలు కూడా చెప్తారు! అది వొదిలి పెట్టి మా సుబ్బారావు కూతురు రమణి..."

అనగానే సుబ్బారావు బలంగా శేషతల్పశాయిని చెక్కల గదిలోకి నెట్టి,

"అరేయ్, రామ్మూర్తీ! శాయిగారేదో మందు తాగిన తిక్కలో ఏదో వాగేడు సరే, నువ్వు మందు తాక్కుండానే వాగేవు! అందుకు నీకేం శిక్ష విధిస్తానో నువ్వే చూద్దువుగానీ ఇప్పుడు మాత్రం నువ్వు తక్షణం వెళ్ళిపో!" అని ఆగ్రహంతో కంపిస్తూ వెళ్ళి కౌంటర్లో కూర్చున్నాడు.

వస్తాదులు రామ్మూర్తిని విడిచిపెట్టేరు. "ఇక వెళ్ళు" అన్నారు బయటికి దారిచూపిస్తూ.

రామ్మూర్తి బద్ధకంగా వళ్ళువిరుచుకున్నాడు. నెమ్మదిగా కౌంటర్ దగ్గరికి వెళ్ళి "అయితే తాగినవాడు ఏమైనా మాట్లాడవచ్చు. ఏమైనా చెయ్యొచ్చు. అవును కదూ?" అని అడిగేడు అమాయకంగా.

సుబ్బారావు కళ్ళు చింతనిప్పులయ్యేయి! "ఇక్కడ్నించి వెళ్తావా? లేదా?" అన్నాడు కోపంగా.

రామ్మూర్తి కౌంటర్ని తప్పించుకుని నాలుగు అడుగులు ముందుకు వేసి కౌంటర్ వెనుక షోకేసులో ఉన్న విస్కీ సీసాల్లోంచి ఓ చిన్న బాటిల్ తీసుకున్నాడు.

సుబ్బారావు, వస్తాదులూ ఆశ్చర్యంగా చూస్తున్నారు.

రామ్మూర్తి సీసా మూత 'క్రుు'న తిప్పి, తీసి దూరంగా విసిరికొట్టి అమాంతం సీసాను పైకెత్తి ఒకే విడతగా విస్కీ అంతా తాగి, ఖాళీసీసాను కౌంటర్‌మీద పెట్టేడు.

అలాంటి కష్టమర్ను సుబ్బారావు జీవితంలో చూళ్ళేదు.

"బాటిల్ డబ్బులు... డబ్బులు" అన్నాడు సంభ్రమంనించి తేరుకుంటూ.

రామ్మూర్తి అదేం పట్టించుకోలేదు. నింపాదిగా నడుస్తూ వెళ్ళి చెక్కలగది తలుపుమీద కాల్తో బలంగా తన్నేడు.

తలుపు భళ్లున తెరుచుకుంది.

కుర్చీలో కూర్చుని మందు తాగుతోన్న శేషతల్పశాయి చివాల్న తలెత్తి రామ్మూర్తిని



చూశాడు.

రామ్మూర్తి ఒక్క మాట కూడా మాట్లాడకుండా అతని దగ్గరికి వెళ్లి అతణ్ణి అమాంతం భుజంమీదికి ఎత్తుకుని చెక్కల గదిలోంచి బయటికి తెచ్చి కౌంటర్ దగ్గరే కింద కుదేసేడు.

"చూస్తారేం? " అరిచేడు సుబ్బారావు.

వస్తాదులిద్దరూ రామ్మూర్తివేపుకు వస్తోంటే కౌంటర్‌మీదున్న ఓ ఖాళీ విస్కీ సీసాను చేత్తో తీసుకుని కౌంటర్ అంచు మీద కొట్టి కత్తిలా మారిన గాజు పెంకును చూపిస్తూ,

"అరేయ్, సుబ్బారావ్! ప్రాణాలమీద ఆశ ఉంటే వస్తాదుల్ని వినియోగించకు. అనవసరంగా వాళ్లూ చస్తారు. నిన్నూ విడిచిపెట్టను. నీ మీద నాకేం కోపంలేదింకా" అని అరిచేడు.

అక్కడ నిశ్శబ్దం ఆవరించింది.

రామ్మూర్తి గాజు పెంకును కౌంటర్‌మీద పెట్టి శాయిని మళ్లీ అమాంతం భుజం మీదికి ఎత్తుకుని నింపాదిగా షాపు మెట్లు దిగేడు. షాపుకు పదేపది అడుగుల దూరంలో ఉన్న గాంధీ విగ్రహం ముందు శాయిని కిందపడేసి కాల్తో బలంగా నాలుగుసార్లు తన్ని రెండు చేతులూ పైకెత్తి గాంధీగారికి నమస్కరిస్తూ,

"ఈ పాపిని క్షమించు!" అన్నాడు పెద్దగా.

అప్పటికే బాగా మందు ఎక్కువై నిషా తలకెక్కిందేమో శాయి అక్కడే సుఖంగా పడుకున్నాడు.

తూల్తూ ఇంటికి వెళ్లేడు రామ్మూర్తి.

అతను బాగా తాగి వచ్చినట్లు అందరికీ అర్థమయింది. భాగ్యమ్మ, సుందరి భోర్న ఏడ్చేరు.

అనంతరామయ్య మాత్రం రామ్మూర్తి భుజం చరిచి,

"బాబూ! కొంచెం మజ్జిగ తాగి ఓ గంటసేపు విశ్రాంతి తీసుకో! ఆ తర్వాత వీలుంటే భోంచేద్దువుగాని" అన్నాడు మామూలుగానే.

రామ్మూర్తెందుకో లోలోపలే మథనపడుతున్నాడు. సుందర్ని గురించి శాయి అలా అన్నందుకో లేక తను తాగినందుకో!

పది నిముషాల తర్వాత "మామయ్యా! అప్పటి మానసిక పరిస్థితిలో అందుబాట్లోనే ఉంది గనుక అమాంతం విస్కీ తాగాను. నిజానికి నాకా అలవాటులేదు. నిజం మామయ్యా... నిజం!" అన్నాడు బాధగా.

అనంతరామయ్య చిన్నగానవ్వి "భావోద్రేకంలో ఉన్నపుడు విస్కీ ఏం ఖర్మం విషం తాగి చచ్చినవాళ్లున్నారు. అది విస్కీ అయినా, విషమే అయినా అందుబాట్లో ఉన్నప్పుడేగా ఎవ్వరైనా తాగేది!" అన్నాడు విషాదంగా.

రామ్మూర్తి కళ్లవెంట కన్నీళ్లు రాల్తున్నాయి.



ఆదివారం!

రామ్మూర్తికి బాగా జ్వరం వచ్చింది. మూసిన కన్ను తెరవకుండా మంచంమీద అలాగే పడుకుని మూలుగుతున్నాడు.

అనంతరామయ్య తెలిసిన డాక్టర్ని ఇంటికి పిలిచి రామ్మూర్తిని చూపించేడు.

ఇంజక్షన్ చేసి టాబ్‌లెట్లేవో ఇచ్చి రోజుకు మూడు పూటలు మాత్రలు వెయ్యమని చెప్పి వెళ్లేడు డాక్టరు.

రామ్మూర్తి ఎప్పటికో నెమ్మదిగా కళ్లు తెరిచి చూసేడు. సుందరి అతను పడుకున్న మంచం పక్కనే కుర్చీవేసుకుని కూర్చుని ఉంది.

"సుందరీ!" అని నీరసంగా పిల్చేడు రామ్మూర్తి.

"ఊ..." అంది ముభావంగానే.

"మామయ్య ఇంట్లోలేడా? " అడిగేడు.

"లేడు"

"అమ్మేం చేస్తోంది? "

"ఒంట్లో బాగాలేక పడుకుంది"

ఆ తర్వాత మళ్లీ ఏం మాట్లాడ్లేదు రామ్మూర్తి. కళ్లు మూసుకుని అలాగే పడుకున్నాడు.

రామ్మూర్తి నిద్రపోయాడని అనుకుంది సుందరి. ఉబుసుపోక నెమ్మదిగా కూని రాగం మొదలుపెట్టింది.

"అదేమిటో.. ఆడదంటె మగవాడికి అలుసులే అనాదిగా జరుగుతున్న అన్యాయం అదిలే" అని అదే చరణాన్ని రెండుసార్లు హృదయవిదారకంగా పాడి వెక్కిళ్లు పెట్టి ఏడ్చింది సుందరి.

ఆ చప్పుడుకు రామ్మూర్తి కళ్లు తెరిచేడు. "ఎందుకు సుందరీ ఏడుస్తున్నావ్? జ్వరం దేముందిలే, అదే తగ్గుతుంది" అన్నాడు అనునయంగా.

"అందుక్కాదు! నువ్వలా ఎందుకు తాగేవ్? " అడిగింది సుందరి.

"మామయ్య నన్ను అర్థం చేసుకున్నాక్లే! ఆ విషయం ఇక మర్చిపో!"

"ఆయనా మగవాడేగా!" అంది వెటకారంగా.

"ఒక విషయం అడుగుతాను నిజం చెప్తావా సుందరీ? "

"అబద్ధాలు చెప్పటం మా ఇంటావంటా లేదు!"

"అంత పెద్ద మాటలెందుకులేకానీ ఈ విషయం ఎందుకు నిన్ను అడుగుతున్నానంటే నిజం తెలుసుకునేందుకే! తెలియక నేను నీ మార్గానికి అడ్డు తగిలినా నేనలా అడ్డు తగిలినట్టు తెలిసిన క్షణంలో నన్ను నేనే క్షమించుకోలేను"

"ఇంతకూ విషయం ఏంటి? "

"ఎందురింటి శేషతల్పశాయిని నువ్వు ప్రేమిస్తున్నావా? ఆయనే ప్రేమిస్తున్నాడా? లేక ఇద్దరి మనసులూ కలిసేయా? "

ఆ ప్రశ్నకు సుందరి నిలువెల్లా కంపించి పోయింది.

"నీకెలా తెలుసు? " అంది నిర్ఘాంతపోతూ.

"నాకే కాదు వీధిలో కూడా అందరికీ తెలిసిపోయింది. అతనే ఆ విషయం బ్రాందీ షాపు దగ్గర ప్రస్థావించి నాచేత చావుదెబ్బలు కూడా తిన్నాడు" చెప్పేడు రామ్మూర్తి.

సుందరి ఆలోచించింది.

ఆ రోజు కరణంగారి తోటలో పిల్లలతో తను ఏదో భావోద్రేకంలో చెప్పిన అబద్ధం ఇంతదూరం వస్తుందని ఆమె భావించలేదు. ఇప్పుడు జరగాల్సిందంతా జరిగిపోయింది. ఆ విషయాన్నే రామ్మూర్తి ప్రశ్నిస్తున్నాడు. ఏ కోణంలో ఆలోచించినా సమాధానం చెప్పకుండా దాటవెయ్యటం సాధ్యం కాదనిపించింది.

"బావా! అతను నన్ను ప్రేమించి ఉండొచ్చు కానీ నేనతన్ని ప్రేమించలేదు. మనసా, వాచా, కర్మణా నేను ఆరాధిస్తోంది నిన్నే. నా మీద వ్యామోహంతో అతను అబద్ధం చెప్పాడు కామోసు! అందులో నాదోషం ఎంతమాత్రంలేదు" అంది సుందరి, తను చెప్పిన అబద్ధానికి తెరలు తొలగిపోకుండా.

రామ్మూర్తి దీర్ఘమైన ఆలోచనలో కూరుకుని పోయేడు.

అనంతరామయ్య బజార్నించి తిరిగి వచ్చాడు. కాళ్లు కడుక్కుని బట్టలు మార్చుకుని తిన్నగా రామ్మూర్తి దగ్గరికి వెళ్లి నొసటిమీద చెయ్యిపెట్టి చూశాడు.



జ్వరం పూర్తిగా తగ్గినట్టుంది. ఒళ్లు చల్లగా ఉంది.

సుందరివేపు తిరిగేడు అనంతరామయ్య. "సుందరీ! వెళ్లి భోజనాలు వడ్డించు. ఈ పూటకు బావ రొట్టెతో సరిపెట్టుకుంటాడు" అన్నాడు.

సుందరి వంటగదిలోకి వెళ్లిపోయింది.

అనంతరామయ్య రామ్మూర్తి వేపు చూస్తూ "బాబూ! మన సుందరిది చాలా విచిత్రమైన మనస్తత్త్వం. ప్రతి చిన్న విషయానికీ అమితంగా చలించిపోతుంది. ఆవేదన పడుతుంది. అలా అది ఏ దశకు చేరుకుందంటే బాధ ఆమెకు అలవాటుగా మారింది. ఒకవేళ ఎలాంటి బాధామయ సంఘటనా జరక్కపోయినా అలాంటి సంఘటన ఏదో తనకు జరిగినట్టే ఊహించుకుని కుమిలిపోతుంది. కళ్లలో ఊరే కన్నీళ్లన్నీ కారిపోతేనే తప్ప అది ఊరట చెందదు.

"బాబూ! అలాంటి మనస్థత్వం కలిగి ఉండటంలో దాన్ని నిందించాల్సిన పనేం లేదు. ఆ తప్పంతా చిన్నతనం నుంచే దాని ఆకారాన్నీ అందాన్నీ అనుక్షణం గేలిచేస్తూ దాని పసి మనసు మీద న్యూనతా భావాన్ని ముద్రించిన సంఘందే కానీ దాన్దికాదు. సాధారణ విషయాలను మాత్రమే అది యధాతథంగా చెప్తుంది. పెద్ద విషయాలకు కల్పనను జోడించందే చెప్పదు. అందుచేత దాని విషయంలో ఇంకెప్పుడూ ఎక్కడా ఘర్షణ పడబోకేం? " అన్నాడు అనంతరామయ్య.

రామ్మూర్తి చివాల్న తలెత్తి చూసేడు.

మామయ్యకు జరిగిందంతా తెలిసిపోయిందని గ్రహించి "అలాగే మామయ్యా!" అన్నాడు వినయంగా.

అనంతరామయ్య గుండెనిండా గాలిపీల్చుకున్నాడు.

క్షణం తర్వాత రామ్మూర్తే నెమ్మదిగా మంచంమీంచి లేచి "మామయ్యా! జ్వరం తగ్గింది. నీరసం కూడా అంతగాలేదు. నాకు వీధిలో కొంచెం పనుంది. అలా వెళ్లొస్తాను" అని అడిగేడు.

అనంతరామయ్య పేలవంగా నవ్వేడు. "రామ్మూర్తీ! నువ్వు ఎందుకు వెళ్తానంటున్నావో అర్థమైంది. వెళ్లటం ఇక అనవసరం. సమయం మించిపోయి జరగాల్సిన అనర్థం జరిగేపోయింది" అన్నాడు విచారంగా.

"అంటే? " ఆశ్చర్యంగా అడిగేడు రామ్మూర్తి.

"రమణి నాంచారయ్యతో ఈ రోజు పొద్దున్నే దొరికినదంతా మూటగట్టి ఎక్కడికో వెళ్లిపోయింది. తనకోసం వెదకవద్దని ఉత్తరం కూడా రాసిపెట్టి వెళ్లింది"

అనంతరామయ్య చెప్పింది విన్న రామ్మూర్తి చేత్తో నొసలు రాసుకుంటూ "ఆ వెధవకు ముందే చెప్పాను జాగ్రత్త పడమని! వాడు నేను అబద్ధం చెప్పానని అపోహపడ్డాడు. అందుకే అనుభవించాడు. కన్న కూతురే వాడికి తగిన శిక్షవేసింది" అన్నాడు కసిగా.

"కన్న కూతురు వేసిన శిక్షకన్నా భయంకరంగా తనను తానే శిక్షించుకున్నాడు సుబ్బారావు"

"ఏం చేసేడు? " ఆత్రంగా అడిగేడు రామ్మూర్తి.

"అవమానం భరించలేక భార్యతో సహా ఆత్మహత్య చేసుకున్నాడు!" చెప్పేడు అనంతరామయ్య

★ ★ ★

రామ్మూర్తి, సుందరిల పెళ్లి ముహూర్తం నిర్ణయించారు.

అనారోగ్యంతో తీసుకుంటున్నా కూతురు పెళ్లి అనేసరికల్లా భాగ్యమ్మకు ఎక్కడాలేని ఓపిక వచ్చింది. అంతా తానేఅయి పెళ్లి పనులు చూస్తోంది.

రాత్రికి పెళ్లి అనగా ఆరోజు ఉదయం





రామ్మూర్తి ఏదో పనిమీద పడమటి గది లోకి వెళ్లేడు.

సుందరి ముస్తాబై ఆ గదిలో అద్దం ముందు కూర్చుని ఏదో తన్మయత్వంలో తేలిపోతూ బాహ్య ప్రపంచాన్ని మర్చేపోయి కలలు కంటోంది.

అందరూ పెళ్లి ఏర్పాట్లలో నిమగ్నమ య్యారు. సుందరి అక్కడ ఒంటరిగా ఉంది.

రామ్మూర్తి చప్పుడు చెయ్యకుండా పిల్లిలా అడుగులు వేస్తూ అద్దంలో తన ప్రతిబింబం ఆమెకు కనిపించకుండా జాగ్రత్తగా వెళ్లి రెండు చేతులతో జబ్బలమీద చరిచి భయ పెట్టేడు.

ఉలిక్కిపడి బాహ్య ప్రపంచంలో కొచ్చింది సుందరి.

బావను చూసి సిగ్గుతో తలవంచుకుని లేచి నించుంది.

"భారతీయ మహిళ భర్త ముందు లేచి నించొని తీరాలా? భర్తముందలా ఎప్పుడూ నిలబడే ఉండాలంటే కాపురాలు చెయ్యటం ఎంత కష్టం?" అన్నాడు రామ్మూర్తి నర్మగ ర్భంగా.

సుందరి చివాల్న కుర్చీలో కూర్చుంది.

ఆమెవేపు తేరిపార చూసేడు రామ్మూర్తి.

పెళ్లి కళ సంతరించుకుని సుందరి ఏదో దివ్యమైన తేజస్సుతో వెలిగిపోతోంది.

మురిపెంగా చూస్తూ, "సుందరీ! పెళ్లి పీటల మీద మాత్రం ఆరోజు నేన్నీకు గుజ రాత్‌నుంచి తెచ్చి యిచ్చిన పసుపు రంగు జరీచీరే కట్టుకోవాలి" అన్నాడు తమకంగా

"ఎందుకట?"

"అదంటే నాకు ఇష్టం కనుక!"

"నేనంటే ఇష్టంలేదా?" అని కిలకిలా నవ్వింది సుందరి.

"మరీ ఇష్టం!" అన్నాడు రామ్మూర్తి.

సుందరి ఆనందంతో పొంగిపోయింది. మాధవి, వకుళ, యింకా ఎందరో నేస్తాలు పెళ్లిళ్లు చేసుకుని కాపురాలకు వెళ్లి చాలా కాలమైంది. పిల్లల్నికూడా కన్నారు. కొంచెం ఆలస్యంగానైనా తనకు వివాహం జరుగు తోందంటే అది రామ్మూర్తి బావ ఔదార్యమే!

తన జీవితాన్ని విధి మరో మలుపు తిప్పి ఆడించి ఆనందించేందుకు రామ్మూర్తి బావను తిరిగి రప్పించకపోతే జీవితం ఎంత దురదృష్టకరంగా పరిణమించేదో!

దుఃఖంపైకి తన్నుకొచ్చింది. కెరటంలా తుళ్లి పడింది. పెద్దగా ఏడుస్తూ కుర్చీలోంచి అమాంతం పైకిలేచి రామ్మూర్తి పాదాల మీద వాలిపోయింది సుందరి.

ఆ హటాత్సంఘటనకు రామ్మూర్తి విస్తు పోయాడు.

అంతకుముందు అనంతరామయ్య చెప్పింది జ్ఞాపకం వచ్చి "సుందరీ!" అని ఆర్తిగా పిలుస్తూ ఆమెను రెండు చేతులతో పట్టుకుని పైకి లేపేడు. గుండెకు హత్తుకుని పొదివి పట్టుకున్నాడు.

ఆమె ఇంకా సన్నగా ఏడుస్తూనే ఉంది. గుండె కొలిం తిత్తిలా ఎగసిపడుతోంది.

రాత్రయింది. ముహూర్తం వేళయింది. బాజాభజంత్రీలు మోగేయి. పురోహితుల మంత్రోచ్చారణతో సుందరి మెడలో మూడు ముళ్లు వేసేడు రామ్మూర్తి.

అనంతరామయ్య, భాగ్యమ్మలకు గుండెల మీంచి ఎంతో బరువు దించినట్టుంది. సుందరి ఆనందం అంతా ఇంతాకాదు.

రోజులు దొర్లిపోతున్నాయి.

పెళ్లయిన నెల రోజుల తర్వాత అనంత రామయ్యతో అన్నాడు రామ్మూర్తి, "మామయ్యా! నేను కొంత డబ్బు తీసుకుని వెళ్లి వ్యాపారానికి కావాల్సిన సరంజామా కొంటాను. వస్త్రాల నేతను ఆధునీకరించేం దుకు కొన్ని పనిముట్లు కావాలి. పనిలో పనిగా అవసరం మేరకు నాణ్యమైన నూలు ఒకేసారి కొని తెస్తాను. అలాగే రంగులు, జరీ కావాలికదా!"

అనంతరామయ్య నవ్వేడు. "రామ్మూర్తీ!

చిన్నపిల్లాళ్లా నువ్వు చేసేదంతా నాకెందుకు చెప్పటం. నీకూ పెళ్లయింది. బాధ్యతలు నెత్తిన పడ్డాయి. ఏం చెయ్యాలో ఎలా చెయ్యాలో ఒకవిధంగా నాకన్నా నీకే బాగా తెలుసు. స్వతంత్రంగా ఆలోచించి జీవితంలో పైకిరా" అన్నాడు.

అది జరిగిన రెండు రోజులకు రామ్మూర్తి డబ్బు పట్టుకుని ప్రయాణమై వెళ్లేడు.

సాయంకాలం వేళ సుందరికి ఉబుసుపోక, ముస్తాబై అలా కరణంగారి తోటకు వెళ్లింది. జాజి పందిరికింద కూర్చుంది.

చల్లగాలి తూపులూ, పక్షుల కువకువలూ వాలిపోతోన్న పొద్దూ.. మనసుకు ఆహ్లాదంగా ఉంది.

రామ్మూర్తి గుర్తొచ్చాడు. అతను పక్కన లేకపోవటం ఎంతో వెల్తిగా తోచింది. మనసు వికలమై, ఆహ్లాదం ఎగిరిపోయింది.

క్షణం క్రితం బాగుందనిపించిన వాతావరణం అంతలోనే అయిష్టంగా మారింది.

అది మనసు చేసిన గారడి.

పేలవంగా నవ్వి, అక్కడ్నించి లేచి నెమ్మదిగా ఇంటిదారి పట్టింది.

అప్పటికే చీకట్లు ముసురుకున్నాయి.

సుందరి కరణంగారిల్లు దాటి మరికొంచెం ముందుకు వెళ్లగానే "ఏయ్ సుందరీ! ఎక్కణ్ణుంచి? " అన్న మాటలు వినిపించేయి.

హడావుడిగా నడుస్తున్నదల్లా ఆగి వెనక్కు తిరిగి చూసింది సుందరి.

ఆమె గుండె ఝల్లుమంది. ఎదురుగా శేషతల్పశాయి.

ఒక్క క్షణం ఆలోచించింది సుందరి! అతడి వాలకాన్నిబట్టి చూస్తే శాయి పూర్తిగా తాగిన మైకంలో ఉన్నాడన్న విషయం ఆమె గ్రహించింది. అలాంటి సమయంలో సమాధానం చెప్పకుండావెళ్లటమే ఉత్తమం అనుకుని చివాల్న వెనుదిరిగి ఇంటివేపుకు వెళ్లేందుకు రెండు అడుగులు వేసింది.

శాయి ఆమె వెళ్తోందని గ్రహించగానే సుడిగాల్లా కదిలి ఆమెముందుకు వచ్చిదారికి అడ్డంగా నించున్నాడు. అతడి కళ్లు ఎర్రగా జ్యోతుల్లా మండుతున్నాయి.

భయంతో సుందరి గుండె వేగంగా కొట్టుకోసాగింది. అతడ్ని తప్పించుకుని వెళ్లేందుకు మార్గం ఆలోచిస్తూ బిత్తర చూపులు చూస్తోంది.

"మీ ఆయన ఊరికి వెళ్లాట్టగా? " వెకిలిగా నవ్వుతూ అడిగేడు శాయి.

"ఆ విషయం మీకెందుకు? " అంది సుందరి ధైర్యం కూడదీసుకుంటూ.

"నాక్కాక మరెవ్వరికి? మనిద్దరం ప్రేమికులం! మీ ఆయన ఊళ్లో లేకపోతే అంతకన్నా కావాల్సిందేముంది? అందుకే అడిగేను!" అన్నాడు శాయి వ్యంగ్యంగా.

రోడ్డుమీద వెళ్తోన్న కొంతమంది వ్యక్తులు శాయి అన్న మాటలు విని, వెకిలిగా సుందర్ని చూపులతో తడిమి, నవ్వుకుంటూ వెళ్లిపోయారు.

సుందరికి ఏడుపొచ్చింది.

పూర్వపు రోజుల్లో అలా నడివీధిలో ఇలాంటి సంఘటనే జరిగితే అది మానవమాతృడెవ్వడూ తలపెట్టని దుస్సాహసంగా భావించేవాళ్లు. ఊరుఊరంతా కదిలి వచ్చి స్త్రీకి రక్షణగా నిల్చేది. దుండగుల్ని శిక్షించేది.

కానీ ఇప్పుడు ఊరి స్వరూపం మారిపోయి నాగరికత పేరిట మార్తోన్న మనుషుల విలువలు అలాంటివి!

సుందరికి గత్యంతరం తోచలేదు. జారిపోయిన ధైర్యాన్ని కూడగట్టుకుంటూ "మా రామ్మూర్తి బావ వస్తే నీ గతి ఏమౌతుందో ఒక్కక్షణం ఆలోచించుకుని ప్రవర్తించు!" అంది కోపంగా.

"నన్నేం చెయ్యగలడే వాడు! ఆ రోజంటే వళ్లుతెలియకుండా తాగున్నాను కనుక కొట్టి గాంధీ విగ్రహం దగ్గర పడేసిపోయాడు. పైగా నన్ను క్షమించమని గాంధీకి చెప్పొట్ట! కొట్టటానికి రామ్మూర్తెవడు? క్షమించటానికి




గాంధీ ఎవరు? చూస్తా! అంతు చూస్తా. ఆ రామ్మూర్తిగాడికి తగిన గుణపాఠం చెప్పక పోతే నేను దక్షిణాదివాడ్నే కాదు" అని కాల్తో బలంగా ఒకసారి నేలను తన్ని శాయి పెద్దపెద్ద అడుగులు వేస్తూ వెళ్ళిపోయాడు.

సుందరి గుండెనిండా గాలి పీల్చుకుంది. క్షణం తర్వాత అక్కణ్ణుంచి కదిలి వికల మైన మనసుతో ఇల్లు చేరుకుంది.

ఆ రాత్రి సుందరి భోజనం కూడా చెయ్య కుండా అలాగే పడుకుంది.

కూతురి వాలకం చూడగానే ఏదో జరిగి ఉంటుందని అనుకున్నాడు అనంతరా మయ్య. నెమ్మదిగా వచ్చి సుందరి పక్కనే కూర్చుని "ఏంటమ్మా! అలా ఉన్నావ్?" అడిగేడు లాలనగా.

తండ్రి అడిగిందే తడవుగా జరిగిన సంఘటనను వివరించి చెప్పింది.

అనంతరామయ్య దీర్ఘంగా నిట్టూర్చేడు.

"అమ్మా! సుందరీ! అర్ధరాత్రికూడా ఆడది నిర్భయంగా సంచరించే భారతదేశాన్ని కాంక్షించాడు గాంధీ మహాత్ముడు. యాభై ఏండ్ల స్వతంత్రంతర్వాత కూడా చీకటిపడితే ఆడవాళ్లేంటి మగవాళ్లేంటి సజ్జనులెవ్వరూ వీధుల్లో సంచరించలేని స్థితిలో ఉన్నాం. ఇకనించైనా నువ్వు అన్ని విషయాల్లోనూ కొంచెం జాగ్రత్తగా ఉండు. ఒంటరిగా ఎక్క డికీ వెళ్లకు. అయినా జీవితం ఊహకా దమ్మా సంఘర్షణ! వాస్తవం!" అన్నాడు అనంతరామయ్య నర్మగర్భంగా.

సుందరి మౌనంగా తలాడించింది.

ఆ రాత్రి సుందరే కాదు అనంతరామయ్య కూడా కలతనిద్రే పోయాడు.

తెల్లవారగానే భాగ్యమ్మ మంచం దగ్గరికి వచ్చి భర్తను తట్టిలేపి మీకోసం మునసబు గారొచ్చారు అని చెప్పింది.

అనంతరామయ్య హడావుడిగా మంచం మీంచి లేచి పంచలోకి వెళ్లేడు. కుర్చీలో కూర్చుని ఉన్న మునసబును చూసి చిర్న వ్వునవ్వుతూ ఆయన ఎదురుగా ఉన్న కుర్చీలో కూర్చున్నాడు.

మునసబు అతనివేపు తేరిపార చూసేడు. "చూడు రామయ్యా! చాలాకా లంగా నువ్వు రాజకీయాలకు దూరంగా ఎందుకుంటున్నావో నాకు తెలుసు! అయినా ఈనాటికీ మన స్నేహం చెక్కుచెదర్లేదంటే అందుకు కారణం ఏంటో ఆలోచించు! నేను రాజకీయాల్లో కూరుకునిపోయింది మాత్రం వాస్తవం. ఆ కారణంగా అసలైన భావాలకు తెరదించి ఆత్మద్రోహం చేసుకుంటూ కేవలం మనుగడకోసం గాలివాటు జీవి తాన్ని అలవాటు చేసుకున్నాను, అది ఈ వ్యవస్థలో తప్పనిసరి కనుక. అలా నన్ను సానుభూతితో అర్థం చేసుకుని ఇకనైనా మీరు నాతో కలిసి ప్రయాణం చెయ్యండని అడిగేందుకే నేను స్వయంగా వచ్చాను" అన్నాడు గాంధీ.

అనంతరామయ్య తాత్త్వికంగా నవ్వేడు. "గాంధీగారూ! మీరు గతంలో ఎప్పుడో మునసబుగా పనిచేసేరు. పదవులు మార వచ్చు స్థాయి మారవచ్చు పదవుల పేర్లు మారవచ్చు కానీ ఇంకా నేను మీలో చూస్తోంది ఆ పాతకాలపు మునసబునే! అందుకే నేను మీకు పూర్తిగా దూరం కాలే కపోయాను. అలాగని ఈ ఆధునిక కాలపు రాజకీయ కాలుష్యాన్నీ భరించలేను"

అనంతరామయ్య చెప్తోంది పూర్తి కాక ముందే అన్నాడు గాంధీ,

"కాలుష్యం అంటూ ముక్కు మూసుకుని మూలన కూర్చుంటే కాలం మనకోసం ఆగదు. నా మాట విను! ఇకనైనా నువ్వు మీ వృత్తిలో ఉన్నవాళ్ళతో సహా మా ముఠాలో చేరండి. ముఖ్యంగా మీ అల్లుడు రామ్మూర్తి లాంటివాళ్ళు మాకెంతో అవ సరం. అలాగే మా సహకారం మీకూ అవ సరమే! ఎలాగంటే రామ్మూర్తి శివయ్య బ్రాందీషాపు దగ్గర గొడవ పెట్టుకుని శాయిని కొట్టటం సామాన్యమైన పనేంకాదు!

ఆ చర్య శివయ్యకు చాలా ఆగ్రహం తెప్పించింది. పైగా శాయి ఎవరో కాదు. శివయ్య ముఠాకు పూర్తి అండదండలిస్తోన్న దక్షిణాదివాడు! అయినా వాళ్లింకా మీమీద ప్రతీకారం తీర్చుకోటానికి వెనుకాడుతున్నారంటే నీకూ నాకూ చాలా కాలంగా ఉన్న స్నేహ సంబంధాలు శివయ్యకు తెలుసు కనుకనే!"

అనంతరామయ్య చివాల్న తలెత్తి గాంధీ వేపు చూశాడు.

"క్షమించండి! ఆ రొంపిలోకి మాత్రం నేను రాలేను"

"నడివీధిలో నీ కూతురికి ఇప్పుడు చిన్న పరాభవం, ఒక బెదిరింపు మాత్రమే ఎదురైంది. నువ్విలా మొండికితేలి ఏ రాజకీయ పార్టీ అండా లేకుండా ఒంటరిగానే ఉండాలనుకుంటే ఇక నీ ఇష్టం! రేపు నీ కూతురికి పెద్ద పరాభవం జరిగినా శాయి బెదిరించినట్లు నీ అల్లుడికి ఏదైనా ప్రమాదం సంభవించినా ఆ తర్వాత నువ్వేం ఆలోచించినా ప్రయోజనం ఉండదు. అన్నీ దృష్టిలో పెట్టుకుని ఒక నిర్ణయానికి రా..." అని చెప్పి, అనంతరామయ్య దగ్గర సెలవు తీసుకుని వెళ్ళిపోయాడు గాంధీ.

భయంకరంగా తోస్తోన్న భవిష్యత్తును తలచుకుంటూ కుర్చీలో అలాగే కూర్చుండిపోయాడు అనంతరామయ్య.

★ ★ ★

గాంధీ అనంతరామయ్యతో మాట్లాడి వెళ్ళిన రెండు రోజులకు రామ్మూర్తి ఊర్నించి వచ్చాడు. వ్యాపారం ప్రారంభించేందుకు కావలసిన సరంజామా అంతా లారీలో వేసుకొచ్చాడు.

అనంతరామయ్యే మనుషుల్ని కుదిర్చి సామాన్లన్నీ లారీలోంచి దించి ఇంట్లోకి చేర్పించాడు.

భాగ్యమ్మ వంటపనిలో నిమగ్నమైంది.

రామ్మూర్తి స్నానంచేసి లుంగీ కట్టుకుని మంచంమీద వాలాడు. ప్రయాణబడలికతో అతనికి వెంటనే కునుకుపట్టింది.

రామ్మూర్తి వారంరోజులు శ్రమించి కొంతమంది పనివాళ్ళ సహాయంతో ఇంటివెనుక ఉన్న విశాలమైన ఖాళీ స్థలంలో షెడ్లు వేయించాడు. మగ్గాలు బిగించేడు. పాత సామాన్ల గదిలోంచి మగ్గాల విడిభాగాలను బయటికి తీసి బోల్టులతో బిగించి వాటిని మళ్ళీ నేతకు సిద్ధం చేశాడు.

"బాబూ... రామ్మూర్తీ! కొత్త మగ్గాలు అన్నీ బిగించి, మళ్ళీ ఈ పాత మగ్గాలను కూడా ఎందుకు సిద్ధం చేశావ్? ఇన్ని మగ్గాలమీద పనిచెయ్యాలంటే చాలామంది పనివాళ్లు కావలసివస్తుంది."

"అన్నీ ఆలోచించుకునే రంగంలోకి దిగేను మామయ్యా..." అన్నాడు నిబ్బరంగా.

అనంతరామయ్య మౌనంగా తల పంకించాడు.

రామ్మూర్తే అన్నాడు మళ్ళీ "మామయ్యా! స్థానికులైన నేతపనివాళ్ళనే మనం పనుల్లో పెట్టుకుని వాళ్ళకు జీవనాధారం కల్పిద్దాం. స్థానికులైన చేనేత కార్మికులు చాలామంది పనుల్లేక వృత్తికి ఉద్వాసన చెప్పి కాలాన్ని వృధాగా కరగదీస్తోన్నారుకదా! అలాంటి వాళ్ళకు మనం పని కల్పిద్దాం. ఆర్థిక వనరుల్ని మనం సమకూరుస్తే మానవ వనరులను వినియోగించి వాళ్ళు శ్రమించి ఉత్పత్తి సాధిస్తారు కనుక యాజమాన్యంలో వాళ్ళనూ భాగస్తులను చేద్దాం. అప్పుడు 'పరిశ్రమ నాది' అన్న భావం ప్రతి కార్మికుడికీ కలుగుతుంది. ఫలితాలు బాగుంటాయి..." అన్నాడు రామ్మూర్తి.

"బాబూ, రామ్మూర్తీ! ఒకవేళ స్థానికులు పనిలో చేరేందుకు సిద్ధపడకపోతే ఇతర ప్రాంతాలనించి చేనేత కార్మికుల్ని తెచ్చే అవకాశం ఉంటదా?"

"లేకేం ఉంది! కానీ ఆ విధానం నాకు నచ్చదు. ఎక్కడివాళ్ళో ఇక్కడికి వచ్చి వృత్తుల్లో స్థిరపడితే ఆటుపోట్లకు గురైన




ప్పుడు ఆదరణకు నోచుకుంటారేమో కానీ సుఖమయ జీవనం సాగిస్తే మాత్రం స్థాని కుల అసూయకు కారణమవుతారు. ఆ అసూయ రగిలి రగిలి క్రమంగా దావానల మవుతుంది. అలా చేతులారా మరో అగ్ని భాండాన్ని మనమెందుకు సిద్ధం చెయ్యాలి? అందుకే మనం స్థానికులకే ప్రథమ స్థానం ఇవ్వాలి. అలా కుదరని పక్షంలోనే ప్రత్యా మ్నాయ మార్గాలు ఆలోచించాలి" అన్నాడు రామ్మూర్తి.

అనంతరామయ్య తలపంకిస్తూ వెళ్ళిపో యాడు.

నాలుగురోజుల తర్వాత అనంతరా మయ్య నచ్చచెప్పటంవల్లనో, చేతి వృత్తిని విస్మరించి రాజకీయాన్ని వృత్తిగా ఎంచుకోవ టంవల్ల ప్రయోజనం శూన్యమని తెలుసుకో వటంవల్లనో, రామ్మూర్తి తన దగ్గర పని చేసే కార్మికులకు ఇస్తానన్న వేతనం, కల్పించే సదుపాయాలు ఆకర్షణీయంగా ఉన్నందువల్లనో కావాల్సినంతమంది కార్మి కులు వచ్చి రామ్మూర్తి దగ్గర పనుల్లో కుదు రుకున్నారు.

అనుకూలమైన రోజును ఎంచుకుని సుందరి మగ్గాన్ని స్వయంగా ఆడించటంతో ఉత్పత్తి మొదలైంది. రకరకాల రంగుల్ని బకెట్లలో కలిపి నూలు నానపెట్టేందుకు సిద్ధం చేశారు. అప్పటికే సిద్ధంగా ఉన్న నూలును కండెలకు ఎక్కించి మగ్గాలకు బిగించారు. అందమైన రంగులతో, మంద్రంగా సంగీతాన్ని వినిపిస్తూ వీనులకు విందుచేస్తోన్న మగ్గాల చిరుచప్పుళ్ళతో, ఎంతోకాలంగా అలాంటి వాతావరణాన్ని ఆశిస్తూ ఎదురుతెన్నులు చూస్తూన్న అనం తరామయ్య, భాగ్యమ్మల చిరునవ్వులతో అక్కడ పండుగ వాతావరణం పరుచు కుంది.

★ ★ ★

రామ్మూర్తి అంచనాలకు అనుగుణంగానే అతని వ్యాపారం జోరందుకుంది. వ్యాపారం ప్రారంభించిన కొద్దిరోజులకే ఉత్పత్తికి తగిన మార్కెట్టు సౌకర్యం కూడా సమకూరింది. ఇతర పట్టణాల్లోని హోల్ సేల్ బట్టల వ్యాపారస్తులకు సరుకు అందించటం, ఊళ్ళోనే సొంతంగా షోరూమ్ తెరిచి విద్యాధిక నిరుద్యోగులను నియ మించి భారీ ఎత్తున అమ్మకాలు జరిపిం చటం మొదలైంది.

నాగరిక సమాజం లక్షణమేంటంటే, తమకు ఏంకావాలో తెలియక అనుక్షణం నూతనత్వాన్ని కాంక్షించటమే! ఆ ఆకాంక్ష వల్ల ఎప్పుడో తెరమరుగైన చేనేత బట్టలకు మళ్ళీ కాలం వచ్చింది. అందునా రామ్మూర్తి సంస్థ చేసిన బట్టలకోసం మనుషుల్లో వెంప ర్లాట ఆరంభమైంది. అదే రామ్మూర్తికి లాభాలను సమకూరుస్తోంది.

అనంతరామయ్య, భాగ్యమ్మల ఆనందం అంతా ఇంతా కాదు. సుందరి మాత్రం అలాంటి ఆనందాలకు అతీతంగా ఇంకా తనలోతనే ఏదో క్షోభపడుతూ జరుగుతోం దంతా నిర్వికారంగా చూస్తూనే ఉంది.

రామ్మూర్తికి క్షణం కూడా తీరికలేదు. నిత్యం వ్యాపార విషయాలు, మార్కెట్టు, ఉత్పత్తి అవుతోన్న సరుకులో మరింతగా నాణ్యత తెచ్చేందుకు ఆలోచనలూ...

ఈ వ్యాపార, ఆర్థికపరమైన లావాదేవీల్లో పడి భర్త తనను వెనుకటిలాగా అక్కున చేర్చుకోవటంలేదన్న దుగ్ధ సుందరిలో మొద లైంది.

"ఇక జీవితం అంటే అనుక్షణం ధనార్జ నేనా? నాన్న 'రాజకీయమే రొంపి' అనే వాడు! కానీ నాకు అంతకన్నా ధనార్జనే పెద్ద రొంపిగా అనిపిస్తోంది. రాజకీయపు రొంపిలో నాయకుడు తనూ, తన భార్యాబి డ్డలూ సుఖంగా ఉంటూ అన్యులను బలిచే స్తారు కానీ నీలాగా కట్టుకున్న భార్యను కూడా అక్కున చేర్చుకునే తీరిక లేకపో వటం మాత్రం నువ్వెంచుకున్న రొంపిలోనే!"

అంది ఒకరోజు రాత్రి సుందరి.



రామ్మూర్తి కిసుక్కున నవ్వాడు. "సుందరీ! సంపదల్ని పోగుచేసి మూటగట్టి మూలకునెట్టి- అదే జీవితధ్యేయంగా అది సాధించానన్న తృప్తితో చనిపోయేవాళ్ళకు మాత్రమే నీ అభియోగం నప్పుతుంది. కానీ నాకు నప్పదు. నేనలా లాభాలను మాయ చేసి కార్మికులకు నష్టాలు చూపించటం లేదు. వ్యాపారపు జమ, ఖర్చులన్నీ వివరంగా వాళ్ళ ముందుంచాను. లాభాలను ఎప్పటికప్పుడు సమానంగా అందరికీ పంచి పెట్టాను. అందుకే వాళ్ళంతా ఉత్సాహంతో పనిచేస్తున్నారు" అన్నాడు రామ్మూర్తి.

"ఆ లాభనష్టాలతో నాకు ప్రమేయం లేదు. నా బాధ అదికాదు. నేను కోరేదల్లా నువ్వా వ్యాపారపు విషయాల్లో మునిగి నన్ను విస్మరిస్తావనే"

రామ్మూర్తి ఆమె మాటలకు పిన్నుగుచ్చిన బెలూన్లా చప్పబడిపోయాడు.

తాత్త్వికంగా నవ్వి, "నేనేం చేసినా అంతా నీ కోసమే సుందరీ! నువ్వు తప్ప ప్రపంచంలో నీకన్నా అత్యుత్తమంగా భావించేది నాకు మరేంలేదు. ఈ వ్యాపారం సంపాదనా నాకు వ్యాపకం మాత్రమే" అన్నాడు రామ్మూర్తి ఓదార్పుగా.

అతడ్నించి సుందరి ఆశించే ఓదార్పు అలా లభించగానే ఆమె పూర్తిగా శాంతించింది. రామ్మూర్తిని లతలా అల్లుకునిపోతూ "బావా! నన్ను అర్థం చేసుకో! సెలయేటి గులకరాయిలా నిలకడలేకుండా దొర్లుతోన్న నా జీవితానికి ఓ స్థానం కల్పించింది నువ్వు! నువ్వు నన్ను విస్మరిస్తున్నావన్న ఆలోచన నాకు కల్గినా, ఇతరులవల్ల నీకేదైనా హాని జరిగినా నేను సహించలేను. అందుకే ఈ వాదనంతా!" అంది గోముగా.

రామ్మూర్తి పెదాలు చిట్లించి సున్నితంగా నవ్వాడు.

రోజులు దొర్లిపోతోన్నాయి.

★ ★ ★

రామ్మూర్తి యాజమాన్యంలో ఉన్న చేనేత కార్మికులకు అతడు చెల్లిస్తోన్న వేతనం, కల్పించిన సౌకర్యాలూ చూసి భారతీపురంలో ఉన్న ఇతర కార్మికులు ఒకరోజు కలిసికట్టుగా వచ్చి రామ్మూర్తిని కలిశారు.

అందరూ ఆశీనులయ్యాక-

"మీరంతా ఇలా రావటం నాకు ఆనందంగా ఉంది. నా దగ్గర పనిచేస్తోన్న కార్మికులకు నేనేదో మహత్తరమైన త్యాగబుద్ధితో అధిక వేతనాలు చెల్లిస్తున్నానని ఎవ్వరూ భావించవద్దు. లాభాలమీద వాళ్లకూ హక్కు ఉంది కనుకనే వాళ్ళు న్యాయబద్ధంగా వేతనాలు పొందుతున్నారు. కార్మికవర్గం మొత్తానికీ అన్ని రంగాల్లో అలాంటి అవకాశం రావాలనీ, పెట్టుబడిదారుల ఔదార్యంగా కాక అది కార్మికుల హక్కుగా గుర్తించాలనీ నా భావన! మనదేశంలో అన్ని వనరులకన్నా మానవవనరులే కారుచవుక! అలా చవగ్గా మానవ వనరుల్ని వినియోగించి అమూల్యమైన ప్రకృతి వనరులను ధ్వంసం చేస్తూ ముందు తరాలవారికి శూన్యాన్ని మాత్రమే మిగులుస్తూ సంపదల్ని పోగుచేసుకుంటున్నారు. ఇక కార్మికవర్గానికి నాయకత్వం వహించేవారిలో చాలామంది రాజకీయ లబ్ధిదారులే! వేతన పోరాటాలకు మాత్రమే పరిమితంచేసి మిమ్మల్ని ఆకర్షిస్తున్నారు. 'దోపిడి' మూలస్వభావాన్ని మీకు చెప్పకుండా అడపా దడపా కొన్ని రూపాయల అధిక వేతనంకోసం పోరాడే ఆనవాయితీ ఉద్యమకారులుగానే మిమ్మల్ని పరిమితం చేస్తున్నారు. కార్మికవర్గం అలా పరిమితం కాకూడదు! దేశం ఎటుపోతోందో నిఘావేసి చూస్తూ, సమయం ఆసన్నం కాగానే దోపిడిదారులకు చెల్లుచీటి ఇచ్చి మహత్తర పోరాటాలక్కూడా మీరు సమాయత్తం కావాలి" అన్నాడు రామ్మూర్తి.

కార్మికులంతా ఆసక్తిగా వింటున్నారు.

వాళ్ళలో తలపండిన కార్మికుడెవరో కొంచెం ముందుకు జరిగి "రామ్మూర్తిగారూ! మీరు అన్నదాన్లో సత్యం లేకపోలేదు. నాంచారయ్య నాయకత్వాన్ని నమ్మి మేం




నట్టేట్లో మునిగేం! వాడు ఉడాయించాడు. దాంతో దిక్కుతోచని మమ్మల్ని ఒకవేపు శివయ్య, మరోవేపు గాంధీ తమ ముఠాల్లోకి లాక్కునేందుకు వలలు పన్నేరు. గత్యం తరం లేక కొంతమంది శివయ్య శిబిరం లోకి, మరికొంతమంది గాంధీ శిబిరంలోకీ వెళ్ళిపోయారు. అన్ని రంగాల్లోనూ వాళ్ళా యూనియన్లు పెట్టారు. ఒకచోట శివయ్య యూనియన్ మెజారిటీలో ఉంటే మరోచోట గాంధీ యూనియన్ మెజార్టీలో ఉంది. వారుభయులూ పార్టీల పేరిట కొట్లాడు కుంటూ కార్మికవర్గంలో చీలికలు తెచ్చి తమ తమ ఆధిక్యత కోసం కార్మికులమీద కార్మికు లనే ఉసిగొలుపుతున్నారు. అందుకే మేము ఏంచెయ్యాలో తోచక ఇలా వచ్చాం!" అన్నాడు.

"ఏం చేస్తే బాగుంటుందో మీ మనసు లకు తట్టలేదా? " వెంటనే అడిగేడు రామ్మూర్తి.

"లేదు! అలాంటి స్వయం నిర్ణాయక శక్తి మాలో ఉంటే మేము నాంచారయ్యను నమ్మేవాళ్లమే కాదు. ఆ తర్వాత శివయ్య, గాంధీ పోటీలుపడితే వాడివెంటా వీడి వెంటా పడి యూనియన్లను మార్చేవాళ్లం కాదు"

"ఇప్పుడు ఏంచెయ్యాలని మీ ఉద్దేశం? "

"మాకు నాయకత్వం మీరే వహించాలి! అది అడిగేందుకే మేం వచ్చాం"

ఆ మాటలు విని రామ్మూర్తి కిసుక్కున నవ్వేడు.

"శ్రమించేది మీరు! నిత్యం సమస్యలతో సంఘర్షించేది మీరు. మీ కష్టసుఖాలు మీకు తెలిసినంతగా ఇతరులకు తెలియవు. ఎండలో కష్టించేవాళ్ల సమస్యల్ని గదుల్లో సుఖంగా కూర్చుని చర్చించే నాయకత్వాన్ని ఆహ్వానించకండి. మీకు మీలోనే నాయ కత్వం వహించేవాళ్లను ఎంచుకోండి. ఈ రోజు నేను చేనేత పరిశ్రమ పెట్టి నా కార్మికులకు ఇతరులకన్నా అదనంగా కొంత ఉదారత్వం చూపిస్తున్నానన్న భ్రమతో మీరంతా మీ కార్మిక వర్గానికి నాయకత్వం వహించమని నన్ను కోర్తున్నారు. మీకు నాయకత్వం వహించేందుకు నేను సరైన వ్యక్తిని కాదు. నేనూ చిన్నాచితకా పెట్టుబడి దారుణ్ణే. కాకుంటే మధ్యలో నేను చూపించే దంతా ఔదార్యమే. ఉదారవాదంవల్ల మీ సమస్యలకు తాత్కాలిక ప్రయోజనం సమ కూర్తుందేమో తప్ప మీ హక్కుల సాధనను ఆ వాదం పూర్తిస్థాయిలో సమర్థించదు. దేశ వ్యాప్తంగా కార్మిక వర్గాన్ని సమీకరిం చిన చరిత్ర భారత కార్మిక వర్గానిది. ఇకనైనా గతాన్ని విస్మరించి మీలోనే నా యు కత్వాన్ని అభివృద్ధి చేసుకోండి" చెప్పేడు రామ్మూర్తి.

కార్మికులంతా ఒకళ్ల ముఖాలొకళ్లు చూసుకున్నారు.

తలపండిన ఆ కార్మికుడే మళ్లీ రామ్మూ ర్తిని అడిగేడు,

"రామ్మూర్తిగారూ! మీరు చెప్పినట్లే చేస్తాం. ఏ పరిశ్రమలో పనిచేసే కార్మికుల్లో కొందర్ని అదే పరిశ్రమకు చెందిన కార్మిక సంఘానికి నాయకులుగా ఎన్నుకుంటాం. కనీసం బయటినుంచి మీ సలహాలు, సహాయ సహకారాలు మాకు అందిస్తారా? "

"తప్పకుండా" అన్నాడు రామ్మూర్తి.

"మా కార్మికుల్లో చాలామందికి ఇళ్ల స్థలా లులేవు. పారిశ్రామిక వాడల్లో బినామీ పేర్లతో కొంతమంది స్థలాలు సంపాదించి అద్దెలకు యిస్తున్నారు. ఆ స్థలాలను న్యాయబద్ధంగా మాకు ఇప్పించే ప్రయత్నం చేస్తారా? "

"ఆ విషయం నాకూ తెలిసింది. నాంచా రయ్యే చాలా స్థలాలను అక్రమంగా అమ్మి సొమ్ము చేసుకొని వెళ్లాడు. చెరువు భూము ల్లోని కార్మిక వాడలో అలాంటి స్థలాలు చాలా ఉన్నాయి. వాటిని నాంచారయ్య ఎవ

రికి అమ్మేడో విచారించండి. వాటిపై విచారణ జరిపించి న్యాయబద్ధంగా ఆ స్థలాలను కార్మికులకు ఇవ్వాల్సిందిగా మనం అధికారులకు అర్జీ పెడదాం. పోరాటం సాగిద్దాం. స్థలాలు సాధిద్దాం!" అన్నాడు రామ్మూర్తి.

"ఆ స్థలాలన్నింటినీ నాంచారయ్య ఒక్కడికే అమ్మేడు. అవి కొన్న వ్యక్తినే ఆ పారిశ్రామిక వాడకు నాయకుడ్ని చేసేడు శివయ్య. అందువల్ల అతడినుంచి స్థలాలను తిరిగి రాబట్టటం అంత తేలిక విషయం కాదు"

"ఎవరతను? "

"గబ్బర్‌సింగ్ అంటారు అతన్ని"

రామ్మూర్తి స్మృతిపథంలో గబ్బర్‌సింగ్ లీలగా కదిలేడు. క్షుద్ర రాజకీయం చివరకు మనుగడకోసం గూండాలమీద ఆధారపడిన వైనానికి సాక్షీభూతంగా కనిపించేడు గబ్బర్‌సింగ్.

క్షణం తర్వాత "ఆ విషయాలన్నీ నేను చూసుకుంటాను. ముందుగా మీరంతా ఐక్యమై కార్మిక సంఘాల సమైక్య వేదిక ఏర్పాటు చెయ్యండి. నాయకుల్ని ఎన్నుకోండి. ఆ తర్వాత కార్యరంగంలోకి దూకుదాం" అన్నాడు రామ్మూర్తి.

అలా నిర్ణయం జరిగేక కార్మికులు రామ్మూర్తి దగ్గర సెలవు తీసుకొని వెళ్లిపోయారు.

దూరంనుంచే అంతా గమనించిన అనంతరామయ్య గుండె భయంతో వేగంగా కొట్టుకోసాగింది. సుందరి మౌనంగా చూస్తోంది.

★ ★ ★

రామ్మూర్తితో చర్చలు సాగించిన కార్మికులు ఆ రోజునుంచే కార్యరంగంలోకి దిగేరు. జట్లు జట్లుగా విడిపోయి ఊళ్లో ఉన్న అన్ని పారిశ్రామిక ప్రాంతాలకూ వెళ్లి అక్కడి కార్మికులను కలిసేరు. నాంచారయ్య చేసిన విద్రోహం, అనంతరం శివయ్య, గాంధీ వర్గాలుగా కార్మికులు విడిపోవటం, వాళ్లు సంఘవ్యతిరేక శక్తులను, గూండాలనూ కార్మికులకు నాయకులుగా నియమించటం అంతా వివరంగా చెప్పేరు. కార్మికోద్యమ స్వభావమే పూర్తిగా మారిపోయి పరోక్షంగా దోపిడీదారులకే ప్రయోజన పడుతున్న సత్యాన్ని కార్మికులు గుర్తించారు.

కార్మిక వాడల్లో సంచలనం మొదలైంది. క్వారీల్లో పనిచేసేవాళ్లు, రాళ్లుకొట్టే కూలీలు కూడా ఆ కార్మికులతో చేతులు కలిపేరు. అందరూ కలిసి ఐక్యవేదికను ఏర్పాటు చేసుకుని కార్మికోద్యమంలో కాస్తో కూస్తో అనుభవం ఉన్న కార్మికులకు నాయకత్వం అప్పగించారు. రామ్మూర్తి సలహాల మీదనే అంతా జరుగుతున్నా నాయకత్వంలో తన పేరు ఉండేందుకు రామ్మూర్తి ససేమిరా అంగీకరించలేదు.

భారతీపురంలో ఉన్న పరిశ్రమలన్నింటిలోకీ చెరువు భూముల్లో నిర్మించిన కెమికల్ ఫ్యాక్టరీ చాలా పెద్దది. వేలాదిమంది కార్మికులు షిఫ్టుల వారిగా అందులో పనిచేస్తుంటారు. పండుగ రోజుల్లో తప్ప ఆ ఫ్యాక్టరీ రేయింబవళ్లూ సందడిగా ఉంటుంది.

ఆ ఫ్యాక్టరీలో యాజమాన్యం గుర్తింపు పొందిన కార్మిక సంఘం శివయ్యది. ఆ సంఘానికి అధ్యక్షుడు శివయ్య అయితే కార్యదర్శి గబ్బర్‌సింగ్.

శివయ్య యూనియన్‌కు దీటుగా గాంధీ నాయకత్వంలో మరో యూనియన్ ఉన్నా సంఖ్యాబలంలో అతడి వర్గం కొంచెం తక్కువ కనుక గత సంవత్సరం జరిగిన యూనియన్ ఎన్నికలో శివయ్యే గెల్చాడు.

గబ్బర్‌సింగ్ తన రౌడీ అనుచరులతో గాంధీ వర్గంలో ఉన్న కార్మికులను బెదిరించటం, ఎదురు తిరిగిన వాళ్లమీద దాడులు చేసి భయభ్రాంతుల్ని చెయ్యటం నిత్యకృత్యం.

కెమికల్ ఫ్యాక్టరీ యూనియన్‌లో ప్రత్యర్థివర్గం బలం పుంజుకుంటే శివయ్య వర్గం చాలా నష్టపోవాల్సి ఉంటుంది. అందులో





అసంఖ్యాకంగా ఉన్న కార్మికులు శివయ్యకు పెద్ద అండ. సాధారణ ఎన్నికలు వచ్చినా శివయ్యా పార్టీకి వాళ్లు చందాలు వేసుకొని అధిక మొత్తంలో పార్టీ ఫండు ఇస్తుంటారు. ఎన్నికల్లో విధులకు సెలవుపెట్టి పార్టీ విజయం కోసం పనిచేస్తుంటారు. పోలింగు బూతుల్ని ఆక్రమించుకొని రిగ్గింగు చెయ్యటం, ప్రత్యర్థుల మీద బాంబులు విసరటం కూడా ఆనవాయితీగా వస్తోన్నదే.

శివయ్యా వర్గం అంత బలంగా ఉన్న కెమికల్ ఫ్యాక్టరీలో కూడా గుసగుసలు మొదలయ్యేయి. కార్మిక వర్గం క్రమంగా ఐక్యవేదిక వేపుకు మొగ్గుచూపుతున్నారు. ఆ పరిణామం మరింత పరిపక్వమై యూనియన్ చెయ్యి జారిపోతే శివయ్యకు వెన్నెముక విరిగినట్లే!

ఆ రోజు రాత్రి శివయ్య కార్మికులతో అత్యవసర సమావేశం జరిపాడు.

గబ్బర్‌సింగ్ అనుచరులతో కలిసి నాలుగు జీపుల్లో ఊరంతా తిరిగి అన్ని ఫ్యాక్టరీల్లో తమ వర్గం వాళ్లను శివయ్య ఇంటి దగ్గరికి చేరుకొమ్మని చెప్పి వచ్చాడు.

రాత్రి ఎనిమిది గంటలకు సమావేశం మొదలైంది.

వచ్చిన పరిణామాలన్నింటినీ వివరంగా తెలుసుకున్న మీదట శివయ్య గబ్బర్‌సింగ్‌తో అన్నాడు "అరే గబ్బర్! రామ్మూర్తి ఇలా రెచ్చిపోయి కార్మికుల్ని ఐక్యవేదిక క్రిందికి తెస్తే ఇక మన ఆటలు సాగవు. వాడికి నయానో భయానో నచ్చచెప్పండి. కార్మిక సంఘాల జోలికి వెళ్లకుండా బుద్ధిగా తన వ్యాపారం తను చూసుకోమని చెప్పండి"

అప్పటివరకు మౌనంగా అంతా గమనిస్తోన్న శాయి కల్పించుకున్నాడు. "శివయ్యగారూ! మంచో, చెడో మేమంతా మీతోనే ఉంటున్నాం. అలాంటి నా మీద రామ్మూర్తి 'గాడు దాడిచేసి పబ్లిగ్గా మీ బ్రాందీ షాపు దగ్గరే కొట్టినా మీరు పట్టించుకోలేదు. అది రాజకీయ ఘర్షణగా మారి గాంధీవర్గం రంగంలోకి దిగుతుందని మీరు ఆలోచించి మౌనం వహించారు. అది వాడికి అలుసైంది. ఈ రోజు మీ యూనియన్లను తానే చేజిక్కించుకొని మీమీదే యుద్ధం ప్రకటించే స్థాయికి ఎదిగాడు" అన్నాడు శాయి ఉక్రోషంగా.

"జరిగిందేదో జరిగింది. ఇక జరగాల్సింది చూడండి" అని శివయ్యా గబ్బర్‌సింగ్ వేపుకు తిరిగి "గబ్బర్! ఇంత జరిగేక రామ్మూర్తి నయాన చెప్తే వినడు. భయానే చెప్పాలి. అలా చెప్పామే అనుకో గాంధీ వైఖరి ఎలా ఉంటుందో ఆలోచించండి" అని శివయ్య అందరివేపూ తల గుండ్రంగా తిప్పి చూసేడు.

"రామ్మూర్తి వల్ల గాంధీ యూనియన్లు కూడా చీలిపోయాయి. మెజారిటీ కార్మికులు ఐక్యవేదికలోనే చేరి పోతున్నారు. ఆ ప్రమాదాన్ని గుర్తించే అనంతరామయ్యను కలిసేడు గాంధీ. వాళ్లను తన వైపుకు తిప్పుకొనేందుకు ప్రయత్నించేడు. కానీ ఆ ప్రయత్నం ఫలించలేదు. అందువల్ల గాంధీ కేవలం తన మనుగడను గురించి మాత్రమే ఆలోచిస్తాడు తప్ప రామ్మూర్తికి ఏదైనా కీడు జరిగితే పట్టించుకోడు. పైగా ఆనందిస్తాడు కూడా" అని చెప్పి శివయ్య ముఖంలో మార్తోన్న భావాలను గమనిస్తూ అతని వైపే చూస్తున్నాడు శాయి.

అతని వాదన శివయ్యకు సబబుగానే తోచింది. నిజం ఆలోచిస్తే రాజకీయాల్లో శాశ్వతమైన శత్రుత్వం కానీ మిత్రత్వం కానీ ఉండేందుకు వీలులేదు.

బాగా ఆలోచించిన మీదట శివయ్య మనసులోనే ఒక దృఢమైన నిర్ణయానికి వచ్చేడు. కెమికల్ ఫ్యాక్టరీ యూనియన్ ఎన్నికలు అతని రాజకీయ భవిష్యత్తును నిర్దేశించేంతటి కీలకమైనవి. అందువల్ల నరమేధం సాగించైనా అతను ఆ ఎన్నికల్లో

గెలిచి తీరాలి. అలా గెల్చేందుకు అవసరమైతే గాంధీతో రహస్యంగా చేతులు కలిపైనా కార్యం సాధించాలి. ఐక్యవేదికను ఓడించాలి.

శివయ్య సాలోచనగా తలపంకించేడు. కొద్దిసేపు మౌనం తర్వాత "సరే! రామ్మూర్తి విషయంలో ఏం చేసినా అంతా పకడ్బందిగా చెయ్యండి" అని అక్కడ్నించి లేచి లోపలికి వెళ్లేడు.

గబ్బర్ ఆనందం అంతా ఇంతాకాదు. రామ్మూర్తి మీద దాడికి బాస్ పచ్చజెండా చూపినందుకు సంతోషంతో పొంగిపోతూ "అరే శాయీ! రక్తం చూసి చాలా రోజులైంది" అన్నాడు బొంగురు గొంతుతో

"ఈ రాత్రికి రామ్మూర్తిని ఫినిష్ చేద్దాం" అన్నాడు శాయి.



రామ్మూర్తి హైద్రాబాద్ ప్రయాణమయ్యేడు. నగరంలోని బట్టల టోకు వ్యాపారస్తులకు తన మగ్గాలమీద నేసిన రకరకాల బట్టల శాంపిళ్లు ఇచ్చి వారితో వ్యాపారం ఖరారు చేసుకోవలసి ఉంది.

తన బట్టల వ్యాపారాన్ని నగరానికి విస్తరించే ఆలోచనలతో రామ్మూర్తి మనసంతా ఎక్కడో ఉంటే అనంతరామయ్య, సుందరి లోలోపలే సంతోషపడుతున్నారు. తన భర్త అలా వ్యాపారంలో నిర్నిరోధంగా ముందంజ వేస్తున్నాడన్నది సుందరి ఆనందానికి కారణమైతే చేనేత బట్టలకు పూర్వవైభవం వస్తోన్న సూచనలు కనిపించటం అనంతరామయ్యకు ఆనందాన్నిచ్చింది.

సమయం రాత్రి పది గంటలైంది.

"బస్టాండుదాకా తోడుగా నేనూ వస్తాను" అన్నాడు లోపల్నించి అప్పుడే అక్కడికి వచ్చిన అనంతరామయ్య.

రామ్మూర్తి వారించేడు. "ఇంత రాత్రివేళ మీరు రావటం ఎందుకూ. పైగా తిరిగివచ్చేప్పుడు ఒంటరిగా రావలసి ఉంటుందికదా!" అని తను ఒక్కడే బయలుదేరేడు రామ్మూర్తి.

వాళ్ల ఇంటికి బస్టాండు అట్టే దూరం లేదు. సూట్ కేసు పట్టుకుని తలవంచుకుని వేగంగా నడుస్తున్నాడు. కొంచెంసేపటి తర్వాత తలెత్తి దూరంగా చూసేడు. బస్టాండులోని విద్యుద్దీప కాంతులువెన్నెల్లా ఆకాశాన్ని కూడా వలయంలా కొంతమేరకు ప్రకాశింప చేస్తోన్నాయి. నడక వేగం మరి కొంచెం పెంచి ముందుకు సాగిపోతున్నాడు రామ్మూర్తి.

కొన్ని మానవాకారాలు అతడ్నే అనుసరిస్తూ వస్తోన్న విషయం అతను గమనించనేలేదు.

మరికొంతదూరం నడిచి సరిగ్గా బస్టాండుకు వెళ్లే మలుపు దగ్గరికి చేరుకోగానే ఆ ఆకారాలు అతడ్ని చుట్టుముట్టేయి. ఎవరో రామ్మూర్తి తలమీద ఇనుప కమ్మీతో బలంగా కొట్టిన దెబ్బకు అతడి కళ్లముందు మెరుపులు మెరవగా 'అమ్మా' అని ఆర్తనాదం చేస్తూ ప్రయత్నం మీద కనురెప్పల్ని విప్పార్చి చూసేడు.

అప్పటికే తను సౌరకుటుంబంలో ఇతర గ్రహాలతోపాటు గిర్రున తిరుగుతున్నట్లు, అంతా బూజర బూజరగా కనిపిస్తోంటే మంచు పరదాల వెనుకని అస్పష్ట చిత్రాల్లా కనిపించేరు గబ్బర్, శాయి, యింకా కొంత మంది ప్రత్యర్థులు.

రామ్మూర్తి చేతిలోంచి జారి సూట్ కేసు కిందపడిపోయింది. అతడ్ని నీరసం ఆవహిస్తూ మగత కమ్ముతోంటే ప్రయత్నం మీద శక్తుల్ని కూడదీసుకుంటూ గాల్లోకి ఎగిరి కత్తితో దాడికి సిద్ధమై వస్తోన్న శాయి గుండెమీద బలంగా తన్నేడు.

ఆ తాపుకు శాయి బంతిలా ఎగిరి దూరంగా పడిపోగానే గబ్బర్ తేరుకుని భుజానికి వేలాడ్తోన్న ఖాకీ సంచిలోంచి బొండాలు నరికే కత్తిని అమాంతం బైటికి




లాగి రామ్మూర్తి మీదికి దూకబోయేడు.

సరిగ్గా అప్పుడే పోలీసు పెట్రోలింగ్ వ్యాను సైరన్ మోగిస్తూ అక్కడికి వచ్చి ఆగింది. అవాంఛనీయ సంఘటన ఏదో జరిగిందని గ్రహించిన పోలీసులు వ్యాన్లోంచి బిలబిలా కిందికి దిగేరు.

గబ్బర్ బృందం పోలీసు వ్యాన్ను చూసిన మరుక్షణంలోనే అక్కడ్నించి పారిపో యారు. గాయపడి రోడ్డుమీద అచేతనంగా పడివున్న రామ్మూర్తిని పోలీసులు తమ వాహనంలో ఆస్పత్రికి తరలించేరు.

రామ్మూర్తి మీద ఎవరో దాడిచేసి గాయ పరిచారనీ, అతడ్ని ప్రభుత్వ ఆస్పత్రికి తర లించారనీ అనంతరామయ్యకు కబురు అందింది. నిర్ఘాంతపోయేడు. సుందరి శోకాలు పెట్టి ఏడుస్తోంది.

అనంతరామయ్య ముందుగా తనను తాను సంబాళించుకుని సుందరిని పొదివి పట్టుకుని సముదాయిస్తూ "ఇలా ఏడుస్తూ కూర్చుంటే ఏం ప్రయోజనం! పదమ్మా... ఆస్పత్రికి వెళ్దాం" అంటూ సుందరివీపు మీద చేత్తో తట్టేడు.

సుందరి కళ్లు తుడుచుకుంటూ లేచి నిల్చుంది. ఆస్పత్రికి వెళ్లేందుకు హడావుడిగా బైల్దేరింది.

భాగ్యమ్మ కూడా ఓపిక తెచ్చుకుని వాళ్లతో కలిసి బైల్దేరబోయింది.

"భాగ్యం! నీ ఆరోగ్యం అసలే బాగాలేదు. ఇలాంటి పరిస్థితుల్లో నువ్వు ఆస్పత్రికి రావటం, రామ్మూర్తిని చూట్టం అంత మంచి దికాదు. ఎటూ మేమిద్దరం వెళ్తున్నాం కదా! అక్కడి పరిస్థితినిబట్టి నువ్వు రేపోమాపో వద్దువుగాని" అన్నాడు భార్యతో అనంతరా మయ్య.

భాగ్యమ్మ అల్లుడి పరిస్థితి తల్చుకుని లోలోపలే కుమిలిపోతూ పైకి మాత్రం మౌనంగా కనిపించింది.

అనంతరామయ్య కూతుర్ని వెంటపెట్టు కుని ఆస్పత్రికి బైల్దేరేడు. ఇద్దరూ కలిసి నడుస్తూ అలా గుమ్మంకూడా దాటకముందే వెనుకనుంచి ఎవరో కిందపడ్డట్టు దబ్బుమని చప్పుడైంది.

ఇద్దరూ చివాల్న వెనక్కు తిరిగి చూసేరు. నేలమీద నిశ్చలంగా పడివుంది భాగ్యమ్మ.

అనంతరామయ్య రెండే రెండు అంగల్లో భార్య దగ్గరికి దూకి ఆమె చెయ్యి పట్టుకుని చూస్తూ "భాగ్యం! భాగ్యం!!" అని పిల్చేడు పెద్దగా.

భాగ్యమ్మ స్పృహలోలేదు. నాడి కూడా అందటంలేదు.

అనంతరామయ్య ముఖంలో కాంతి వాడి పోతూంటే "సుందరీ నేను వెళ్లి రిక్షా తెస్తాను. అమ్మను కూడా అర్జంటుగా మనం ఆస్పత్రికి తీసుకుని వెళ్లాలి" అని సుందరి సమాధానం కోసం ఎదురు చూడ కుండా హడావుడిగా బైటికి వెళ్లిపోయేడు.

సుందరి ధారాపాతంగా కన్నీళ్లు కారుస్తూ తల్లి దగ్గరే కూర్చుంది.

ఐదు నిముషాల్లోనే వచ్చేడు అనంతరా మయ్య. భాగ్యమ్మను ఎత్తి అమాంతం భుజంమీద వేసుకొని బరువుగా అడుగులు వేస్తూ ఇంట్లోంచి బైటికి తెచ్చి రిక్షాలోకి చేర్చేడు.

"సుందరీ! నువ్వు రిక్షా ఎక్కి అమ్మను పట్టుకొని కూర్చోమ్మా. మన ముగ్గరికీ రిక్షాలో చోటుచాలదు. నేను రిక్షా వెనుకనే వస్తాను" అని "బాబూ! రిక్షా కొంచెం త్వరగా పోనివ్వు" అని రిక్షావాలా వేపుకు అభ్యర్థనగా చూసేడు అనంతరామయ్య.

సుందరి రిక్షా ఎక్కి తల్లి పక్కన కూర్చుని ఆమెను పొదివి పట్టుకుంది.

రిక్షా కదిలి వేగంగా ముందుకు సాగిపో తోంటే రిక్షా వేగాన్ని అందుకుందుకు సర్వశ క్తులూ కూడగట్టుకొని రిక్షా వెనుకనే పరు గులు తీస్తోన్నాడు అనంతరామయ్య ఆయా

సంతో రొప్పుతూ.

కొంచెంసేపటికి రిక్షా ఆస్పత్రి ముందు ఆగింది.

ఆస్పత్రి సిబ్బంది భాగ్యమ్మను ఎమర్జన్సీ విభాగంలోకి తీసుకొని వెళ్లి బల్లమీద పడుకోపెట్టేరు. డ్యూటీ డాక్టరు వచ్చి ఆమెను పరీక్షచేసి "సారీ... షియీజ్ డెడ్!" అన్నాడు పెదవి విరుస్తూ.

అనంతరామయ్య ముఖానికి తువ్వాలు అడ్డం పెట్టుకుని వెక్కివెక్కి ఏడుస్తోంటే సుందరి శోకాలకు ఆస్పత్రి పునాదులే కదిలిపోతోన్నట్టుంది.

ఎవరో తన పక్కకు వచ్చి నిలబడి అనునయంగా వీపుమీద చేత్తో తడుతూంటే ముఖంమీంచి కండువా తొలగించి చూసేడు అనంతరామయ్య.

అతను గాంధీ!

ఎదురుగా వచ్చి నిల్చుని "అనంతరామయ్యా! గుండె నిబ్బరం చేసుకోవటం మినహా చెయ్యగల్గింది ఏదీలేదు. పుట్టిన ప్రతి ప్రాణీ గిట్టక మానదన్న సత్యాన్ని మననం చేసుకుంటూ మనసును రాయిగా మార్చుకోవటం మినహా ఇలాంటి సందర్భాల్లో ఊరట పడేందుకు మరో మార్గం ఏముంది గనుక! జరిగిందేదో జరిగిపోయింది. భవబంధాలను తెంచుకొని వెళ్లిపోయిన భాగ్యమ్మను గురించి అదే పనిగా ఏడుస్తూ కూర్చోక వెళ్లి అల్లుడి విషయం చూడు. చనిపోయిన వాళ్లని మనమేం బతికించలేం కదా" అన్నాడు గాంధీ.

అనంతరామయ్య, సుందరి నెమ్మదిగా దుఃఖంనుంచి కాస్తంత ఊరట పడుతూ ఆ బాధను గుప్తంగా గుండెల్లోనే దాచుకుని అక్కడ్నించి కదిలి రామ్మూర్తి ఉన్న వార్డుకు వెళ్లేరు.

మంచంమీద నిశ్చలంగా పడుకుని ఉన్నాడు రామ్మూర్తి. అతని మంచంపక్కనే ఉన్న స్టాండుకు సెలైన్ సీసా, మరో సీసా లోంచి రక్తం సన్నటి ట్యూబుల గుండా బొట్టుబొట్లుగా ప్రవహిస్తూ రామ్మూర్తి శరీరంలోకి యింకుతోంది. తలకు కట్టిన తెల్లటి బ్యాండేజి క్లాత్‌మీద ఎర్రగా రక్తపు మరకలు కనిపిస్తున్నాయి.

సెలైన్ స్టాండు పక్కనే నిలబడి అల్లుడి వేపు దీనంగా చూస్తున్నాడు అనంతరామయ్య. సుందరి భర్త పక్కనే మంచంమీద కూర్చుని నిశ్శబ్దంగా ఏడుస్తోంది.

"ఎంత దారుణం?" అన్నాడు ఎవరినీ ఉద్దేశించకనేఅనంతరామయ్య.

గాంధీ కల్పించుకుని అన్నాడు, "నిజంగా జరిగింది దారుణమే! తోడులేని ఆడది వాడ కల్లా మరదలట! అలాంటప్పుడు ఇలాంటివి సహజమే"

"అంటే?" అనంతరామయ్య చివాల్న తల తిప్పి గాంధీవేపు చూసేడు.

"అంటే ఏముంది అనంతరామయ్యా... మీరంతా నావర్గం వాళ్లనీ, మీకు ఏదైనా అపకారం తలపెడితే నేను మీ తరపున రంగంలోకి దిగుతాననీ భయపడి ఇంత కాలం శివయ్య మిమ్మల్ని ఉపేక్షించాడు. మీ అల్లుడు రామ్మూర్తి బ్రాందీషాపు దగ్గర సుబ్బారావును బెదిరించినా గాంధీ విగ్రహం దగ్గర శాయిని చావగొట్టినా శివయ్య మౌనంగా చేతులు కట్టుకొని కూర్చున్నాడంటే కారణం అదే! కానీ మీరు మాత్రం అది మీ ప్రతిభ అనుకొని పొరపాటు పడ్డారు. అందుకే స్వయంగా నేను మీ ఇంటికి వచ్చి రాజకీయంగా నాతో కలిసి ప్రయాణం చెయ్యమని అడిగినా పెడచెవిన పెట్టారు. ఆ విషయం బైటికి పొక్కకుండా ఎలా ఉంటుంది. మీకూ, నాకూ మధ్య అవగాహన లేదన్న విషయం గ్రహించే మీ శత్రువులు మీమీద దాడికి సాహసించి ఉంటారు. ఇది మీ స్వయంకృతమే!" అన్నాడు గాంధీ ఎకసెక్కెంగా.

అనంతరామయ్య నొసలు ముడిపడ్డాయి. "ఇందులో స్వయంకృతం ఏముందంటారు?




మీ రాజకీయాలకు దూరంగా ఉండటం మా అభిమతం! అందుకే ఆ విషయాన్ని దాపరికం లేకుండా విడమర్చి చెప్పాం! మీ రాజకీయ కాలుష్యానికి దూరంగా మనుగడ సాగించే స్వేచ్ఛ ఎవ్వరికీ లేదంటారా? " అడిగేడు సూటిగా.

అంతవరకూ శాంతంగా కనిపించిన గాంధీ అనంతరామయ్య అలా అనగానే ఆగ్రహంగా చూసేడు.

"అనంతరామయ్యా! ఇంతకూ నేను చెప్పాలనుకునే అసలు విషయం ఏమిటంటే ఇకనుంచైనా మీ అల్లుడు కార్మికుల వ్యవహారాల్లో, యూనియన్ల ఎన్నికల్లో జోక్యం చేసుకోకుండా తన దారిన తాను వ్యాపారం చేసుకుంటే మంచిది. అయినా మీ రామ్మూర్తి ఇలా కార్మిక సంఘాలను నిర్మించి నాయకుడై ఎలక్షన్లలో నిలబడి ఎంఎల్లే కావాలా, ఎంపీ కావాలా? అలాంటి వాటికి మాలాంటి వాళ్లం ఉన్నాంకానీ రామ్మూర్తిని అనవసరంగా శ్రమపడవద్దని చెప్పు. జరిగిందేదో జరిగిపోయింది. కేసుల దాకా వెళ్లి ఇంకా కష్టాలు కొని తెచ్చుకోకుండా జరిగిందంతా మర్చేపోండి. అంతా మీ హితం కోరి మాత్రమే చెప్తున్నాను" అని తల ఎగురవేసేడు గాంధీ.

"అయితే రామ్మూర్తి మీద దాడిచేసిన వాళ్లు ఎవరో మీకు తెలుసనుకుంటాను. వాళ్లు బలవంతులూ, ధనవంతులూ అయి ఉంటారు. అలాంటివాళ్లను ఢీకొనటం ప్రమాదకరం అన్న ఉద్దేశంతోనే మీరు మా శ్రేయోభిలాషులుగా అలాంటి సలహా ఇస్తున్నారనుకుంటాను" అని అనంతరామయ్య పరీక్షగా గాంధీ ముఖంలోకి చూసేడు.

అతని మాటల్లో ధ్వనించిన వెటకారాన్ని గాంధీ గ్రహించలేదు. పైగా అదోలా నవ్వి "ఏది ఏమైతేనేం గానీ కేసులూ, కోర్టులూ, పోలీసులూ.. అంతా దండగమారి వ్యవహారం! వాటిద్వారా సామాన్యులు సాధించగల్గేది శూన్యమే! అందుకనే అలాంటి మార్గంలో వెళ్లి డబ్బు, కాలం వృధా చేసుకోకండి" అన్నాడు.

అనంతరామయ్యకు ఓర్పు నశించింది. "గాంధీగారూ! మా కుటుంబం సర్వనాశనమైపోయింది. భాగ్యమ్మ చనిపోయింది. అల్లుడు తల పగిలి ఆస్పత్రిపాలయ్యాడు. జరగకూడని అనర్థాలన్నీ జరిగేక ఇక మేము అదనంగా ఏమి జరుగుతుందని భయపడాలి? " అని అడిగేడు.

"భయపట్టం, భయపడకపోవటం అన్నది మీ ఇష్టం. నాకు మాత్రం మీమీద అసంతృప్తే తప్ప ఆగ్రహంలేదు. కనుకనే చెప్తున్నాను. ఇంకా మీ కుటుంబానికి ఎలాంటి అనర్థాలు తెచ్చిపెట్టాలో నిర్ణయించేది మీరుకాదు. మీ ప్రత్యర్థులు. వాళ్ల నిర్ణయంలోని కాఠిన్యం కూడా మీ ప్రవర్తన మీదే ఆధారపడి ఉంటుంది"

"అంటే? "

"కెమికల్ ఫ్యాక్టరీ యూనియన్ ఎన్నికల్లో ఐక్యవేదిక తరపున ఎవ్వరూ పోటీ చెయ్యకూడదు. రామ్మూర్తి ఆ ఎన్నికలకు దూరంగా ఉండాలి"

"అలా జరిగితే గెల్చేది శివయ్య! శివయ్యకూ, మీకూ మధ్య రాజకీయ వైరుధ్యాలు ఉన్నాయి కనుక శివయ్య ఓటమి మీకే మంచిదికదా? " అని అడిగేడు అనంతరామయ్య.

గాంధీ పెదాలమధ్య అదోరకం నవ్వు విచ్చుకుని క్షణంలో అంతర్థానమైంది. "అనంతరామయ్యా! కెమికల్ ఫ్యాక్టరీ యూనియన్ ఎన్నికల్లో శివయ్య ఓడిపోకూడదు. అది నా నిర్ణయం. అతనికీ, నాకూ మధ్య వైరుధ్యాలు ఉన్నది నిజమేకానీ రాజకీయం అన్న తర్వాత కొన్ని పట్టువిడుపులుండాలి. అంతటి శివయ్యే ఎన్నో మెట్లు కిందికి దిగి వచ్చి కెమికల్ ఫ్యాక్టరీ యూనియన్ ఎన్నికల్లో తనను గెలిపించమని ప్రాధేయపడ్డాడు. అందుకు బదులుగా చిన్న

చిన్న యూనియన్లన్నింటికీ నన్ను అధ్యక్షుడ్ని చేస్తాననీ, ఇంకా అనేకమైన రూపాల్లో నాకు సహకరిస్తాననీ వాగ్దానం చేసేడు. అలా మా ఇద్దరి మధ్య ఒక శాశ్వతమైన అంగీకారం కుదిరింది కనుకనే నేను శివయ్య విజయం కోసం కృషి చెయ్యక తప్పదు" అని గాంధీ అంటుండగానే "అమ్మా" అన్న రామ్మూర్తి మూలుగు వినిపించింది.

గాంధీ మాట్లాట్టం ఆపేడు.

రామ్మూర్తి నెమ్మదిగా కళ్లు తెరిచేడు.

అతని కళ్లలో నీళ్లు ఉబుకుతోన్నాయి.

డ్యూటీలో వున్న నర్సు రామ్మూర్తి స్పృహలోకి రాగానే ఆ విషయాన్ని డాక్టరుకు చేరవేసింది. ఎవరో పోలీసు ఉద్యోగినీ, మరి కొంతమందిని వెంటపెట్టుకుని రామ్మూర్తి బెడ్ దగ్గరికి వచ్చి పలుకరించేడు డాక్టరు "ఎలా ఉన్నావ్? " అని.

రామ్మూర్తి రహస్యంగా కళ్లు తుడుచుకుని ముఖంలో నవ్వులు పులుంకుంటూ "బాగానే ఉన్నాను" అన్నాడు లేచి కూర్చుందుకు ప్రయత్నిస్తూ.

"లేవకండి" అని రామ్మూర్తిని వారించేడు డాక్టరు. అతని నాడి పరీక్షచేసి పోలీసు ఉద్యోగివేపుకు తిరిగి "ఇక మీ పని మీరుకానివ్వండి" అన్నాడు.

"రామ్మూర్తిగారూ! మీమీద దాడిచేసి గాయపరిచిన వాళ్లను మీరు గుర్తించారా? అయితే ఎవరు వాళ్లు? " అని రామ్మూర్తి వేపు సూది కళ్లతో చూస్తూ అడిగేడు పోలీసు ఉద్యోగి.

రామ్మూర్తి మౌనంగా శూన్యంలోకి చూస్తూ ఏదో ఆలోచనలో కూరుకుని పోయేడు. సుందరి, అనంతరామయ్య, గాంధీ తాము శ్వాసపీలుస్తోన్న విషయమే మర్చేపోయి రామ్మూర్తి చెప్పే సమాధానం కోసం ఆసక్తిగా చూస్తున్నారు.

రామ్మూర్తి చెప్పే విషయాన్ని నోట్ బుక్‌లో రాసుకుందుకు కలాన్ని కాయితంమీద ఆన్చిపెట్టి పోలీసు ఉద్యోగి సిద్ధంగా కూర్చున్నాడు.

రామ్మూర్తి పెదాలు సన్నగా కంపించసాగేయి. "నామీద... నామీద దాడిచేసింది ఎవరో నేను గుర్తుపట్టలేదు" అన్నాడు ఒక్కో అక్షరాన్నే ఒత్తి పలుకుతూ.

అనంతరామయ్య, సుందరి రామ్మూర్తి చెప్పిన సమాధానానికి ఆశ్చర్యపోతూ బేల కళ్లతో చూస్తుండిపోయేరు. పోలీసు ఉద్యోగి తన పని ముగించుకుని వెళ్లిపోగానే గాంధీ తృప్తిగా నిట్టూర్చి,

"అనంతరామయ్యా! మరేమో అనుకున్నాను కానీ మీ అల్లుడు నేను అనుకున్నట్లు మూర్ఖుడేం కాదు! స్థాయిని మించిన సాహసం చెయ్యకుండా లౌక్యంగానే వ్యవహరించేడు. ఏం చేస్తాం, సమాజం అలా ఉంది కనుక మనమే అన్నింటికీ తల వంచి సర్దుకుని పోవాలి!" అని, అక్కడ్నించి బైటికి వెళ్లేందుకు రెండు అడుగులు వేసి ఆగి,

"చెప్పటం మర్చేపోయాను! భాగ్యమ్మ శవదహనానికి ప్రొద్దున్నే నేను ఏర్పాట్లు చేస్తాను. ఆస్పత్రిలో రామ్మూర్తికి అయ్యే ఖర్చు కూడా నేనే భరిస్తాను. రామ్మూర్తి మాత్రం కెమికల్ ఫ్యాక్టరీ ఎన్నికలు అయ్యేంతవరకూ డిశ్చార్జి కాకుండా ఆస్పత్రిలోనే ఉండాలి. యూనియన్ ఎలక్షన్లను గురించి మర్చేపోవాలి. ఆ విషయాన్ని మీ అల్లుడికి అర్థమయ్యేలా వివరంగా చెప్పు అనంతరామయ్యా... ఇక నేను వెళ్లొస్తాను" అని గంభీరంగా నడుస్తూ వెళ్లిపోయేడు గాంధీ.

"అత్తయ్య చనిపోయిందా? " అని అడుగుతూనే, పొంగుతోన్న దుఃఖాన్ని బలవంతంగా నిగ్రహించుకుంటూ సుందరి చెయ్యి పట్టుకుని విసురుగా తన దగ్గరికి లాక్కున్నాడు రామ్మూర్తి. "నిజంగా అత్తయ్య చనిపోయిందా? " అని సూటిగా ఆమె కళ్లలోకి చూస్తూ అడిగేడు.

సుందరి 'అవును' అన్నట్లు తల ఊపి.





పైటకొంగును నోటికి అడ్డం పెట్టుకుంటూ దూరంగా వెళ్ళిపోయింది.

"బాస్టర్డ్స్!" అని పెద్దగా అరిచేడు రామ్మూర్తి ఆవేశంగా.

సింహగర్జనలా మార్మోగిన అతని కంఠ ధ్వని రాబోయే భీకర సమరానికి సంకేతంలా వినిపించి, అనంతరామయ్య, సుందరి చేష్టలుడిగి నిల్చుండిపోయేరు.

★ ★ ★

తెల్లవారుజామున శివయ్య ఇంట్లో ఫోను అదేపనిగా మోగుతోంటే ఆ శబ్దానికి విసుక్కుంటూ నిద్రలేచేడు శివయ్య. వెళ్ళి రిసీవరు ఎత్తి "ఎవరూ?" అని అడిగేడు ఆవులిస్తూ.

"గాంధీని!"

"ఓహ్... మీరా! మీ ఫోను కోసమే ఎదురుచూస్తూ రాత్రి చాలా పొద్దుపోయేదాకా మెలకువతోనే ఉన్నాను. ఇప్పుడే అలా కునుకు పట్టింది. ఆ... ఇంతకూ ఆస్పత్రికి వెళ్ళారు కదా, ఏమైంది?" అడిగేడు శివయ్య.

"నేను చెప్పాల్సిందంతా నిర్మొహమాటంగానే చెప్పాను. రామ్మూర్తి తన వాఙ్మూలంలో తనమీద దాడిచేసిన వాళ్ళను గుర్తించలేదని చెప్పాడు. ఇక ఆ విషయంలో మనకు ఆందోళన అనవసరం..."

"అయితే రహస్య స్థావరంలో ఉన్న మన గబ్బర్ బృందాన్ని వెంటనే బైటికి రప్పిస్తాను. పోలీసుల హడావుడి మనకేమీ లేనట్టేకదా! కెమికల్ ఫ్యాక్టరీ ఎలక్షను దగ్గర పడుతోంది. ఈ సమయంలో మనకు ఎన్నికల్లో గెలవాలంటే ఓటర్లకన్నా గూండాలే అవసరం!" అన్నాడు శివయ్య.

"అలాగే కానివ్వండి! నా ఉద్దేశం ప్రకారం ఇక రామ్మూర్తి యూనియన్ విషయాల్లో తలదూర్చడు. అనంతరామయ్య అల్లర్లను ఆశించే మనిషికాడు కనుక అతనూ ఈ విషయాలకు దూరంగానే ఉంటాడు"

"అని ఎంతవరకు నమ్మకం! మన జాగ్రత్తలో మనం ఉండాలి. ఆ ఐక్యవేదిక కదలికలను అనుక్షణం కనిపెడుతుండాలి. ఎన్నికలు పూర్తయ్యేదాకా రామ్మూర్తి ఆస్పత్రి నించి డిశ్చార్జి కాకుండా చూడాలి. ఇతర ప్రాంతాలనించి కూడా గూండాలను రప్పిస్తున్నాం కనుక మన అంచనాలు తారుమారై రామ్మూర్తి ఎలాగోలా ఆస్పత్రి నించి బైటపడే ప్రయత్నం చేస్తే వాడికి ఈసారి ఖచ్చితంగా నూకలు చెల్లినట్టే!"

"సరేనండీ శివయ్యగారూ... మీరు కోరిందే తడవుగా ఇన్నినాళ్ళ మన విబేధాలను కూడా మర్చిపోయి మీతో చేతులు కలిపేను. నావల్ల మీకూ మీవల్ల నాకూ ప్రయోజనం ఉంటేనేకదా మన రాజకీయ మిత్రత్వం కలకాలం కొనసాగేది!"

"మీకు ముందే చెప్పాను కదా గాంధీగారూ... మీ వ్యాపారాలు మీరిక నిర్భయంగా సాగించండి. మరో నూరు బట్టీలు పెట్టి నాటు సారా కాచి యితర ప్రాంతాలక్కూడా సరఫరా చెయ్యండి. ఎవ్వరూ మీ జోలికి రారు. మనిద్దరం మిత్రపక్షాలుగా మారేక ఇక మన వ్యాపారాల్లో జోక్యం కల్పించుకునే ధైర్యం ఎవరికి ఉంటుంది? ఇంతకాలం మీమీద నేనూ నామీద మీరూ ధ్వజమెత్తి ఇద్దరం ఆర్థికంగా నష్టపోయాం. సరే! కాలం కలిసివచ్చి మనం ఒకటయ్యాం! మన అనుబంధం శాశ్వతమైతేనే కదా మనం బలపడేది! ఏది ఏమైనాగానీ మన అధికారం శాశ్వతం కావాలన్నదే నా ఆకాంక్ష" అన్నాడు శివయ్య.

"తప్పకుండా మీ అభిమతం నెరవేర్తుంది. మీరు యూనియన్ ఎన్నికల్లో గెలిచి తీర్తారు. కానీ, అందుకు సహకరించే నాకు మీనుండి నిర్దిష్టంగా కొన్ని హామీలు కావాలి!"

"ఏమిటో అడగండి!"

"అక్రమ సారా వ్యాపారంలో కూడా ఆశించినంతగా లాభంలేదు!"

"అయితే నా బ్రాందీ షాపులు కూడా

మీరే తీసుకోండి"

"ఏం ప్రయోజనం! ఇలాంటివన్నీ అరకొర వ్యవహారాలే!"

"ఏం కావాలంటారు? "

"పదవి! వచ్చే అసెంబ్లీ ఎన్నికల్లో కూడా మా పార్టీ గెల్చేట్టు లేదు! ఇంకా దాన్నే పట్టుకొని వేలాట్టం వివేకంగాలేదు. అందుకే నేను మా పార్టీకి రాజీనామా చేసి మీ పార్టీలో చేర్తాను. ఎలాగైనా ఈసారి ఎంఎల్లే టిక్కెట్టు నాకు కావాలి. ఆ విష యంలో మీ సహకారం కావాలి!" అన్నాడు గాంధీ.

గాంధీ అడిగిందానికి వెంటనే సమా ధానం చెప్పలేదు శివయ్య. కొంచెంసేపు మౌనంగా ఆలోచించేడు! ప్రస్తుతానికి ఆ విషయాన్ని పక్కన పెట్టి గాంధీని నొప్పిం చకుండానే అంతా సజావుగా సాగిపోవాలని భావించి "గాంధీగారూ! మీరు మా పార్టీ లోకి వస్తామంటే అంతకన్నా మాకు ఆనందం ఏముంటుంది? అయినా అలాంటి పెద్ద విషయాలను మనం ఫోన్లో కాకుండా స్వయంగా ఎదురుబొదురు కూర్చుని మాట్లాట్టం మంచిది. మనం ఎప్పుడు కలుద్దాం? " అని అడిగేడు శివయ్య.

గాంధీకి భాగ్యమ్మ చనిపోయిన విషయం అప్పుడు గుర్తొచ్చింది! "శివయ్యగారూ! చెప్పటం మర్చేపోయాను. అనంతరామయ్య భార్య భాగ్యమ్మ చనిపోయింది తెలుసా? " అడిగేడు.

"నిజమా? " అన్నాడు శివయ్య ఆశ్చ ర్యంగా.

"ఆమె చావుకు అంతగా ప్రాముఖ్యతేం లేదు లెండి! అసలే అనారోగ్యం మనిషి! అల్లుడి మీద దాడిజరిగి ఆస్పత్రిపాలయ్యా డన్న వార్త వినగానే గుండె ఆగి చనిపో యిందంతే! రేపు ఉదయమే దహనక్రి యలు! ఆ కార్యక్రమాన్ని మనమే చొరవతీ సుకుని జరిపించామంటే ప్రజలకు మన మీద గౌరవం పెరుగుతుంది. పైగా రామ్మూర్తిమీద దాడిచేయించింది మీరే అని రేపు ప్రచారంలోకి వచ్చినా దాన్ని జనం నమ్మరు"

"మీ ఆలోచన బాగుంది! రేపు ఉదయం నేను కూడా ఆ కార్యక్రమంలో పాల్గొం టాను. ఆ తర్వాత మనం కలిసి మాట్లాడు కుందాం! ఉంటాను మరి" అని ఫోను పెట్టే సేడు శివయ్య.

తెల్లవారింది!

రామ్మూర్తిమీద దాడి జరిగిందనీ, భాగ్యమ్మ అది విని గుండెపోటుతో మర ణించిందనీ తెలిసి మారుమూల ప్రాంతాల నించి కూడా కార్మికులు గుంపులు గుంపు లుగా ఆస్పత్రికి తరలి వస్తున్నారు. పోటె త్తిన సముద్రపు అలలకుమల్లే కదిలివస్తోన్న జనాన్ని చూసి ముందుజాగ్రత్త చర్యగా అద నపు పోలీసు బలగాలను మోహరించి, అన్ని పోలీసు స్టేషన్లనూ అప్రమత్తం చేసేరు.

పట్టణంలో నిషేధాజ్ఞలు విధించినట్టూ, అనుమతి లేకుండా ఎవ్వరూ ఊరేగింపులూ, సభలూ నిర్వహించకూడదనీ చెప్తూ పోలీసు జీపులు మైకులతో వీధుల్లో తిరుగుతు న్నాయి. అన్ని కూడలి ప్రాంతాల్లోనూ, ఆస్పత్రి దగ్గర తుపాకులతో పోలీసులు పహరా కాస్తోన్నారు.

పది గంటలకల్లా భాగ్యమ్మ భౌతికకా యాన్ని ఆస్పత్రినించి బైటికి తెచ్చి ఐక్యవేదిక తరపున శవాన్ని శ్మశానందాకా ఊరేగిం పుగా తీసుకుని వెళ్లేందుకు ఏర్పాట్లు జరి గాయి. ఒక ట్రాక్టరు మధ్యలో ఎత్తైన బల్లను పెట్టి శవాన్ని అందరికీ కనిపించే విధంగా బల్లమీద పడుకోపెట్టి ఊరేగింపుకు సమాయత్తమయ్యేరు.

కెమికల్ ఫ్యాక్టరీ యూనియన్ అధ్యక్ష పదవికి శివయ్యతో పోటీపడుతోన్న కార్మి కుల ఐక్యవేదిక కన్వీనరు చైతన్య ట్రాక్టరు




మీదికి ఎక్కి భాగ్యమ్మ శవం పక్కనే నిల బడి మైకులో మాట్లాట్టం మొదలుపెట్టేడు.

"కార్మిక సోదరులారా! కార్మిక నాయకుడిగా నటించి నాంచారయ్య కార్మికోద్యమాన్ని దోపిడి వర్గాలకు తాకట్టుపెట్టి కార్మికులను వంచించిన దశలో దిక్కుతోచని మనకు లభించిన ఆధారం రామ్మూర్తిగారి పరిచయం! కార్మిక నాయకులు కార్మిక వర్గంలోనించే అభివృద్ధి చెందాలంటూ ఐక్య వేదికను ఏర్పాటుచేసి మనకు, దోపిడి వర్గాలకు వ్యతిరేకంగా సక్రమమైన పంథాలో పోరాడే మార్గం చూపించింది రామ్మూర్తి గారే! త్వరలో అత్యంత కీలకమైన కెమికల్ ఫ్యాక్టరీ యూనియన్ ఎన్నికలు జరుగబోతున్నాయి. ఇలాంటి సమయంలో రామ్మూర్తి గారిమీద దాడి జరిగిందంటే దాడికి కారణం ఎవరో మనం తేలికగానే ఊహించవచ్చు. కానీ రామ్మూర్తిగారు తనమీద దాడిచేసిన వాళ్ళను గుర్తించలేదని అన్నారు. కనుకనే మనం నిస్సహాయంగా ఉన్నాం కానీ వారిలో ఏ ఒక్కరిని ఆయన గుర్తించగల్గినా నేరస్తులకు తగిన శిక్ష కార్మికవర్గమే విధించేది! నేరస్తులెవరో విచారణలో తేలేందుకు కొంతకాలం పడుతుంది కనుక ప్రస్తుతం మనం చెయ్యగల్గింది ఏదీలేదు, నిరసన ప్రకటించటం తప్ప! ఇకపోతే అల్లుడు రామ్మూర్తిమీద దాడి జరిగిందన్న దుర్వార్త విని గుండెపోటుతో మరణించారు భాగ్యమ్మగారు. రామ్మూర్తిగారిమీద జరిగిన దాడికీ, ఒక మనిషి గుండె ఆగి మృతిచెందిన దానికీ ప్రతీకారం తీర్చుకుంటామని మనం శపథం చేస్తూ భాగ్యమ్మగారి శవాన్ని ఊరేగింపుగా శ్మశానానికి తీసుకుని వెళ్దాం. కార్మికులెవ్వరూ రెచ్చిపోకుండా సంయమనం పాటించాలని, శాంతి భద్రతలకు అంతరాయం కల్గించవద్దనీ ప్రార్థిస్తున్నాను"

సరిగ్గా అప్పుడే శివయ్య, గాంధీ అక్కడికి చేరుకున్నారు. వెంట తెచ్చిన పూల దండలను భాగ్యమ్మ భౌతిక కాయంమీద ఉంచి రెండు నిముషాలు మౌనం పాటించారు.

హఠాత్తుగా వాళ్ళిద్దరూ అక్కడికి రావటం, భాగ్యమ్మకు నివాళులు అర్పించటం అందరికీ వింతగా తోచింది. కళ్ళప్పగించి వాళ్ళనే చూస్తూ శిలాప్రతిమల్లా నిల్చుండిపోయేరు.

సరిగ్గా శవయాత్ర ముందుకు కదిలే సమయంలో పోలీసు అధికారులు ఊరేగింపు ముందుకు దూసుకొని వచ్చి కార్మికులను ముందుకు సాగకుండా అడ్డునిల్చున్నారు.

"ఐక్యవేదిక చైతన్య నువ్వేకదూ? " అనంతరామయ్య పక్కనే నడుస్తోన్న చైతన్యను అడిగేడొక పోలీసు అధికారి.

"అవును"

"పట్టణంలో నిషేధాజ్ఞలుంటే నువ్వీ ఊరేగింపును జరపాలనుకోవటం చట్టధిక్కారమౌతుంది!" అన్నాడు అధికారి.

"మేము చాలా ప్రశాంతంగానే ఊరేగింపు జరుపుతాం. దయచేసి మమ్మల్ని వెళ్ళనివ్వండి" అన్నాడు చైతన్య.

ఆ అధికారి జ్యోతుల్లా మండుతోన్న ఎర్ర జీరల కళ్లతో ఉరిమిచూస్తూ "చెప్పాను కదా-అది చట్టధిక్కారమని" అన్నాడు కఠినంగా.

అప్పుడు కల్పించుకున్నాడు అనంతరామయ్య! "చట్టాన్ని ధిక్కరిస్తే ఏమౌతుంది? " అని అడిగేడు అధికారిని.

అధికారికి వొళ్లు మండింది. "ఏమౌతుందా! మీ అందరి వొళ్ళూ హూనమౌతుంది. చితకబాది అరెస్టు చెయ్యాల్సి వస్తుంది!" అన్నాడు అధికారి.

అంతవరకూ ప్రశాంతంగా ఉన్న జనం పోలీసుల ప్రవర్తనకు ఆగ్రహంతో రెచ్చిపోతూ పోలీసులను నెట్టుకుంటూ ముందుకు సాగేరు.

"ఛార్జ్!" అరిచేడు అధికారి.

అధికారి అలా ఆదేశించగానే పోలీసులు లాఠీలు ఝుళిపించేరు. లాఠీ దెబ్బల్ని



తప్పించుకుంటూ నెట్టుకుంటూ, తోసుకుంటూ జనం కకావికలై అటూ ఇటూ పరుగులు తీస్తూనే పోలీసుల మీద రాళ్ళవర్షం కురిపిస్తోంటే.

"ఆగండి!" అని మైకులో పెద్దగా ఎవరో అరిచిన అరుపు విని పోలీసులు, జనం కూడా ఒక్కక్షణం స్తంభించిపోతూ అటువేపుకు చూసేరు!

ట్రాక్టరుమీద చేత్తో మైకు పట్టుకొని కనిపించేడు శివయ్య. అతని పక్కనే గాంధీ కూడా ఉన్నాడు.

"కార్మికసోదరులారా! దయచేసి మీరంతా ప్రశాంతంగా ఉండండి! పోలీసు సిబ్బందికి కూడా నా విజ్ఞప్తి ఏమిటంటే ఒక్కక్షణం మీరు లాఠీఛార్జీ ఆపుచేసి నేను చెప్పేది వినండి! పట్టణంలో నిషేధాజ్ఞలు ఉన్నాగానీ దయచేసి ఈ శవయాత్రను మాత్రం ఆపకండి! ఎందుకంటే నా కార్మికవర్గం ఎంతో శాంతియుతంగా ఈ ఊరేగింపు జరుపుతోంది. ఈ కార్యక్రమానికి మాలోని రాజకీయ విబేధాలను కూడా పక్కకు నెట్టి నేనూ, నా రాజకీయ ప్రత్యర్థి గాంధీగారు కూడా వచ్చామంటే ఇది మా అందరి అభిమతంతోనే జరుగుతోన్న కార్యక్రమంగా భావించి దయచేసి ఊరేగింపును ముందుకు సాగనివ్వండి!" అని రెండుచేతులూ ఎత్తి నమస్కరించేడు శివయ్య.

పోలీసుల లాఠీలు శాంతించేయి! ఊరేగింపుకు అడ్డుగా నిలబడ్డ పోలీసు సిబ్బంది ఒక్కొక్కరే పక్కకు తప్పుకుంటున్నారు.

శివయ్య, గాంధీ ట్రాక్టరుమీంచి కిందికి దిగి ఊరేగింపు ముందుకు వచ్చి "ఇక పదండి, మనల్ని ఎవ్వరూ ఆపలేరు" అని వాళ్ళు కూడా ఊరేగింపు వెంటే నడుస్తోంటే వెనుకనించి ఎవరో అంటున్న మాటలు వినిపించేయి.

"నాయకులంటే అలా ఉండాలి. రాజకీయంగా ఎన్ని విబేధాలున్నా ఇలాంటి విషయాల్లో కలిసి రావటం గొప్ప మనసు ఉంటేనే సాధ్యం!"

"నిజమే! ఏమో అనుకున్నాం కానీ శివయ్యలో కూడా మానవత్వం ఉంది"

"గాంధీ మాత్రం! శివయ్యకూ ఆయనకూ పచ్చగడ్డి వేస్తే భగ్గుమనేంత వైరం! అలాంటిది ఆయన కూడా వచ్చేడంటే అది అతని గొప్పతనమే!"

అంతా విని శివయ్య, గాంధీ గుంభనంగా నవ్వుకుంటుంటే అనంతరామయ్య మాత్రం అగ్నిపర్వతంలా లోలోపలే ఉడికిపోసాగేడు. అయినా ఆయన చెయ్యగల్గింది ఏదీ లేదు, శత్రువుదే పైచేయి అయింది కనుక!

ఊరేగింపు శ్మశానం చేరుకుంది. అక్కడ జరగాల్సిన తతంగం అంతా జరిగేక అందరూ ఎవరిదారిన వాళ్ళు భారంగా నడుస్తూ వెళ్ళిపోయేరు. అందరికన్నా ముందే శివయ్య, గాంధీ కలిసి ఒకే కార్లో వెళ్ళిపోయారు. చితిమంటల్లో తనే కాలి, భౌతిక శరీరాన్ని అగ్నికి అర్పణచేసి సూక్ష్మ శరీరంతో తిరిగి వెడుతోన్నట్టే ఇంటికి తిరిగి వెళ్ళేడు అనంతరామయ్య.



రోజులు గడిచిపోతున్నాయి! భాగ్యమ్మ చనిపోయేక ఇల్లు చక్కదిద్దుకునే బాధ్యత మొత్తం సుందరే నిర్వర్తించవలసి వచ్చింది. రోజూ ప్రొద్దున్నే పెందరాళే నిద్రలేచి ఇంటి ముందు కసువూడ్చి కళ్లాపి చల్లి, ముగ్గులు పెట్టటం, గదులు శుభ్రం చేసుకొని అంట్లగిన్నెలు తోముకోటం, పన్నెండు గంటలకల్లా అన్నం, కూర వండి తండ్రికి భోజనం పెట్టి, తనూ తిని ఆస్పత్రికి భోజనం పట్టుకుని వెళ్ళి భర్తకు పెట్టటం; ఆ మధ్యలో మగ్గాల మీద నేయాల్సిన బట్టల వివరాలు చెప్పి, వాళ్ళకు కావలసిన నూలు, రంగులూ సమకూర్చి వెళ్లటం అంతా సుందరే చేస్తోంది.

ఆరోజు మధ్యాహ్నం వేళ భర్తకు భోజనం తీసుకొని ఆస్పత్రికి వెళ్ళింది సుందరి. కంచంలో వడ్డించి అతను భోంచే




స్తుంటే ఎదురుగా కూర్చుని పరీక్షగా భర్తవేపే చూస్తోంది.

రామ్మూర్తి కొంచెం తేటగా కనిపించేడు. తలగాయం కూడా మాన్తోంది నెమ్మదిగా. నీరసం తగ్గింది.

"ఆస్పత్రినించి ఎప్పుడు డిశ్చార్జి చేస్తా రట? " అడిగింది.

"ఏమో!" అన్నాడు రామ్మూర్తి తల ఎత్త కుండానే.

"అమ్మ శవయాత్రలో శివయ్య కూడా పాల్గొన్నాడంటే మీ మీద దాడిచేసింది ఆయన అనుచరులు కాదేమో? "

రామ్మూర్తి చివాల్న తలెత్తి ఆమెవైపు చూసేడు. "ఏమో!" అన్నాడు క్షణం తర్వాత.

సుందరి నిరుత్సాహంగా తల దించు కుంది. అతడ్ని ఎలాగైనా మాటల్లో పెట్టి దాడిచేసిన వాళ్లెవరో తెలుసుకుందుకు చేసిన ప్రయత్నం ఫలించలేదు!

రామ్మూర్తి తల వంచుకుని భోజనం చేస్తున్నాడు మౌనంగా.

"మీమీద దాడి చేసిన వాళ్ళను నిజంగానే మీరు గుర్తుపట్టలేదా? మీ మౌనం, గాంభీర్యం చూస్తోంటే నాకు భయంగా ఉంది" అంది సుందరి.

అప్పుడే చైతన్య, మరికొంత మంది ఐక్య వేదిక సభ్యులు అక్కడికి వచ్చారు. రామ్మూ ర్తిని పరామర్శించేక "రామ్మూర్తిగారూ... యూనియన్ ఎలక్షను దగ్గర పడుతోంది. మన ప్రత్యర్థిగా అధ్యక్ష పదవికి శివయ్యే నిలబడటం ఖాయమైనట్లే! ఇప్పటికే శివయ్య తన ఎత్తుగడలను ప్రారంభించేడు. కార్మికులకు రోజూ సారా పొట్లాలు యివ్వటం, కెమికల్ ఫ్యాక్టరీ సమీపంలో ఎన్నికల కార్యాలయం తెరిచి జనాన్ని పోగె య్యటం చేస్తున్నాడు. నిన్నట్నించి మన సభ్యులను, అభిమానులనూ బెదిరించటం కూడా మొదలైంది!" అని చెప్పాడు చైతన్య.

"శివయ్య, గాంధీ కలిసి శవ యాత్రలో పాల్గొనగానే వాళ్ళ ఎత్తుగడను మంచిత నంగా అపార్థంచేసుకున్న వాళ్ళు ఇప్పుడు ఏమంటున్నారు? " అని చైతన్యను అడిగి సుందరివైపు అదోలా చూసేడు రామ్మూర్తి.

సుందరి మాట్లాడకుండా మౌనంగా కూర్చుంది!

"ఏమనుకుంటారూ... జనం సానుభూతి కోసం వాళ్లలా మనమీద అభిమానం నటించారని అర్థంచేసుకున్నారు. పైగా శివయ్య, గాంధీ చేతులు కలపటంతో వాస్త వంగానే వాళ్ళనూ, వాళ్ళ రాజకీయ పార్టీ లనూ అభిమానించే వాళ్ళు కూడా ఆ దుష్ట కలయికను అసహ్యించుకుంటున్నారు. రోజురోజుకూ ప్రజల సానుభూతి మనవైపే మొగ్గుతోంది కానీ అరాచక శక్తులకు భయ పడుతున్నారు!" చెప్పాడు చైతన్య.

"అరాచక శక్తులా? "

"అవును! శివయ్య ఇప్పటికే గూండాలను ఎన్నికల రంగంలోకి దింపాడు. మారణా యుధాలనూ, బాంబుల్ని కూడా సేకరిస్తు న్నారట! గాంధీ ఇప్పుడు బహిరంగంగానే శివయ్య విజయానికి కృషి చెయ్యటం ప్రారంభించేడు. నిన్న మొన్నటిదాకా పర స్పరం ఘర్షణలు పడ్డ ఆ ఉభయవర్గాలూ ఇప్పుడు ఐక్యవేదికకు వ్యతిరేకంగా కలిసి పనిచేస్తున్నారు"

"గబ్బర్ బృందం మాట ఏమిటి? " మధ్య లోనే అడిగేడు రామ్మూర్తి.

"కార్మికులను భయపెట్టటం, భయపడని వాళ్ళమీద దాడులకు సన్నాహాలు ప్రారం భించటం అంతా గబ్బర్ బృందం ఆధ్వర్యం లోనే జరుగుతోంది!"

"శాయి కూడా వాళ్ళ వెంట తిరుగుతు న్నాడు కదూ?"

"అవును! ఎన్నికలు పూర్తయ్యేదాకా ఉద్యో గానికి సెలవు కూడా పెట్టేడట!" అన్నాడు చైతన్య.

రామ్మూర్తి నోటివెంట శాయి పేరు వెలు

వడగానే చివాల్న తలెత్తి చూసింది సుందరి భర్తవేపు! మబ్బులు విడిపోయినట్టో, తెరలు తొలగినట్టో ఆ క్షణం వరకూ భర్తమీద జరిగిన దాడిలో శాయి ప్రమేయం లేదని తననుతాను మభ్యపెట్టుకుంటూ న్యూనతలోకి జారిపోకుండా నిబ్బరపడుతోన్న సుందరికి ఇప్పుడు అలాంటి స్థితినించి బైటపడటం అనివార్యమైంది!

శాయి పేరు ఉచ్చరించినప్పుడు అతని కంఠంలో జీరలా ధ్వనించిన ఆవేశపు కంపనలూ... ముఖంలో కనిపించిన ప్రతీకారేచ్ఛా...

సుందరి మౌనంగా లేచి నిల్చుంది. రామ్మూర్తి భోజనం చేసి చెయ్యి కడుక్కున్న కంచం ఎత్తి బైటికి వెళ్ళి నీళ్ళతో కడిగింది. ప్లాస్టిక్ బుట్టలో సామాన్లు సర్దుకుని "ఇక నేను వెళ్ళొస్తాను" అని చెప్పి వెళ్ళిపోయింది.

సుందరి వెళ్ళగానే రామ్మూర్తి చైతన్యతో తిరిగి అదే చర్చను కొనసాగిస్తూ, "శివయ్యవాళ్ళకు సారా ఎవరు సరఫరా చేస్తున్నారు? " అని అడిగేడు.

"గాంధీ!" చెప్పాడు చైతన్య.

"అతని దొంగసారా బట్టీలు తూర్పు కొండల వెనుక అడవిలో కదూ వుంది? "

"అవును! అది బహిరంగ రహస్యమే కానీ ఎవ్వరూ పట్టించుకోరు. అధికారులకూ, అగ్రనాయకులకూ గాంధీ ముడుపులు చెల్లిస్తుంటాడు. పైగా యిప్పుడు శివయ్యతో చేతులు కలిపేడు కనుక ప్రభుత్వం అతడ్ని ఏమీ చెయ్యదు!" అన్నాడు చైతన్య.

రామ్మూర్తి ఆలోచనలో పడ్డాడు.

అక్కడ పరచుకున్న నిశ్శబ్దాన్ని భంగపరుస్తూ ఇద్దరు పోలీసులను వెంటపెట్టుకుని ఎస్సై బూట్ల యినుప నాడాల చప్పుడు చేస్తూ అక్కడికి వచ్చేడు. "రామ్మూర్తిగారూ! ఇంకా కొంతకాలం మీరు ఆస్పత్రిలోనే వుండాలి!" అన్నాడు రామ్మూర్తి ముఖంలోకి చూస్తూ.

రామ్మూర్తి ఎస్సైవేపు అదోలా చూస్తూ "ఆ విషయం చెప్పాల్సింది డాక్టర్లు కదా? " అన్నాడు నొసలు చిట్లిస్తూ.

"అదేమోకానీ. పై అధికారుల నుంచి మాకు వచ్చిన ఆదేశం అది! మిమ్మల్ని ఆస్పత్రిలోనే మరి కొంతకాలం వుంచి పోలీసు కాపలా కూడా ఏర్పాటు చెయ్యమన్నారు. మీమీద మళ్ళీ దాడి జరుగవచ్చని సమాచారం ఏదో అందిందిట! కెమికల్ ఫ్యాక్టరీ యూనియన్ ఎన్నికలు ముగిసేదాకా మీరు ఇక్కడ్నించి బైటికి వెళ్ళటం కానీ, బైటివాళ్ళు మీకోసం రావటంకానీ అనుమతించం! మీకు భోజనం తెచ్చేందుకు మీ భార్య, రాత్రి వేళల్లో తోడు వుండేందుకు మీ మామయ్య మాత్రమే మీ దగ్గరికి వచ్చే అవకాశం వుంది, అంతే!" అన్నాడు ఎస్సై.

"పై అధికారులంటే శివయ్య, గాంధీనే కదూ? " అని పెద్దగా నవ్వేడు రామ్మూర్తి.

ఎస్సైకి చిర్రెత్తుకొచ్చింది. రామ్మూర్తి మంచం పక్కనే కూర్చుని మౌనంగా వింటోన్న చైతన్యనూ, అతడి వెంటవున్న కార్మికులనూ తీక్షణంగా చూస్తూ "మీరంతా వెంటనే ఇక్కడ్నించి వెళ్ళిపోండి!" అని ఆదేశించేడు కోపంగా.

చైతన్య కూడా అంతే కోపంగా ఎస్సైవేపు చూస్తూ ఏదో అనబోతోంటే అతడ్ని వారించేడు రామ్మూర్తి. "విన్నావుగా చైతన్యా, ఎస్సైగారు ఏంచెప్పారో! పై అధికారులు చెప్పినట్లు వాళ్ళ విధి వాళ్ళు నిర్వర్తించాలి కదా! ఇక మీరంతా వెళ్ళండి. ఏం జరగాలో అదంతా సవ్యంగానే జరుగుతుంది!" అంటూ చైతన్య కళ్ళలోకి చూసేడు.

అతని చూపుల్లో అద్వితీయమైన ఏదో ఆకర్షణ! అనంతమైన ఆత్మస్థైర్యాన్ని పురిగొలుపుతూ అనిర్వచనీయమైన ఏదో మెరుపు! చిర్నవ్వు నవ్వుతూ కార్మికులతో కలిసి వెళ్ళిపోయేడు చైతన్య.



ఆ రాత్రి అనంతరామయ్య రామ్మూర్తికి భోజనం పట్టుకుని ఆస్పత్రికి వెళ్ళిపోగానే





తను కూడా అన్నం తిని దొడ్లో మంచం వాల్చుకుని పడుకుని దీర్ఘంగా ఆలోచనల్లో కూరుకుని పోయింది సుందరి.

తల్లి మరణంతో ఆ ఇల్లు బోసిపోతోంటే మరోవైపు రామ్మూర్తి అలా ఆస్పత్రి పాలు కావటం, తండ్రి సర్వం కోల్పోయినట్టు విషాదపు ఆవలి అంచులు కూడా దాటి మూగిలా ఎప్పుడూ మౌనంగా శూన్యంలోకి చూస్తూ.

అనూహ్యమైన అనుభవాలు ఎదురై అల్లకల్లోలం సృష్టించి క్రమంగా అవి జ్ఞాపకాల పొదిలో యిమిడిపోవటం కాలం చేసే చమత్కారం! అంతవరకూ ఆమె అనుక్షణం ఊహలతోనే అనంతమైన ఆవేదనను ఆనందించిందే కానీ నిజంగానే విషాదం జీవితంలో ఎదురయ్యే సరికల్లా ఆమె ఆలోచనా విధానమే మారిపోసాగింది! ఆ నిజ విషాదాన్ని భరించలేక సాధ్యమైనంత వరకు అలాంటి ఆలోచనలే మనసుకు తట్టకుండా వుండేందుకు ప్రయత్నిస్తోంది!

రామ్మూర్తి సాంగత్యం, నిత్యం కార్మికుల సమస్యలను వింటూ దోపిడి పీడనలు గురించి తెలుసుకుందుకు ఆసక్తి చూపించటం యిత్యాది పరిణామాలన్నీ ఆమెపట్ల అమితంగా ప్రభావం చూపించసాగేయి! ఎన్నో ఏండ్లుగా కేవలం విషాదగీతాలకు మాత్రమే పరిమితమైన సుందరి కొద్దిరోజులుగా శ్రామికుల కడగండ్ల పాటలను గొంతెత్తి పాడుతోంది! ఆమె కంఠంలో యిప్పుడు వెనుకటి విషాదపు జీర ధ్వనించటం లేదు, కార్మికులను సమరానికి సమాయత్తం చేసే విప్లవ గీతాల రణన్నినాదపు గర్జనలు తప్ప!

ఆమె సమయం చిక్కినప్పుడల్లా కార్మిక వాడలకు వెడుతోంది. చైతన్య ఆమెను అనుసరిస్తున్నాడు. ఆమె పాటలు పాడి జనాన్ని సమీకరిస్తుంటే అతను తన ఉపన్యాసాలతో వారిని చైతన్య పరుస్తున్నాడు.

రామ్మూర్తిని ఆస్పత్రినించి విడుదల కాకుండా ఎన్నికలదాకా అతడ్ని పోలీసుల సహకారంతో నిరోధించటంద్వారా లబ్ధిపొందాలని శివయ్య, గాంధీ ఆశిస్తే రామ్మూర్తి లేని లోటు పూరిస్తూ సుందరి అందరికీ ఆరాధ్యనీయురాలైంది ఇప్పుడు. రామ్మూర్తి రాలేదన్న భయంకానీ సంకోచం కానీ లేకుండా కార్మికులంతా సమధికోత్సాహంతో కార్యరంగంలోకి దూకుతున్నారు.

తెల్లవారింది.

సుందరి యథావిధిగా తన దినవారి కృత్యాలలో నిమగ్నమైవుంటే చైతన్య హడావుడిగా ఇంటికి వచ్చేడు.

"ఏమిటి విశేషాలు? " అడిగింది సుందరి.

"మన ప్రత్యర్థులు కొత్త పథకం వేసేరు! అమరలింగం అనేవాడికి కెమికల్ ఫ్యాక్టరీలో కొద్దిమంది సభ్యులతో చిన్న యూనియన్ వుంది. దానికి అతనే నాయకుడు. యూనియన్ను పెంచుదామని కానీ, ఉద్యమాలు నిర్మించాలని కానీ అతడి ఉద్దేశం కాదు! యాజమాన్యానికి అనుకూలంగా కార్మికుల పోరాటాలను నీరుకార్చి ఆర్థికంగా లబ్ధిపొందటం, యూనియన్ పేరుతో సభ్యత్వ రుసుము వసూలుచేసి ఆ డబ్బును స్వాహా చెయ్యటం... అదే అతని వృత్తి! శివయ్య అతడ్ని ప్రలోభపెట్టి రేపు జరగబోయే ఎన్నికల్లో అతడిని అనుకూలంగా మార్చుకున్నాడు" అని చెప్పాడు చైతన్య.

"అతన్ది చాలా చిన్న యూనియనే కదా, వాళ్లంతా అమరలింగం మాయలోపడి శివయ్యకు అమ్ముడుపోయినా మనం పెద్దగా నష్టపోయేది ఏమిటి? " అని అడిగింది సుందరి.

"చాలా వుంది! బినామీ పేర్లతో గబ్బర్ ఆక్రమణలో వున్న ఇళ్ల స్థలాల్లో పది ప్లాట్లను అమర్లింగానికి ఇస్తానని వాగ్దానం చేసేడు శివయ్య. అంతేకాక ఎన్నికల్లో తను గెలవగానే అమర్లింగం అనుచర కార్మికులకు తూర్పు కొండల పక్కనున్న కార్మికవాడలో



ఇళ్ళ స్థలాలు యిస్తానని చెప్పాడు. దాంతో చాలామంది కార్మికులు ఇళ్ళస్థలాలు వస్తాయన్న ఆశతో అమర్లింగం గూటికి చేరుకుంటున్నారు.

"బినామీ పేర్లతో సుమారు ఎన్ని ప్లాట్లు వుంటాయి? "

"రెండువందలు వుండవచ్చు!" చెప్పాడు చైతన్య.

"అయితే రేపే మనం ఆర్.డి.ఓ. కార్యాలయం దగ్గర ధర్నాచేద్దాం. బినామీ పేర్లతో ఆక్రమణలో వున్న ఇళ్ళ స్థలాలను అర్హులైన కార్మికులకు బదలాయించాలని డిమాండు చేద్దాం. ఆ పోరాటం విజయవంతమైతే దాని ప్రభావం కార్మిక వర్గంమీద గణనీయంగా వుంటుంది. తమ హక్కుల్ని కోల్పోయి సాధించుకునే బిచ్చం కన్నా పోరాడి గెల్చుకున్న చిన్న ప్రయోజనాలే వాళ్ళకు ఆనందాన్నిస్తాయి! ప్రజా సమీకరణ మనవైపు అధికంగా వుంటే బాంబులు కూడా మనల్ని ఏమీ చెయ్యలేవు" అంది సుందరి.

చైతన్య ఆలోచించాడు! సుందరి చెప్పింది అతనికి ఆమోదయోగ్యంగా తోచింది కానీ ఎందుకో సందేహిస్తూ అన్నాడు క్షణం తర్వాత "ధర్నా విషయం మన రామ్మూర్తి గారికి చెప్పిచేస్తే బాగుంటుందేమో? "

"వారికి అన్నీ తెలుస్తూనే వుంటాయి! అయినా మధ్యాహ్నం నేను భోజనం పట్టుకుని వెళ్లగానే ముందుగా ఈ విషయమే వారితో చర్చిస్తాను!" అంది సుందరి.

అనంతరామయ్య అప్పుడు ఆస్పత్రినుంచి వచ్చాడు. వాళ్ళిద్దరినీ చూసి హడావుడిగా కాళ్ళు కడుక్కుని వచ్చి "రామ్మూర్తితో ఏ విషయం మాట్లాడనివ్వటంలేదమ్మా, పోలీసులు. రామ్మూర్తి బైటికొచ్చి ఎలక్షన్ల పని మీద తిరక్కుండా చెయ్యటమే వాళ్ళ ఉద్దేశంగా తోస్తోంది. ఏదో ఒక మిషమీద అతడ్ని అరెస్టుచేసి వుండే వాళ్ళేకానీ కార్మికుల్లో అలజడి చెలరేగితే ఎన్నికల్లో శివయ్య నష్టపోతాడనే అలా పథకం పన్ని ఆస్పత్రిలోనే నిర్బంధించారు" అన్నాడు.

చైతన్య సుందరివైపు చూసేడు. ఆమె కళ్ళు మూసుకుని ధ్యానంగా ఏదో ఆలోచిస్తోంది. నిశ్శబ్దంగా అలా కొంత సమయం గడిచిపోయేక నెమ్మదిగా కళ్ళు తెరిచి "చైతన్యా! ఇక నువ్వు వెళ్ళి రేపటి ధర్నా ఏర్పాట్లు చెయ్యి! మైకు పర్మిషను తీసుకొని పై అధికారులకు ధర్నా విషయం టెలిగ్రాంలు పంపించు. అలాగే కార్మిక వాడలకు వెళ్ళి రేపటి కార్యక్రమంకోసం కార్మికులను అధిక సంఖ్యలో సమీకరించు" అని చెప్పింది సుందరి.

"మరి రామ్మూర్తిగారితో విషయాలు చర్చించేది ఎలా? అక్కడ పోలీసులు ఎలాంటి చర్చలనూ అనుమతించటంలేదటగా? " అని అడిగేడు చైతన్య.

"దానికి మరో పరిష్కారం ఆలోచించే వుంచాను! పోలీసులు మనల్ని నిరోధిస్తారు కానీ ఆస్పత్రి సిబ్బందిని నిరోధించరు. నాకు తెలిసిన నర్సు ఒకర్తె అదే ఆస్పత్రిలో పని చేస్తోంది. మనకు ఆమె సహకరిస్తుందేమో అడిగి చూడాలి. ఆమెగనుక సహకరిస్తే రామ్మూర్తిగారితో మనం ఆవిడద్వారా సంబంధాలు పెట్టుకోవచ్చు. ఎప్పటికప్పుడు సమాచారం వారికి పంపిస్తూ వారి సలహాలను పొందవచ్చు.

చైతన్య ముఖంలో వెల్తురు పుంజుకుంది. "అయితే మీరు ఆ కార్యక్రమంలో వుండండి. నేను వెళ్ళి ధర్నా ఏర్పాట్లు చూస్తాను" అని చెప్పి వెళ్ళిపోయాడు చైతన్య.

సుందరి త్వరత్వరగా ఇంటి పనులన్నీ ముగించుకుంది. మగ్గాల పనిని ఆరోజుకు అనంతరామయ్యకు అప్పగించి పెందరాళే వంట కూడా పూర్తిచేసి రామ్మూర్తికి భోజనం తీసుకొని ఆస్పత్రికి చేరుకుంది.

ఆరోజు రామ్మూర్తిని వార్డులో అందరితో పాటు కాకుండా ప్రత్యేకంగా వున్న గదిలోకి





మార్చేరు. ఆ విషయం తెలుసుకుని అక్క డికి వెళ్ళింది సుందరి. గది బైట కాపలా కాస్తోన్న పోలీసులు సుందర్ని అటకాయించారు. వాళ్లే సుందరి తెచ్చిన భోజనాన్ని లోపలికి పట్టుకువెళ్ళారు.

సుందరికి పరిస్థితి అర్థమైంది. యూనియన్ ఎన్నికలు దగ్గరపడుతోన్న కొద్దీ రామ్మూర్తి విషయంలో కట్టుదిట్టాలు అధికం చేస్తున్నారు పోలీసులు.

"మా వారికి భోజనం నేను తీసుకువెళ్ళకూడదా? " గది బైట స్టూలుమీద కూర్చున్న మరో కానిస్టేబుల్ని అడిగింది సుందరి కోపంగా.

"వీల్లేదు. అది పైవాళ్ళ ఆర్డరు! అంతే కాదు, ఈరోజునుంచి మీ నాన్న కూడా రాత్రులు ఇక్కడ పడుకోకూడదు" చెప్పాడు కానిస్టేబులు.

ఇక అతనితో మాట్లాడి ప్రయోజనం లేదనుకుని అక్కడ్నించి మరో దారిగుండా ఆస్పత్రి కార్యాలయం వేపు వెళ్ళిపోయింది సుందరి. తనకు కావలసిన నర్సు డ్యూటీ ఏ వార్డులోనో విచారించింది. ఆరోజే నర్సుల డ్యూటీలు మారేయట! సుందరి అడిగిన నర్సుకు పేషంట్లుగా ఆస్పత్రిలో చేరిన ప్రముఖులనూ, రామ్మూర్తినీ అటెండయ్యే డ్యూటీ వేశారట!

ఆ విషయం వినగానే సుందరి ఆనందంతో కళ్లు విప్పార్చి "ఆ సిస్టర్ డ్యూటీకి ఎప్పుడు వస్తుంది? " అని అడిగింది, తనకు సమాచారం అందిస్తోన్న వ్యక్తిని.

"ఆమెది నైట్ డ్యూటీ" చెప్పాడతను.

"నేను ఆమెను అర్జంటుగా కలవాలి. ఆమె అడ్రసు చెప్తారా? "

"స్టాఫ్ క్వార్టర్సులోనే వుంటోంది. ఆ దారిగుండా అలా ఆస్పత్రి బిల్డింగుల వెనక్కు వెడితే అక్కడుంటాయి క్వార్టర్సు. ఆమె క్వార్టరు నెంబరు పది"

"థాంక్స్" అని చెప్పి అతను చూపించిన దారిగుండా నడవసాగింది సుందరి

ఆమె ఇప్పుడు కలవటోతోన్న సిస్టర్ మరెవ్వరో కాదు, చిన్నప్పుడు తనను క్లాసులో వేధించి రామ్మూర్తి దేశాల మీదికి వెళ్లటానిక్కూడా కారణమైన రమణి!

★ ★ ★

మలిసంధ్య సూర్యుడు భూగోళపు మరో వేపు సత్యాలను శోధించి వచ్చేందుకు పడమటి దిక్కుకు అదృశ్యమౌతున్నాడు. క్రమంగా ప్రకృతిని చీకట్లు ముసురుకుంటున్నాయి. ఆస్పత్రిలోవిద్యుద్దీపాలు వెలిగేయి అప్పుడే. పగలంతా విధిని నిర్వర్తించిన సిబ్బంది ఇళ్ళకు వెళ్ళిపోయారు. వాళ్ళస్థానంలో నైట్ డ్యూటీ సిబ్బంది విధులకు హాజరయ్యారు.

సర్జికల్ వార్డుకు ఓ మూలగా వున్న గదిని తాత్కాలికంగా పోలీసులు స్వాధీనం చేసుకొని రామ్మూర్తిని అందులో వుంచి కాపలా కాస్తున్నారు. ఆ గది రెండవ అంతస్తులో వుంది.

రమణి సర్జికల్ వార్డులో వున్న ఇద్దరు వి.ఐ.పి. పేషంట్లను పరామర్శించి కేసు షీట్ల ప్రకారం వాళ్లకు ఇంజక్షన్లు చేసింది. మందులు యిచ్చి అక్కడ్నించి తిన్నగా నడుస్తూ రామ్మూర్తి గదిలోకి వెళ్లింది.

కాపలా పోలీసు ఆమెను అడ్డగించలేదు.

మంచంమీద వెల్లకిలా పడుకుని ఏదో ఆలోచిస్తున్నాడు రామ్మూర్తి. దగ్గరికి వెళ్ళి నిలబడి "రామ్మూర్తిగారూ! వొంట్లో ఎలా వుంది? " అని అడిగింది రోజారమణి.

ఆవేళప్పుడు రోజూ నర్సు వచ్చి పరామర్శించటం, అవసరమైతే ఏదైనా ఇంజక్షనూ, మందులూ ఇచ్చివెళ్ళటం మామూలే! బాగానే వున్నాను" అన్నాడతను కళ్ళు తెరవకుండానే.

"ఈరోజు మధ్యాహ్నం సుందరి వచ్చి నాతో మాట్లాడిపోయింది. ఎంతమంది పోలీసులను కాపలా పెట్టినా మీకూ, మీ కార్మికులకూ మధ్య వారధిగా పనిచేసే అవ

కాశం నాకు మాత్రమే వుంది. నా సహాయం మీకు కావాలంటే నిరభ్యంతరంగా అడగవచ్చు" అంది రోజారమణి.

రామ్మూర్తి కళ్లు తెరిచి చివాల్న లేచి కూర్చుని సిస్టర్‌వేపు ఆశ్చర్యంగా చూశాడు.

"గుర్తుపట్టలేదా? నేను రమణిని!" చెప్పిందామె.

రామ్మూర్తి ఒక్కక్షణం ఆ నిజాన్ని నమ్మలేకపోయాడు! "మీరు మీరు ఇలా... ఇక్కడ..." అని కళ్లప్పగించి ఆమెవేపే చూస్తోంటే-

"నేను ఓడిపోయానండీ రామ్మూర్తిగారూ..." అన్నది గాద్గదికంగా.

"నాంచారయ్య ఎక్కడున్నాడు?"

"నా డబ్బు, నగలు అంతా కరిగించుకుని తినేదాకా నాతోనే కాపురం చేశాడు. ముఖం మొత్తగానే ఇక నావల్ల ప్రయోజనం కూడా లేదనుకొని ఎంతైనా రాజకీయ నాయకుడు కదా... పార్టీలు మార్చినంత తేలిగ్గానే భార్యను మార్చి మరో ఆవిడతో కుదురుకున్నాడు. అతనలా ద్రోహంచేసి వెళ్ళగానే ఒక దశలో ఆత్మహత్య చేసుకుందామని అనుకున్నాను. అతనితో వెళ్లిన నా తొందరపాటుకు తల్లిదండ్రులను కూడా బలిపెట్టుకున్న నాకిక జీవించే అర్హత లేదనే భావించాను. కానీ నా కడుపులో పెరుగుతోన్న బిడ్డ 'అమ్మా! నీ తొందరపాటుకూ నాన్న చేసిన ద్రోహానికీ నన్ను బలిచేస్తావా? ఇందులో నా నేరం ఏముంది కనుక?' అని నన్ను నిలదీసి అడిగినట్టే తోచింది. అంతే... ఆ క్షణంలోనే గుండె రాయి చేసుకుని బిడ్డకోసం బతికితీరాలన్న నిర్ణయానికి వచ్చాను. నెమ్మదిగా ఆలోచించి ఇంటర్ పూర్తిచేసి నర్సు ట్రైనింగుకు వెళ్ళాను. అంతా సవ్యంగా జరిగి నాకు కొడుకు పుట్టాడు. ట్రైనింగు పూర్తికాగానే నర్సుగా ఇక్కడ ఉద్యోగం కూడా వచ్చింది. శిథిలమైపోయిన నేనలా మళ్లీ జీవితంలోకి వచ్చాను. ఎన్నోసార్లు అలా బైటికి వచ్చి పూర్వపు నేస్తాలందరినీ కలవాలని అనిపించేది కానీ ముఖం చెల్లక రాలేకపోయాను" అని కర్చీఫ్‌తో కళ్లు తుడుచుకుంది రమణి.

రామ్మూర్తి ఆమెవేపు అభిమానంగా చూశాడు. "ముఖం చెల్లనంత నేరం నువ్వేమీ చెయ్యలేదు. వంచనకు గురయ్యావు అంతే! అది నీ అమాయకత్వమే అవుతుందేమోకానీ తప్పు మాత్రం కాదు. ఆత్మహత్య చేసుకొని నువ్వు జీవితంనుంచి పారిపోయివుంటే అలాంటి వేలాదిమంది సగటు స్త్రీలతోపాటు నువ్వూ ఒక అల్పజీవివి అయ్యుండేదానివి. కానీ నువ్వు అలా చెయ్యకుండా నీ జీవితాన్నే ఒక సందేశంగా అందరికీ మిగిల్చేవు. నిన్ను చూస్తుంటే చాలా గర్వంగా వుందమ్మా..." అన్నాడు ఆర్ద్రంగా.

రమణి అతని అనునయింపు మాటలకు చలించిపోయింది. "నన్నేం చెయ్యమంటారో నిస్సంకోచంగా చెప్పండి. మీ ఉద్యమానికి నా సహకారం అందించటం అదృష్టంగా భావిస్తాను!" అంది మామూలు ధోరణిలోకి వస్తూ.

"రేపు రాత్రికి పోలీసుల కళ్లుకప్పి నేను బైటికి వెళ్ళి తిరిగివస్తాను. చాలా అత్యవసరమైన పనివుంది. తిరిగి రావటానికి సుమారు గంటన్నరకు పైగా రెండు గంటల లోపలా వ్యవధి కావాలి. అలా నన్ను పంపించే ఏర్పాటు చెయ్యగలవా?" అడిగాడు రామ్మూర్తి.

రమణి ఒక నిమిషం ఆలోచించింది. రామ్మూర్తిని రహస్యంగా బైటికి పంపించేందుకు గల అవకాశాలను అంచనా వేస్తూ చివరికి "ఓ... అలాగే పంపించగలను!" అంది సంతోషంగా.

రామ్మూర్తి కళ్లు ఆనందంతో మెరిశాయి.

"మరి రేపు పొద్దున్నే సుందరి, చైతన్యల ఆధ్వర్యంలో ధర్నా జరుగుతుంది కదా. వాళ్లకు ఏమైనా కబురు చెప్పాలా?" అడిగింది రోజారమణి.




"అవసరం లేదు. వాళ్ల సామర్థ్యం మీద నాకు నమ్మకం వుంది!" అన్నాడు రామ్మూర్తి.

రోజారమణి అతని దగ్గర సెలవు తీసుకొని బైటికి వెళ్ళిపోయింది రేపు రాత్రికి రామ్మూర్తిని రహస్యంగా పంపించే పథకానికి మనసులో రూపకల్పన చేసుకుంటూ.



ఆర్. డి. ఓ. కార్యాలయం దగ్గర ధర్నా జరిపేందుకు ఏర్పాట్లు జరిగాయి. ట్రాఫిక్ కు అవరోధం కలక్కుండా రోడ్డు పక్కన పొడవుగా షామియానాలు వేసి, మైకులు అమర్చేరు. వాళ్ళ డిమాండ్లను ప్లే కార్డుల మీద రాసి షామియానాల గుంజలకు కట్టారు. కరపత్రాలు పంచుతూ ధర్నాను గురించి ప్రజలకు వివరిస్తూ మైకు అమర్చిన జీపొకటి నిర్విరామంగా వీధుల్లో తిరుగుతోంది.

ఉదయం పది గంటలకల్లా పారిశ్రామిక వాడలోని అయ్యరు హోటల్ దగ్గర్నుంచి కార్మికులు ఊరేగింపుగా బైల్దేరి నినాదాలు చేసుకుంటూ రెవిన్యూ అధికారి కార్యాలయం వేపుకు సాగిపోతోంటే అదే సమయానికి అక్కడ తూర్పుకొండల దగ్గరున్న కార్మిక వాడనించి మరో ఊరేగింపు బయల్దేరి పదకొండుగంటలకల్లా రెండు ఊరేగింపులూ ధర్నా దగ్గర కలిశాయి.

వందల సంఖ్యలో మొదలైన ఆ ఊరేగింపు దారి పొడవునా కార్మికులు వచ్చి చేరటంతో వేలకు మారింది. షామియానాలు జనంతో కిటకిటలాడిపోతోన్నాయి. నినాదాలు మిన్ను ముడుతున్నాయి.

అప్పుడు వినిపించింది మైకులో సుందరి కంఠం!

కొండలమీంచి దొర్లుతూ గలగలా ప్రవహించే జలపాత ఝరిలా ఆవేశాన్ని రేపుతూ, ఆలోచనలను ప్రేరేపిస్తూ పేదరికానికి కారణమైన దోపిడివర్గం రత్నగర్భ భారతదేశాన్ని ఏనుగు మింగిన వెలగపండుగా చేస్తోన్న వైనాన్ని పాటల రూపంలో గొంతెత్తి పాడుతూంటే అక్కడ నిశ్శబ్దం పరచుకుంది. ఆ నిశ్శబ్దంలోంచి ఆమె గొంతు కర్తవ్యాన్ని బోధిస్తోంది.

ఆమె అలా పాటలు ఎప్పుడు ఆపి చైతన్యను ఉపన్యశించవలసిందిగా కోరిందో కానీ, అంతదాకా మంత్రముగ్ధులై విప్లవగీతాలను వింటోన్న జనం తుళ్లిపడి చూశారు.

చైతన్య మాట్లాట్టం ప్రారంభించాడు.

"సోదరీ, సోదరులారా! ఇప్పుడు మనం చేస్తున్న ధర్నా ఇకనైనా అధికారులు జోక్యం చేసుకొని కార్మికులకు కేటాయించిన ఇళ్ళస్థలాల విషయంలో జరిగిన అక్రమాలను విచారించి కార్మికులకు న్యాయం చెయ్యమనీ, అక్రమ కబ్జాదారులపై కఠినచర్యలు తీసుకోవాలనీ చేస్తోన్న తొలి హెచ్చరిక మాత్రమే. ఈ పోరాటానికే ప్రభుత్వం కదిలి ప్రజల వద్దకు వచ్చి న్యాయం చేస్తుందన్న భ్రమలు శ్రామికవర్గానికి ఎంత మాత్రమూ లేవు. భూస్వామ్య, పెట్టుబడిదారి వర్గాల ప్రయోజనాలను కాపాడే మన ప్రభుత్వం కెమికల్ ఫ్యాక్టరీ ఎన్నికల్లో రామ్మూర్తిగారు సహాయకారిగా వుంటే ఫలితం మనకు అనుకూలంగా వుంటుందన్న భయంతోనే ఆయన్ను అక్రమంగా ఆస్పత్రిలోనే నిర్బంధించారు. అలా శివయ్యకు సహకరించారు. నిన్న మొన్నటిదాకా

రాజకీయాల పేరిట రెండు శత్రు శిబిరాలుగా మొహరించి పరస్పరం కలహించుకుంటూ ఆ కలహాల్లో ఎందరో అమాయకులను బలిచేసిన శివయ్య, గాంధీ ఇప్పుడు బహిరంగంగానే కలిసిపోయారంటే వాళ్ల వర్గ ప్రయోజనాలను కాపాడుకుందుకు ఎంతటి నీచానికైనా దిగజారేందుకు వెనుకాడరన్నది రుజువైంది. అక్రమ సారా, టాక్సులు చెల్లించకుండా ఇతర రాష్ట్రాల నుంచి దొంగచాటుగా తెప్పిస్తోన్న మద్యం వాళ్ళిద్దరూ యధేచ్ఛగా అమ్ముతున్నా పట్టించుకోని ప్రభుత్వం ఇప్పుడు యూనియన్ ఎన్నికల్లో వాళ్ళకు సహకరిస్తోందంటే ప్రభుత్వం ఏ వర్గ ప్రయోజనాలను కాపాడుతున్నదో మీరే గ్రహించండి! కార్మికులకు చెందవలసిన ఇళ్లస్థలాలను బినామీ పేర్లతో గూండాలు ఆక్రమించుకున్నారు. ఆ స్థలాల్లో జూదం, వ్యభిచారం, అక్రమ సారా వ్యాపారం సాగిస్తున్నారు. మరికొంతమంది కార్మిక నాయకులం అంటూ 'కాయతొల్చు పురుగుల్లా' కార్మికులనే దోచుకుని తింటున్నారు. ఇలాంటి పరిస్థితుల్లో మనమే పోరాటంద్వారా మన హక్కుల్ని సాధించుకోవలసివచ్చింది కనుకనే మనం అందుకు సమాయత్తమైనాం కానీ ఆందోళన మన అలవాటు కానేకాదు. అది మనకు అనివార్యమైనప్పుడు మనుగడకై మిగుల్చుకున్న ఆయుధం మాత్రమే!" అని చైతన్య అలా ఉపన్యశిస్తోంటే కరతాళ ధ్వనులతో పరిసరాలు దద్దరిల్లాయి!

ఉపన్యాసం పూర్తికాగానే చైతన్య, సుందరి మరికొంతమంది ప్రతినిధివర్గంగా ఏర్పడి రెవిన్యూ అధికారికి తమ కోర్కెల పత్రాన్ని ఇచ్చేందుకు కార్యాలయంలోకి వెళ్ళారు. వాళ్ళు తమకు ఇంటర్వ్యూ ఇవ్వవలసిందిగా అధికారిని కోరుతూ అటెండరు ద్వారా ఆయనకు విజిటర్స్ స్లిప్పు పంపించి లాంజిలో కూర్చున్నారు.




రెండు నిమిషాల్లోనే అటెండరు ఛాంబర్లోంచి బైటికి వచ్చాడు. "అయ్యగారు చాలా అర్జంటు ఫైళ్లు చూస్తున్నారట. ఇప్పుడు ఎవర్నీ కలవరట. మీ కోర్కెల పత్రాన్ని నాకు ఇచ్చి వెళ్లమన్నారు!" అని చెప్పాడు ప్రతినిధి వర్గంతో.

"బయట అంత పెద్ద ఎత్తున కార్మికులు ధర్నా చేస్తుంటే మమ్మల్ని కలిసి సమస్యను విచారించలేనంతగా అర్జంటు వ్యవహారాలు వారికి ఏమున్నాయి? " అని అడిగాడు చైతన్య కోపంగా.

"లోపల ఎవరైనా ఉన్నారా? " అని అడుగుతూ అటెండరువేపు చూసింది సుందరి.

"ఉన్నారమ్మా!"

"ఎవరు? "

"శివయ్యగారు" అని చెప్పాడు అటెండరు రహస్యంగా.

ప్రతినిధివర్గానికి పరిస్థితి అర్థమైంది. శివయ్య ఆదేశాలకు లోబడి పనిచేస్తోన్న రెవిన్యూ అధికారి వల్ల తమకు ఎలాంటి ప్రయోజనం వుండదని నిర్ణయించుకొని వాళ్ళంతా కుర్చీల్లోంచి లేచి ధర్నా శిబిరానికి వెళ్ళిపోయారు విసురుగా.

ప్రతినిధివర్గం ఆర్డీఓను కలిసి రాగానే చర్చల సారాంశం తెలుస్తుందని వాళ్లకోసం జనం ఆసక్తిగా ఎదురుచూస్తున్నారు.

చైతన్య అక్కడికి చేరుకుని మైకును అందుకున్నాడు. ఆర్డీఓ తమను కలిసేందుకు నిరాకరించటం, ఆయన ఛాంబర్లో శివయ్య కూడా వుండి కథ నడిపించటం వరకు అన్నీ వివరంగా ప్రజలకు చెప్పాడు.

చైతన్య అలా చెప్పగానే అక్కడున్న వేలాదిమంది కార్మికులు ప్రభుత్వ విధానాలకూ, శివయ్యకూ వ్యతిరేకంగా పెద్ద పెట్టున నినాదాలు ప్రారంభించారు. ఆగ్రహంతో రెచ్చిపోతూ పోటెత్తిన ఆ జనసముద్రం ఉప్పెనలా విరుచుకుపడి రెవిన్యూ కార్యాలయం దగ్గర, గాంధీ విగ్రహం పక్కన ఆంజనేయ స్వామి గుడి దగ్గర, పురపాలక సంఘంవారి బడి దగ్గరా వున్న శివయ్య బ్రాందీషాపుల మీద దాడిచేశారు.

షాపుల అద్దాలు భళ్లున పగిలిపోతు న్నాయి. మద్యం సీసాలను నడివీధిలో గుట్టలు పోసి కర్రలతో బాది, పగులగొట్టి నిప్పంటించగానే మంటలు నాలుకలు చాపి పైకి లేస్తోంటే ఆ మంటల వెలుతుర్లో గాంధీ విగ్రహం అరుణవర్ణమై దివ్యంగా మెరుస్తోంది.

మరికొంతమంది ఐక్యవేదిక కార్యకర్తలు రణ నినాదాలు చేస్తూ తూర్పు కొండలవే పుకు సుడిగాలిలా సాగివెళ్ళి అక్కడ అడ విలో వున్న గాంధీ సారాబట్టీలను ధ్వంసం చేశారు. బెల్లం వూటను నిలువచేసిన బానల్ని పగులగొట్టారు. బెల్లం వూట పాయలుగా ప్రవహిస్తూ, మండుతోన్న బట్టీ లను ఆర్పివేస్తోంటే- అప్పటికే తయారై కుండల్లో భద్రపరచిన సారాకు నిప్పంటిం చారు.

తరతరాల దరిద్రంలా సారా దగ్ధమవు తోంటే ఆనందంతో కేరింతలు కొడుతు న్నారు వాళ్ళు.

గాంధీ సారా బట్టీలనూ, శివయ్య బ్రాందీ షాపులనూ కార్మికులు అలా ధ్వంసం చేస్తోంటే పోలీసులు రంగంలోకి దిగి లాఠీ ఛార్జితో ప్రతిఘటన మొదలుపెట్టి బాష్పవా యువును కూడా ప్రయోగించారు. అయినా ప్రయోజనం కనిపించలేదు. జనం మరిం తగా రెచ్చిపోతూ ప్రభుత్వ ఆస్తులకు కూడా నష్టం కల్గిస్తోంటే అప్పుడు మాత్రమే జిల్లా కలెక్టరు రూపంలో ప్రభుత్వం ప్రజల దగ్గ రకి వచ్చింది.

అటు పోలీసులనూ, ఇటు ఐక్యవేదిక కార్యకర్తలనూ శాంతపరిచి కార్మికుల ప్రతిని ధివర్గాన్ని చర్చలకు ఆహ్వానించాడు జిల్లా కలెక్టరు. ఉద్రిక్తత క్రమంగా సడలిపో యింది. కార్మికులంతా తిరిగి ధర్నా శిబిరం దగ్గరికి వెళ్ళి ప్రశాంతంగా కూర్చున్నారు.

జిల్లా కలెక్టరుకూ, ఐక్యవేదిక ప్రతినిధివ ర్గానికీ మధ్య చర్చలు మొదలయ్యాయి.

"...కార్మికుల ప్రయోజనాలకోసం మీరు ఆందోళన చెయ్యటం తప్పేం కాదుకానీ ఇలా ప్రభుత్వ ఆస్తుల్నీ, ప్రైవేటు ఆస్తుల్నీ ధ్వంసం చెయ్యటం బాగుందా మీరే చెప్పండి? " అని చాలా శాంతంగానే అడి గాడు కలెక్టరు.

"మా కార్మికులను రెచ్చగొట్టింది ప్రభు త్వమే! మా కోర్కెలు ఏమిటో వినకుండా మమ్మల్ని కలిసేందుకే మీ అధికారులు నిరాకరించారు శివయ్య ప్రోద్బలంతో అలా విధ్వంసాన్ని అనివార్యం చేస్తోంది ప్రభు త్వమే. శాంతియుత పోరాటాలు ప్రభుత్వా నికి దున్నపోతుమీద వాన కురిసినట్టే. అది కించిత్తు కూడా చలించదు. సహనం కోల్పో యిన జనం విధ్వంసానికి దిగి ఆస్తులూ, ప్రాణనష్టం జరిపితేనే తప్ప అది కదలదు. ప్రభుత్వ విధానం అలా పునరావృతమ వుతూ దశాబ్దాల స్వతంత్ర భారత చరిత్ర నేర్పిన పాఠం విధ్వంసం!" అన్నాడు చైతన్య.

"అది అలా కొనసాగాల్సిందేనా? "

"అది నిర్ణయించాల్సింది ప్రభుత్వమే కానీ ప్రజలు కారు"

"ప్రభుత్వ ఆస్తులంటే మీవేకదా? వాటిని ధ్వంసం చెయ్యటంలో అర్థంలేదే!"

"ఆస్తులేకాదు, ప్రభుత్వం కూడా ప్రజలదే! ఆచరణలో కూడా ప్రభుత్వం అలా వున్న ప్పుడు విధ్వంసమూ వుండదు. మా ఓట్లతో ఎన్నికైన ప్రభుత్వం మాకు వ్యతిరేకంగా దోపిడివర్గాల కొమ్ము కాచినప్పుడే వివాదా నికి తావుంటుంది" అన్నాడు చైతన్య.

కలెక్టరు ఒక నిముషం మౌనంగా ఏదో ఆలోచించాడు. తలెత్తి ప్రతినిధివర్గం వేపు చూస్తూ "సరే... ఆ విషయం అలా వుంచి మీ సమస్య ఏమిటో చెప్పండి" అన్నాడు వేళ్తో నొసలు రాసుకుంటూ.

తన చేతిలో వున్న విజ్ఞప్తి పత్రాన్ని కలె క్టరుకు అందిస్తూ "సార్! ప్రభుత్వం చెయ్య కూడని పనులు చెయ్యాలని ఎవరైనా



ఆందోళన చేస్తే అది అర్థరహితం అవుతుంది కానీ మా పోరాటాలు అలాంటివి కావు సార్! ఉదాహరణకు దొంగ సారాబట్టీలను ధ్వంసం చేసి సారాకుండలను పగుల గొట్టటం, నేరస్థులను అరెస్టు చెయ్యటం ప్రభుత్వం చెయ్యాల్సిన పని! కానీ ఎక్సయిజు అధికారులకు ముడుపులు చెల్లించి గాంధీ యధేచ్ఛగా సారా బట్టీలు పెట్టినా వాళ్లు పట్టించుకోకపోతే ఈరోజు కార్మికులే బట్టీలను అలా ధ్వంసంచేసి ప్రభుత్వం చెయ్యాల్సిన పనిని వాళ్లే చేశారు. అలాగే టాక్సులు చెల్లించకుండా శివయ్య దొంగ మద్యం అమ్ముతున్నా ప్రభుత్వం పట్టించుకోలేదు కనుకనే ఆ ప్రభుత్వం చెయ్యాల్సిన విధిని ఈరోజు ప్రజలే నిర్వర్తించారు.

"సార్, కలెక్టరుగారూ! కార్మికులకు చెందవలసిన ఇళ్లస్థలాలను అర్హులైన కార్మికులకు మాత్రమే ఇవ్వటం ప్రభుత్వం చేయవలసిన పనే! కానీ ఇక్కడ అందుకు భిన్నంగా జరిగింది సార్! చాలా స్థలాల్ని గూండాలు కైంకర్యం చేసుకున్నారు. వాటిపై సమగ్రమైన దర్యాప్తు జరిపించి వాటిని తిరిగి స్వాధీనం చేసుకొని కార్మికులకు ఇవ్వమనే మా అభ్యర్థన!"

"గూండాలు కైంకర్యం చేసుకున్న విషయం మీరు నిరూపించగలరా? "

"నిరూపించగలం"

"వాళ్లంతా ఎవరు? "

"శివయ్యగారి ఆస్థాన గూండాలే!" అన్నాడు చైతన్య.

కలెక్టరు మళ్ళీ వేల్తో నొసలు రాసుకుంటూ "అలాగైతే త్వరలోనే విచారణ జరిపించి, స్థలాలను వారినుండి స్వాధీనం చేసుకుంటాం. కార్మికులకే చెందేలా చూస్తాం. అంతవరకూ మీరు దయచేసి ప్రశాంతంగా వుండండి" అన్నాడు శూన్యంలోకి చూస్తూ.





"అంతవరకు అంటే ఎంతవరకు? మీరు విచారణ జరిపించి కార్మికులకు న్యాయం చెయ్యటానికి ఎంతకాలం పట్టవచ్చు? " అప్పటిదాకా వాళ్ల మాటల్ని మౌనంగా వింటూ కూర్చున్న సుందరి అప్పుడు అడిగింది కలెక్టర్ని ఉద్దేశిస్తూ.

కలెక్టరు తాత్త్వికంగా నవ్వాడు. "మీరు సమస్యల్ని ఒకే కోణంనించి ఆలోచిస్తున్నారు కానీ మాలాంటి వాళ్లను గురించి ఆలోచించరు. నేను ఐఎఎస్ మొదటి ప్రయత్నంలోనే పాసయ్యాను. నాలాంటివాళ్లు ఈ దేశంలో చాలామంది వున్నారు. అలాంటి మేము దొంగ ఓట్లతో, బాంబులతో, రిగ్గింగులతో, పోలింగు బూతుల ఆక్రమణతో, ప్రత్యర్థుల హత్యలతో ఎన్నికల్లో గెలిచి మంత్రులు అయ్యే నేరచరితుల ముందూ, గూండాలముందూ ఖూనీకోరుల ముందూ చేతులు కట్టుకొని నిలబడితీరాలి. వాళ్లు చెప్పింది చెయ్యాలి. వాళ్లు అజ్ఞానంతో మా ముఖాలమీదికి ఫైళ్లు విసిరినా చిర్నవ్వులు నవ్వుతూ ఫైళ్లను జాగ్రత్తగా ఏరి భద్రం చెయ్యాలి. నిజం చెప్పాలంటే మీకున్న స్వతంత్రం కూడా మాకుండదు. మిమ్మల్ని చూసి గోప్యంగా అసూయపడుతుంటాం కూడా. మీ పోరాటాలపట్ల మాలాంటివాళ్లకు సానుభూతి వున్నా మావల్ల మీకు పరిమితమైన ప్రయోజనం మాత్రమే సమకూరుతుంది. మా హోదా, ప్రభుత్వ వాహనాల్లో కంగాళీ క్యాంపులూ, మా ఫైళ్లూ, సూటూ బూట్లూ, మా ముఖాలమీది చిర్నవ్వులూ అంతా ట్రాష్. నటన! బూటకం! నిశానీదారులూ, వీధిరౌడీలూ మంత్రులైతే వాళ్లముందు 'జీ హుజూర్' అంటూ ఒంగి నిలబడే మా దౌర్భాగ్యానికి అంతరంగంలో ఆవేదన పడుతూ పైకి మాత్రం గాంభీర్యం నటించటం పరిణతి లేని ప్రజాస్వామ్యం మాకిచ్చిన శాపం! అఫ్‌కోర్స్... కలెక్టరుగా నిజానికి మీకు చెప్పకూడదుకానీ ఆవేదన నాతో అలా మాట్లాడించింది. సరే. ఆ విషయాలు అలా వుంచండి. కార్మికుల ఇళ్ల స్థలాల విషయంలో మీకు న్యాయం జరిగి

తీర్తుంది. నామాటమీద విశ్వాసం వుంచి మీరిక ఆందోళన విరమించండి" అన్నాడు కలెక్టరు.

"మీరిలా హామీ ఇచ్చినట్లు మేము ప్రజలకు చెప్పవచ్చునా? " అని అడిగింది సుందరి.

"అభ్యంతరం లేదు" అని చర్చలను ముగించాడు కలెక్టరు.

కార్మికుల ఐక్యవేదిక ప్రతినిధి వర్గం చర్చలు ముగియగానే ధర్నా శిబిరం దగ్గరికి వెళ్ళింది. వాళ్లకోసమే ఆసక్తితో ఎదురుచూస్తోన్న కార్మికులకు కలెక్టరుతో జరిగిన చర్చల సారాంశం వివరించి చెప్పాడు చైతన్య.

కార్మికులు ఆనందంతో పొంగిపోయారు. కలెక్టరు ఇచ్చిన హామీ తమ తొలివిజయంగానూ, ఆ తొలివిజయం మహత్తరమైన విజయాలకు సోపానంగానూ భావించి వాళ్లంతా జయజయధ్వానాలు చేశారు.



తన బ్రాందీషాపులమీద దాడి జరిగినప్పుడే కార్మికులను తన అనుచరులతో ప్రతిఘటించాలని ఆవేశంలో శివయ్య అనుకున్నా ఆ ఆవేశం క్షణంలోనే చల్లారింది. అలాంటి సమయంలో గూండాలతో వాళ్లను ఎదుర్కోటం అంత తేలిక విషయం కాదు. కార్మికులు ఎక్కువ సంఖ్యలో వున్నారప్పుడు. ఒకవేళ ప్రతిఘటనలో పైచేయి తనదే అయినా దాని ప్రభావం యూనియన్ ఎన్నికలమీద పడితీరుతుంది. ఆ ఎన్నికలను సవాలుగా తీసుకొని విజయం కోసం కృషిచేస్తోన్న శివయ్య అలా కార్మికవర్గానికి దూరం కాలేకపోయాడు. అతడి రాజకీయ విజ్ఞత అలా అతడ్ని హెచ్చరించి శాంతపరిచింది. అందుకే అతను ముందుకు దూకబోయిన గబ్బర్ బృందాన్ని అతికష్టం మీద వారించాడు.

ఎవరో లోపలికి వచ్చి చెప్పారు. "గాంధీ గారు వచ్చారు" అని.

"లోపలికి పంపించు!" అన్నాడు శివయ్య.

గాంధీ లోపలికి వస్తోనే చిర్రుబుర్రులాడుతూ ఇంత ఘోరం జరిగి, నా సారా బట్టీలూ, మీ బ్రాందీషాపులూ ధ్వంసమైనా తాపీగా ఎలా వున్నారండీ శివయ్యగారూ? సమయానికి నేను ఊళ్లో లేను కనుక సరిపోయింది గానీ లేకపోతే చేతులు ముడుచుకుని కూర్చునేవాడ్నే కాదు. రామ్మూర్తిని ఆస్పత్రి నుంచి బైటికి రాకుండా చేస్తే మనకిక ఎదురుండదన్నారు. రామ్మూర్తి లేకపోయినా కార్మికులు మనమీద అలా ధ్వజమెత్తితే ఇక మనకు భవిష్యత్తు ఏముంటుంది చెప్పండీ..." అన్నాడు అసహనంగా.

శివయ్య చిర్నవ్వు నవ్వాడు. "గాంధీ గారూ, ఆవేశం నాయకత్వపు లక్షణం కాదు. జరిగిందాన్ని గురించి నేనేమీ ఆలోచించలేదంటారా? అలా ప్రశాంతంగా ఒక్క నిమిషం కూర్చోండి" అన్నాడు ముఖంమీద మరిన్ని నవ్వులు పులుముకుంటూ.

గాంధీ కుర్చీలో కూర్చున్నాడు. శివయ్యవేపే చూస్తూ, "మీరుఏం ఆలోచించారో గానీ వాళ్లలా బరితెగించి షాపుల్ని, సారా బట్టీలనూ ధ్వంసం చేస్తే మన వైపునుంచి ప్రతిఘటన అన్నదే లేకపోతే వాళ్లకు మనం అలుసుకామటండీ? కనీసం కేసులైనా పెట్టించి పనిలోపనిగా చైతన్యను అరెస్టు చేయిస్తే యూనియన్ ఎన్నికల్లో మనకు అడ్డం లేకుండా పోయేవాడు కదా!" అన్నాడు.

"అలా చేస్తే చైతన్య జైల్లో కూర్చునే గెలవటం ఖాయం! ఏదైనా నిర్ణయాలు తీసుకునేముందు ఆలోచించటం అలవాటు చేసుకోండి గాంధీగారూ! చైతన్యను అరెస్టు చేయిస్తే కార్మికులు మరింత రెచ్చిపోతారు. పనికట్టుకుని మనల్ని ఓడిస్తారు. అందుకే హోంమంత్రితో ఫోన్లో చర్చించాను! ఆయన ఎస్. పి. తో మాట్లాడాడు. మనం ఈ విషయంలో కేసులదాకా వెడితే నీ దొంగసారా

బట్టీల విషయం, మా అక్రమ మద్యం అమ్మకాల విషయం బైటికి వస్తుందనే పోలీసులు కేసులు పెట్టలేదు. ఆ విషయమే చెప్పాడు హోంమంత్రి. ఈ సంఘటనను రాజకీయం చేసి ఇంకో విధంగా ప్రయోజనం పొందమని సలహా ఇచ్చాడు. బాగా ఆలోచించి ఒక పథకం వేశాను"

"ఏమిటా పథకం? " అడిగాడు గాంధీ.

"మన షాపులకు రక్షణ కల్పించటంలో విఫలమైన పోలీసులకు వ్యతిరేకంగా మా పార్టీ తరపున నేను బందుకు పిలుపు ఇస్తాను"

"మా పార్టీ తరపున నేను మీ బందుకు మద్దతు ప్రకటించమంటారా? "

"కాదు! మీ పార్టీ తరపున మీరు బందును వ్యతిరేకించాలి!" గాంధీ శివయ్య వేపు ఆశ్చర్యంగా చూశాడు.

"...అవునండీ గాంధీగారూ... అదే రాజకీయమంటే! మీరూ బందును సమర్థిస్తే బందు జయప్రదంగా జరుగుతుంది కానీ ఘర్షణలకు తావుండదు. ఘర్షణలకు తావుండకపోతే బందు జరిపినందువల్ల మనకు ఎలాంటి ప్రయోజనం వుండదు"

"అంటే? "

"మేము షాపులు మూయిస్తాం. మీరు తెరిపిస్తారు. మా క్రియాశీల కార్యకర్తలూ, మీ క్రియాశీల కార్యకర్తలూ వీధుల్లో తారసపడతారు. బందు అనుకూల, వ్యతిరేకవర్గాల మధ్య యుద్ధం జరుగుతుంది. బందు పిలుపును గౌరవించిన వాళ్ళషాపుల తాళాలు పగులగొట్టి మీవాళ్ళు దోచుకుంటారు. బందు పిలుపును గౌరవించకుండా తెరిచి వుంచిన షాపులను మావాళ్ళు దోచుకుంటారు. ముఖ్యంగా మన ఉభయవర్గాల దృష్టి మెయిన్‌రోడ్డులో వున్న బంగారం కొట్లమీద కేంద్రీకరిద్దాం. దాంతో మనకూ, మన క్రియాశీల కార్యకర్తలకూ ఆర్థికపరంగా వున్న తక్షణ అవసరాలు తీరిపోతాయి.





సారాబట్టీల్లో మీరు నష్టపోయింది బందు ద్వారా పూడ్చుకోవచ్చు. అలాగే బ్రాందీషాపుల్లో నేను పొందిన నష్టాన్ని పూడ్చుకుంటాను. పైగా మనం యూనియన్ ఎన్నికల్లో చాలా డబ్బు తగలెయ్యాలికదా..." అన్నాడు శివయ్య.

శివయ్య అద్వితీయమైన ఆలోచనాశక్తికి ఆశ్చర్యపోయాడు గాంధీ! గ్రామ కట్టుబాట్లకు భయపడి ఊరికి దూరంగా పట్నంలో వుంటూ మద్యం కూడా రహస్యంగా తాగిన ఆనాటి శివయ్యేనా ఇతను? అన్నంత విస్మయంగా చూస్తూ మౌనంగా కూర్చున్నాడు.

కొంతసేపటికి అతని కోపం పూర్తిగా చల్లారిపోయింది. "సరే... అలాగైతే బందు పిలుపు ఎప్పుడిస్తారు? " అని అడిగాడు నెమ్మదిగా.

"రేపు రాత్రికే మా పార్టీ క్రియాశీల కార్యకర్తల సమావేశం జరుపుతాను. గబ్బర్ బృందం మొత్తం యూనియన్ ఎన్నికల హడావుడిలో వుంది. మనం అనుకున్న స్థాయిలో బందు జరిగి, ఘర్షణలు, దోపిడీలూ యథేచ్ఛగా సాగాలంటే ఇంకా కొంతమంది రౌడీల సహకారం కూడా అవసరం! ఎలాగైనా అందర్నీ రేపటికల్లా సమావేశపరుస్తాను. ఆ సమావేశంలో నిర్ణయం తీసుకొని రెండు, మూడు రోజుల్లోనే బందు జరిపిస్తాను" అన్నాడు శివయ్య.

"మరి మేం కూడా సమావేశం జరపాలి కదా? బందును వ్యతిరేకించాలికదా? ఆ పని ఎప్పుడు చెయ్యమంటారు? " అడిగాడు గాంధీ.

"మా బందు ప్రకటన వెలువడగానే!"

★ ★ ★

రాత్రి పది గంటలైంది. రమణి హుందాగా నడుస్తూ సర్జికల్ వార్డుగుండా వెళ్ళి రామ్మూర్తి గదిముందు ఆగి పరిసరాలను కలియచూసింది. అప్పటికే ఆస్పత్రిలో ఎక్కడా జన సంచారం లేదు. రోగులూ, వారి అటెండర్లు విశ్రాంతిగా పడుకుని నిద్రలోకి జారుకున్నారు. వార్డుల్లో విద్యుద్దీపాలు

మందంగా వెలుగుతున్నాయి. డ్యూటీ సిబ్బంది ఎక్కడివాళ్లక్కడ కుర్చీల్లో కూర్చుని బల్లలమీద తలలు పెట్టుకుని కలత నిద్రపో తున్నారు.

రామ్మూర్తి గదిముందు స్టూలుమీద కూర్చుని కునికిపాట్లు పడుతున్నాడు కానిస్టే బులు ఏసుపాదం. రోజూ అక్కడ రాత్రివే ళల్లో కాపలా వుండే మరొక కానిస్టేబులు కనిపించలేదు.

రోజారమణి స్టూలు దగ్గరికి వెళ్లి నిలబడి చిన్నగా దగ్గింది. ఆ చప్పుడుకు ఉలిక్కిపడి కళ్లు తెరిచి చూశాడు ఏసుపాదం.

ఎదురుగా కనిపించిన నర్సును చూస్తూ ఆవులించాడు.

"భోజనమైందా? " అడిగింది రోజార మణి.

"ఇంకా లేదు. కానిస్టేబులు వెంకటస్వామి భోజనం చేసి వస్తానని వెళ్ళాడు. వాడుట్టి తాగుబోతు వెధవ! ఎంత తాగేడో ఏమో కాని ఇంటికి వెళ్లి వాంతులు చేసుకుని పడు కున్నాట్ట. వాళ్ల అబ్బాయి ఇప్పుడే వచ్చి చెప్పి వెళ్లాడు. వాడికి ఆ నిషా ఎప్పుడు దిగుతుందో వాడు వస్తేనే కానీ నేను వెళ్లేం దుకు వీల్లేదు" అని చెప్పాడు ఏసుపాదం.

రోజారమణి నాలుగు అడుగులు వేసి రామ్మూర్తి గది తలుపులు తోసింది. లోప లికి వెడుతూ, ఒక్కక్షణం ఆగి, ఏసుపాదం వేపు చూస్తూ

"అతను వచ్చేదాకా మీరు భోజనం చెయ్య కుండా ఆకలితో ఎలా వుంటారు! పోనీ... మీకు అభ్యంతరం లేకపోతే ఒకపని చెయ్యండి. ఈరోజు నా పుట్టినరోజు. స్పెష ల్‌గా కోడికూర కూడా వండాను. నా ఫ్రెండు మరో నర్సుకోసం భోజనం తెచ్చాను. తీరా చూస్తే ఆమె ఈరోజు డ్యూటీకి రాలేదు. తెచ్చింది వృధా కాకుండా మీరు తినవచ్చు" అని అతని సమాధానం కోసం కూడా ఎదురుచూడకుండా గదిలోకి వెళ్ళిపోయింది రమణి.

ఆమెను చూడగానే హడావుడిగా మంచం మీంచి లేచి కూర్చున్నాడు రామ్మూర్తి. "అంతా సవ్యంగానే జరుగుతుందా? అవాం తరాలు ఎదురు కావుకదా? " అడిగాడు ఆమె ముఖంలోకి ఆత్రంగా చూస్తూ.

"అంతా అనుకున్నట్లే జరుగుతుంది. కంగారేం లేదు" అంది రమణి సిరంజికి నీడిల్ను ఫిక్సుచేస్తూ.

"శివయ్యవర్గంవాళ్లు బాంబులు ఎక్కడ దాచారో తెలిసిందా? " మళ్ళీ అడిగాడు రామ్మూర్తి.

"తెలిసింది"

"గబ్బర్ ముఠా ఎక్కడుంది? "

"ఒక్క నిముషం... అన్నీ వివరంగా చెప్తాను!" అని రమణి బ్యాగ్‌లోంచి సిరంజి తీసింది.

రమణి అతనివేపైనా చూడకుండా మౌనంగా తనపని ముగించుకుంది. సిరంజిలో రక్తాన్ని రామ్మూర్తి తలకు కట్టివున్న బ్యాండేజి మీదికి పుష్ చేసింది.

రామ్మూర్తి ఆమె చర్యల్ని ఆశ్చర్యంగా గమనిస్తోన్నాడు.

"రామ్మూర్తిగారూ! మీరిక మంచంమీద కదలకుండా పడుకోండి. మీరు మత్తు ఇంజ క్షను ప్రభావానికి లోనై స్పృహలో లేరన్న మాట. కాపలా పోలీసును నేనెలాగోలా ఇక్కడ్నించి తప్పించి దూరంగా తీసుకొని వెడతాను. అక్కడ అతడ్ని మాటల్లో పెట్టి కదలకుండా చేస్తాను. కానిస్టేబులుకు అను మానం రాకుండా మేము వెళ్ళేప్పుడు మీ గదికి బైట తాళంపెట్టి వెళ్తాం. మేము వెళ్ల గానే మీరు లేచి అదిగో... ఆ వెనుక వున్న కిటికీ గుండా బైటపడండి. అక్కడినించి గోడవారగా నిచ్చెన వుంది. దానిమీంచి కిందికిదిగి వెళ్ళి మీ పనులు పూర్తి చేసుకొని సాధ్యమైనంత త్వరగా తిరిగి అదే దారి గుండా గదిలోకి వచ్చి మంచంమీద పడు కోండి. మీ కదలికల్ని నేను గమనిస్తూనే వుంటాను. మీరు తిరిగిరాగానే నిచ్చెనను



అక్కడ్నించి తొలగిస్తాను. నిషాలో వున్న మరో కానిస్టేబులు నిషానించి తేరుకుని వస్తే మాత్రం మనం చిక్కుల్లో పడతాం...

"నేను త్వరగానే తిరిగి వచ్చేస్తాను కానీ ఇంతకూ వాళ్లు బాంబుల్ని ఎక్కడ దాచారో, గబ్బర్ బృందం ఎక్కడ వుందో చెప్పండి. నాకు ముఖ్యంగా కావాల్సింది శాయి!" అన్నాడు రామ్మూర్తి.

రమణి అతనికి రహస్యంగా అన్ని వివరాలూ చెప్పింది. అతడ్ని మంచంమీద నిశ్చలంగా పడుకోమని చెప్పి గది బైటవున్న కానిస్టేబుల్ను కేకేసి లోపలికి పిల్చింది.

కానిస్టేబులు ఏసుపాదం హడావుడిగా లోపలికి వచ్చి రామ్మూర్తిని చూసి "ఏమైంది? ఆ రక్తం ఏమిటి? " అని అడిగాడు నర్సును.

"అదా... మంచంమీంచి దిగబోతూ పొరపాటున తూలిపడ్డాడు. తల గాయం మళ్ళీ రేగి రక్తం కార్తోంటే బ్యాండేజి వేసి ఇప్పుడే మత్తు ఇంజక్షను చేశాను. తెల్లవారేదాకా స్పృహలోకి రాకపోవచ్చు" చెప్పింది రోజారమణి.

"ప్రమాదం లేదుకదా? "

"అబ్బే.. చాలా చిన్న విషయం!" అని కానిస్టేబులువేపు చూస్తూ "ఇక మనం వెళ్దామా? " అంది రమణి.

ఏసుపాదం ఎందుకో తటపటాయించాడు. రమణికి ఎలాంటి సమాధానమూ చెప్పకుండా మంచంమీద నిశ్చలంగా పడివున్న రామ్మూర్తినే చూస్తూ నిల్చున్నాడు.

"ఓ... అదా మీ అనుమానం! మరేం భయంలేదు. పేషంటు ఎట్టి పరిస్థితుల్లోనూ తెల్లవారేదాకా స్పృహలోకి రాడు. చాలా రక్తం పోయింది. కనుక నీరసంగా వున్నాడు. పైగా మత్తు ఇంజక్షను కూడా చేశాను" అని ఒక్కక్షణం ఆగి ఏదో గుర్తొచ్చినట్టే కానిస్టేబులుతో అంది-

"ఎందుకైనా మంచిది. మనం వెళ్లేటప్పుడు గదికి తాళంవేసి వెళ్దాం. మీరు రావటం కొంచెం ఆలస్యమైనా అప్పుడు ఆందోళన వుండదు మీకు" అంటూనే ఆమె బైటికి దారితీసింది.

సందేహం తీరిన కానిస్టేబులు ఆమె వెనుకే బైటికి నడిచాడు. నర్సు గది తలుపులు వేసింది. గడియపెట్టి తాళంవేసి తాళం చెవిని అతనికిచ్చింది. అతను తాళం చెవిని జేబులో వేసుకొని మౌనంగా ఆమె వెంట నడవసాగాడు.

మంచంమీద అంతవరకు కదలకుండా పడుకున్న రామ్మూర్తి చివాల్న లేచాడు. కిటికీగుండా బైటికి జారేడు.

అక్కడ గోడకు ఆన్చిపెట్టిన నిచ్చెనమీంచి నిశ్శబ్దంగా కిందికి దిగి చుట్టూ ఒకసారి కలియచూశాడు. ఎవ్వరూ తనను గమనించలేదని నిర్ధారించుకుని వేగంగా నడుస్తూ స్టాఫ్ క్వార్టర్సు పక్కనే వున్న వెనుక దారిగుండా ఆస్పత్రి ఆవరణ దాటి బైటికి వెళ్లిపోయాడు.

★ ★ ★

అయ్యరు హోటలు పక్కనే వున్న గుడిసెలో చాలా సేపటినించి గబ్బర్‌కోసం ఎదురుచూస్తూ కూర్చున్నాడు శాయి. అంత ఆలస్యమైనా ఇంకా అతను వస్తోన్న జాడే లేదు. అసహనంగా గుడిసెలో అటూ ఇటూ పచార్లు చేస్తూ ఆలోచించసాగాడు శాయి.

ఒక్కో నిముషం గడుస్తున్నకొద్దీ అతనిలో అలజడి అధికమవుతోంది.

ఒకవేళ గబ్బర్ ఇంకా కొన్ని బాంబుల్ని వేస్తుంటే పోలీసులు పట్టుకున్నారా? అన్న ఆలోచన కూడా వచ్చింది. కానీ అంతలోనే తన భయానికి హేతువు లేదనీ, తను తప్పుగా ఆలోచించాననీ గ్రహించి అసంకల్పంగానే చిర్నవ్వు నవ్వాడు.

'శివయ్యలాంటి రాజకీయ నాయకుడి పక్షాన పనిచేస్తోన్న కార్యకర్తలను పోలీసులు ఎందుకు పట్టుకుంటారు!' అనుకుని నిబ్బరపడ్డాడు శాయి.

గుడిసెలో ఉబుసుపోక నెమ్మదిగా బైటికి





వచ్చి వీధికేసి చూపులు సారించాడు.

సరిగ్గా అప్పుడే గబ్బర్ జీపు వేగంగా వచ్చి అక్కడ ఆగింది. గబ్బర్ కిందికి దిగాడు. "నువ్వు గుడిసెలోకి వెళ్ళి అక్కడున్న పెట్టెల్ని కూడా జీపులోకి చేర్చు" అని డ్రైవర్ను ఆదేశించాడు.

డ్రైవరు స్టీరింగు మీంచి చేతులు తొలగించి కిందికి దిగి గుడిసెలోకి వెళ్ళాడు. ఒక్కొక్క అట్టపెట్టెనే జాగ్రత్తగా తెచ్చి జీపులో పెట్టాడు.

శాయి చెయ్యి పట్టుకుని గుడిసె లోపలికి నడిపించాడు గబ్బర్. ఇద్దరూ లోపలికి వెళ్ళగానే "శాయీ! సాధారణంగా రాజకీయాలవాళ్లు ఎలక్షన్లలో ప్రత్యర్థుల్ని భయపెట్టేందుకు వినియోగించే మామూలు బాంబులే కాకుండా మన దగ్గర ఇప్పుడు శక్తివంతమైన బాంబులు కూడా వున్నాయి. ఎన్నికల్లో ముందుగా మనం మామూలు బాంబులు విసిరి ప్రత్యర్థులను భయపెడతాం. అలా వాళ్లు లొంగిపోకుండా ఎదురుతిరిగితే అసలు బాంబులతో మారణహోమం సృష్టిస్తాం. అది శివయ్యగారి నిర్ణయం! ఎన్నికల్లో మనం గెల్చితీరాలి. అందుకే ఎంతో శ్రమపడి బాంబుల్ని సేకరించాను" అన్నాడు గబ్బర్ గర్వం నిండిన కంఠంతో.

శాయికి అప్పుడు గుర్తొచ్చింది, "అన్నట్లు చెప్పటం మర్చిపోయాను. శివయ్యగారు మనకు కబురు పెట్టారు. కార్యకర్తల అత్యవసర సమావేశం ఏదో జరపాలిట. ఊళ్లో బందు కూడా జరిపించాలట" అన్నాడు శాయి.

"బందా... ఎందుకు? "

"వివరాలు తెలియవు"

గబ్బర్ ఒక్కక్షణం నిశ్శబ్దంగా ఆలోచించి- "సర్లే... అలాగైతే ఈ రాత్రికి నేను రహస్యంగా కొంతమందిని కలవాల్సి వుంది. నా పనులు నేను ముగించుకుని శివయ్యగారి దగ్గరికి వెళ్తాను. నువ్వు జీపులో తూర్పుకొండల దగ్గరికి వెళ్లు. కార్మికవాడకు అందుబాటులో బాంబుల్ని భద్రపరిచి అక్కడ్నించి నేరుగా శివయ్యగారి ఇంటికి వచ్చేసెయ్యి. యూనియన్ ఎన్నికలరోజు జరిగే పోలింగు సరళిని బట్టి అవసరమైతే కార్మికవాడనూ బాంబులతో ధ్వంసం చెయ్యాలి మనం" అన్నాడు గబ్బర్.

"సరే శివయ్యగారి ఇంట్లో కలుద్దాం!"

"బాంబుల్ని భద్రంగా చేర్చాక..." అంటూ గబ్బర్ హడావుడిగా ఆ పక్కనున్న గుడిసెవేపుకు వెళ్ళిపోయాడు.

శాయి గుడిసె తలుపు దగ్గరికి వేసి గొళ్లెం పెట్టి జీపు దగ్గరికి వెళ్ళాడు. జీపులో ఎక్కి కూర్చుంటూ తలతిప్పి చూశాడు. వెనుక సీట్లకింద మరికొన్ని అట్టపెట్టెలు కనిపించాయి. తన కాళ్లపక్కగా మరో పెట్టె కనిపించింది. దానిమీదనే చూపు నిలిపి సీట్లో సర్దుక్కూర్చుంటూ "కార్మికవాడ దగ్గరకి వెడదాం- పద" అన్నాడు డ్రైవర్తో.

జీపు నడిపేందుకు తన సీట్లో సిద్ధంగా కూర్చున్న డ్రైవరు జీపు స్టార్టుచేస్తూ "మనం ఎక్కడికి వెళ్లాలో, ఏం చెయ్యాలో అంతా నాకు గబ్బర్‌గారు చెప్పారు" అంటూనే జీపును ఒక్క కుదుపుతో ముందుకు దూకించాడు.

సుమారు పదిహేను నిముషాల ప్రయాణం తర్వాత జీపు కార్మికవాడకు సమీపంలోని తూర్పుకొండల దగ్గరికి చేరుకుంది జీపు వేగాన్ని పూర్తిగా తగ్గించి నెమ్మదిగా ముందుకు వెడుతూ, బాంబుల్ని దాచేందుకు అనువైన ప్రదేశం కోసం చూస్తున్నాడు శాయి, జీపులోంచి తల బైటికి పెట్టి.

"మనం ఇంకొంచెం ముందుకు వెళ్తే అక్కడ కొండల్ని తొలిచిన అగాధాలున్నాయి. అక్కడే ఎక్కడైనా స్థలం నిర్ణయించుకొని బాంబుల్ని దాచిపెట్టమని చెప్పారు గబ్బర్‌గారు" అన్నాడు డ్రైవరు ఏదో గుర్తొచ్చినట్టు.

మరో ఐదు నిముషాల్లో జీపు అగాధాల దగ్గరికి చేరుకుంది.

"జీపును పక్కకు తీసి ఆపెయ్యి" అని చెప్పాడు శాయి.

జీపు ఆగింది. ఏదో మానవాకారం మండుతోన్న కాగడాను చేత్తో పట్టుకుని అటే వస్తోంటే ఆ వస్తోంది శత్రువో, మిత్రుడో కూడా అర్థంకాక శాయి, డ్రైవరు సందిగ్ధంలో పడిపోయారు. శాయి కళ్లు విప్పార్చి ఆ ఆకారం వేపుకు పరీక్షగా చూశాడు. దృఢంగా, గ్రీకు శిల్పంలా నిల్చున్న ఆ ఆకారాన్ని కాగడా వెల్తుర్లో చూసి పోల్చుకున్న శాయి గుండె ఝల్లు మంది. అతను రామ్మూర్తి.

శాయి హడావుడిగా జేబులోంచి బటన్ నైఫ్ బైటికి తీసి రామ్మూర్తి మీదికి దూకేందుకు జీపులోంచి కిందికి గెంతబోతోంటే సరిగ్గా అప్పుడే రామ్మూర్తి మండుతోన్న కాగడాను జీపులోకి విసిరి అదేక్షణంలో పక్కకు గెంతి బంతిలా దొర్లుకుంటూ సాధ్యమైనంత దూరంగా వెళ్ళిపోయాడు.

రామ్మూర్తి విసిరిన కాగడా బాంబుల పెట్టెల్ని తాకింది. పరిసరాలు దద్దరిల్లిపోతూ భయంకరమైన విస్ఫోటనం జరిగి, జీపుతోపాటు శాయి, డ్రైవరు శరీరాలు కూడా తునాతునకలై శకలాలుగా గాల్లోకి ఎగిరి దూరంగా పడిపోతోంటే రామ్మూర్తి క్షణం ఆలస్యం చెయ్యకుండా ఆస్పత్రి వేపుకు సాగిపోయాడు వేగంగా.

కానిస్టేబులు వెంకటస్వామికి వాంతులు చేసుకొని అలా మంచంమీద విశ్రాంతిగా పడుకున్న చాలాసేపటికి మత్తు కొంచెం దిగింది. తల భారంగా వుంటే మంచంమీద అటూ ఇటూ పొర్లుతున్నాడు.

ఎక్కడో బాంబులు పేలిన చప్పుళ్లు విని పించి వెంకటస్వామి భార్యకు మెలకువ వచ్చి భర్తను తట్టి లేపుతూ "ఏవండీ! ఎక్కడో బాంబులు పేలినట్టుంది. మీరిలా డ్యూటీ నించి చెప్పాపెట్టకుండా వచ్చి తాగి పడుకుంటే ఎలా? అక్కడ ఏదైనా జరగరానిదే జరిగిందంటే ఉద్యోగానికి ఎంత ప్రమాదం" అంది విసుక్కుంటూ.

బాంబుల విషయం వినగానే వెంకటస్వామి ఉలిక్కిపడి లేచి కూర్చుంటూ "బాంబులు పేలేయా? " అని అడిగాడు ఆశ్చర్యంగా.

"అవును!" అందామె.

అతను హడావుడిగా మంచంమీంచి కిందికి దిగాడు. యూనీఫాం వేసుకుని ఇంట్లోంచి బైటికి వచ్చి, వాకిట్లో వున్న సైకిల్ స్టాండు తీశాడు. ఆవులిస్తూనే సైకిల్ ఎక్కి వేగంగా ఆస్పత్రివేపుకు సాగిపోయాడు.

ఏసుపాదాన్ని వెంటపెట్టుకుని వెళ్లిన రమణి అతడ్ని స్టాఫ్ వెయిటింగ్‌రూంలో కూర్చోపెట్టి చాలాసేపు కబుర్లతో కాలం వెళ్ళబుచ్చింది. అతను రెండు మూడుసార్లు నోరు తెరిచి "ఇక భోంచేస్తాను" అన్న తర్వాత గత్యంతరం లేక భోజనం పెట్టింది.

భోజనం చెయ్యగానే అతను రామ్మూర్తి గది దగ్గరికి వెళ్ళి జాగ్రత్త కోసం తలుపులు తెరిచి చూసినా ప్రమాదమే! అతను అస్పత్రి నుంచి రహస్యంగా బయటికి వెళ్ళిన విషయం కానిస్టేబులుకు తెలిసిపోతుంది. అందుకే సాధ్యమైనంత ఎక్కువ సమయాన్ని అతడితో మాటలతోనే గడిపి చివరికి భోజనం పెట్టింది. అతను భోజనంచేసి గది దగ్గరికి వెళ్ళేసరికల్లా రామ్మూర్తి తన పని ముగించుకొని వచ్చి గదిలో పడుకుంటే ఎలాంటి ఇబ్బందీ ఎదురుకాకుండా అంతా సవ్యంగా జరిగిపోతుంది కానీ అందుకు భిన్నంగా జరిగితే...

రమణి వళ్లు జలదరించింది. కానిస్టేబులు వెంకటస్వామి బహుశః ఏసుపాదం కోసమేనేమో, వెదుక్కుంటూ అటే వస్తూ దూరంగా కనిపించాడు.

"ఏమిటి అలా చూస్తున్నారు? " కంచంలో చెయ్యి కడుక్కుంటూ అడిగాడు ఏసుపాదం.





"మరి... మరేంలేదు, మీ కోసమే కానిస్టే బులు వెంకటస్వామి వస్తున్నట్టుంది" అంది రమణి.

ఏసుపాదం తలతిప్పి అటువేపు చూశాడు. అప్పటికే వెంకటస్వామి ఏసుపాదాన్ని చూసి దగ్గరికి వచ్చి "ఇక్కడున్నావా? రామ్మూర్తి గదికి తాళంవేసి వుంటే నీ కోసం వెదుకుతూ వస్తున్నాను" అన్నాడు వగరుస్తూ.

"నీ దారిన నువ్వెళ్లి తాగి ఇంట్లో పడు కుంటే నాకు భోజనం ఎలా? సమయానికి సిస్టర్ భోజనానికి పిల్చింది కనుక సరిపోయిందికానీ లేకుంటే ఆకలికి అల్లాడేవాడ్ని" అంటూ లేచి నిలబడి "వెళ్లొస్తానమ్మా..." అని రమణికి చెప్పి వెంకటస్వామి వెంట బయలుదేరాడు ఏసుపాదం.

రమణి గుండె వేగంగా కొట్టుకుంటోంది. "పదండి నేనూ వస్తాను. పేషంటు కండిషన్ చూడాలి!" అని ఆమె కూడా వాళ్ల వెంట నడవసాగింది.

ముగ్గురూ రామ్మూర్తి గదివేపుకు నడుస్తూంటే దారిలో ఏసుపాదంతో అన్నాడు వెంకటస్వామి, "ఎక్కడో పేలుళ్లు వినిపించాయట. బాంబులు పేలిన చప్పుళ్లే అంది మా ఆవిడ. మీరూవిన్నారా ఆ చప్పుళ్లు?"

"లేదే!" అన్నాడు ఏసుపాదం.

అలా ఇంకా ఏవేవో కబుర్లు చెప్పుకుంటూ వాళ్లంతా అక్కడికి వెళ్లారు. రామ్మూర్తి గది తాళం చేత్తో పట్టుకుని బలంగా లాగి చూశాడు ఏసుపాదం. అంతా సంతృప్తికరంగానే వుంది. జేబులోంచి తాళంచెవి బైటికి తీసి తాళం తెరిచాడు. గడియతీసి తలుపులు ముందుకు తోసి లోపలికి తొంగిచూశాడు.

రమణి శ్వాస పీల్చటం కూడా మర్చేపోయి ప్రాణాలు బిగపట్టి మౌనంగా నిల్చుంది. ఉత్కంఠతో నరాలు చిట్లిపోతాయా? అన్నంతగా ఉద్వేగం.

"పేషంటును చూడాలన్నారుకదా సిస్టర్! వెళ్ళి చూసిరండి" అన్నాడు ఏసుపాదం.

రమణి యాంత్రికంగా నడుస్తూ గుమ్మం దాటి గదిలోకి అడుగుపెట్టి చివాల్న తలెత్తి మంచంవేపుకు చూసింది. మంచంమీద నిశ్చలంగా పడుకుని వున్నాడు రామ్మూర్తి.

'హమ్మయ్య' అని ఊపిరి పీల్చుకుంది రమణి. అంతవరకూ ఊపిరి సల్పనీయకుండా వేధించిన ఉత్కంఠ క్షణంలో విచ్చిపోగా విప్పారిన ముఖంతో నిశ్శబ్దంగా మంచం దగ్గరికి వెళ్లి "అంతా సవ్యంగానే జరిగిందా?" అని అడిగింది.

"ఆహా! మీకు చాలా కృతజ్ఞుడ్ని" అన్నాడు రామ్మూర్తి చిన్నగా.

★ ★ ★

తెల్లవారుజామున ఫోను నిర్విరామంగా మోగుతుంటే శివయ్య విసుక్కుంటూ మంచం పక్కనే వున్న ఫోన్ను పైకి లేపి "హలో!" అన్నాడు ముఖం చిట్లిస్తూ.

"నేను... డి.ఎస్.పి.ని మాట్లాడుతున్నాను సార్!" అని ఫోన్లో అవతలివేపు నుంచి వినిపించింది.

"ఏమిటి విశేషం?" అడిగాడు శివయ్య.

"తూర్పుకొండల దగ్గర బాంబులు పేలి మీ అనుచరుడు శాయి చనిపోయాడు. జీపు ధ్వంసమైంది. డ్రైవరు కూడా మరణించాడు"

శివయ్య క్షణకాలం నిర్ఘాంతపోయాడు. "ఎలా జరిగింది?" అడిగాడు నెమ్మదిగా.

"జీపులో అక్రమంగా బాంబులు రవాణా చేస్తుంటే పేలిపోయి దుర్ఘటన జరిగినట్లు మా విచారణలో తేలింది. సంఘటన జరిగిన వెంటనే ఎస్.పి.గారు కూడా స్పాటుకు వచ్చారు. నెంబరు ప్లేటును బట్టి ఆ జీపు మీదే అని తెలిసింది. చనిపోయిన వ్యక్తులు కూడా మీ అనుచరులే కనుక న్యాయంగా మిమ్మల్ని కూడా విచారించాలి. కానీ మేము, మా పైఅధికారులు ఎలాగోలా కేసును మూసివెయ్యాలని నిర్ణయించుకున్నాం..."



"జీపులో మావాళ్లు వెళ్తోంటే కార్మికుల ఐక్యవేదిక కార్యకర్తలు బాంబులతో దాడిచేసినట్లు కేసుపెట్టే అవకాశం లేదా? " డి.ఎ స్.పి. చెప్తోంది పూర్తిగా వినకుండా మధ్యలోనే అడిగాడు శివయ్య.

"అవకాశం ఎందుకు ఉండదూ.. కానీ మరొకసారి ఎస్.పి.గారితో మాట్లాడండి. అవసరమైతే హోంమంత్రితో చెప్పించండి. అయినా మీకు తెలియంది ఏముంది సార్... రాజు తల్చుకుంటే దెబ్బలకు కొదవా!" అని గరగరా నవ్వాడు డి.ఎస్.పి.

"సరే... అలాగే మాట్లాడ్తాను. కానీ మీరొక పనిచెయ్యాలి మరి!"

"తప్పకుండా చేస్తాను. ఏం చెయ్యాలంటారు? "

"మా పార్టీ తరఫున ఐక్యవేదిక వాళ్లు బ్రాందీషాపుల్ని ధ్వంసం చేసినందుకు నిరసనగా ఎటూ ఊళ్లో బందు చెయ్యాలని నిర్ణయించాం. సరే... ఇప్పుడు ఈ సంఘటన కూడా జరిగింది కనుక బాంబుదాడికి వాళ్లే కారకులని, వాళ్ళని అరెస్టు చెయ్యాలనీ డిమాండు చేస్తూ వెంటనే బందు చేయిస్తాం. బందు సందర్భంగా వీధుల్లో తిరిగే మా క్రియాశీల కార్యకర్తలను పోలీసులు ఏమీ అనకుండా చూడాల్సిన బాధ్యత మీది. సాధ్యమైనంతవరకు బందు ముగిసేదాకా పోలీసులు డ్యూటీ చేస్తున్నట్లు నటించాలే తప్ప డ్యూటీ నిజంగా చెయ్యకూడదు. సరేనా..."

"ఓ... అదెంత భాగ్యం. అయినా మీరొక్కమాట మంత్రిగారి క్కూడా చెప్పండి సార్" అన్నాడు డి.ఎస్.పి.

శివయ్య ఫోన్ పెట్టేసి నిద్రకళ్లతోటే హడావుడిగా బయటికి నడిచి కారెక్కి కూర్చుని తనే డ్రైవు చేసుకుంటూ యూనియన్ ఎన్నికల కార్యాలయంవేపుకు సాగిపోయాడు. గబ్బర్ బృందం మరికొన్ని ముఠాలను కిరాయికి మాట్లాడి వాళ్లకు అక్కడ ఆశ్రయం కల్పించిన విషయం శివయ్యకు తెలుసు!

పూర్తిగా తెల్లవారి ఊరు నిద్రలేచింది! బాంబులు పేలి శాయి మృతిచెందిన వార్త అంచెలవారిగా ఊరంతా పాకింది. గబ్బర్ అనుచరులు జట్లు జట్లుగా రకరకాల వాహనాలలో కర్రలు, కత్తులు, సైకిల్ చైన్లూ పట్టుకొని వీధుల్లో సంచరిస్తున్నారు. వాహనాల్లోనే సారా, బ్రాందీ, విస్కీ ఎవరి అభిరుచి ప్రకారం వాళ్లు తాగుతూ సీసాలు కాళీ కాగానే రోడ్లమీదికి విసిరేస్తున్నారు. భళ్ళుభళ్ళున పగుల్తోన్న ఆ సీసా పెంకులు చెల్లాచెదురుగా పడుతోంటే జనం భయంతో పరుగులు తీస్తోన్నారు.

దుకాణాలు తెరిచి వ్యాపారం చేసుకుందామని వచ్చిన షాపు యజమానులు ఆ గొడవను గమనిస్తూ దుకాణాలు తెరవాలా? వద్దా? అన్న సందిగ్ధంలో పడి షాపుల దగ్గరే తచ్చాడుతూ భయం భయంగా చూస్తున్నారు.

కొంచెంసేపటికి శివయ్య పార్టీ జండాలు అలంకరించిన వ్యాన్లు కూడా వీధుల్లో సంచరించసాగాయి. వ్యాన్లలో వున్న మైకుల్లోంచి ఊరును హోరెత్తిస్తూ నినాదాలు... కేకలు... ఈలలూ.

"షాపులన్నీ మూసి అందరూ ఇళ్లకు వెళ్ళిపోవాలి. సోదరులారా! ప్రముఖ సంఘసేవకుడైన శాయిగార్ని గతరాత్రి ఐక్యవేదిక దుండగులు బాంబులతో దాడిచేసి దారుణంగా చంపినందుకు నిరసనగా బందు చేస్తున్నాం. అందరూ మాకు సహకరించాలి..." అని చెప్తోన్నారు మైకుల్లో.

ఆ వాహనాల నిర్విరామ సంచారం, మైకుల హోరూ, విధ్వంసానికి సమాయత్తమవుతున్న క్రియాశీల కార్యకర్తల ఉన్మాదం... భయంతో జనం బిక్కచచ్చి సందుగొందుల్లోంచి ఇళ్లకు చేరి తలుపులు బిడాయించుకుంటుంటే క్రమంగా వీధులన్నీ నిర్మానుష్యమవుతున్నాయి.




సరిగ్గా అప్పుడే గాంధీ పార్టీ వాహనాలు మైకులు కట్టుకొని వేగంగా వీధుల్లోకొచ్చాయి. జనంతో కిక్కిరిసిన లారీలు, వ్యాన్లూ, ఆటోరిక్షాలూ... ఆ వాహనాల బారుకు ముందున్న వ్యాన్లోంచి గాంధీ బందును వ్యతిరేకిస్తూ అనర్గళంగా ఉపన్యశిస్తుంటే వాహనాలు నెమ్మదిగా ముందుకు కదిలిపోతున్నాయి.

గాంధీ ఆవేశంగా మైకులో చెప్తోన్నాడు.

"సోదరీ సోదరులారా! శాయి అనబడే ఒక వీధిరౌడీ బాంబులు పేలి మృతిచెందితే శివయ్య పార్టీవాళ్లు బందుకు పిలుపు ఇవ్వటం హాస్యాస్పదంగా వుంది అందుకే మేము బందును వ్యతిరేకిస్తున్నాం. దయచేసి అందరూ మీమీ దుకాణాలు తెరిచి నిర్భయంగా వ్యాపారం చేసుకోండి. బందును విఫలం చెయ్యండి. అందుకు భిన్నంగా ఎవరైనా ప్రవర్తిస్తే ఆగ్రహంతో వున్న మా కార్యకర్తలను ఆపటం మా తరం కాదు" అని ప్రజలను హెచ్చరిస్తోన్న వాహనాల ఊరేగింపు నెమ్మదిగా మెయిన్‌బజారులో వున్న బంగారం కొట్ల దగ్గరికి వెళ్ళి ఆగింది.

అక్కడ శివయ్యవర్గం వాళ్లు కూడా మోహరించి వుండటం, బంగారం షాపులన్నీ మూసివెయ్యటం గమనించాడు గాంధీ. ఉభయవర్గాలవారు అక్కడ తారసపట్టంతో పరిస్థితి క్రమంగా ఉద్రిక్తత దాలుస్తోంటే మళ్ళీ మైకు అందుకుని మాట్లాడసాగాడు గాంధీ.

"దయచేసి బంగారం కొట్లన్నీ వెంటనే తెరవండి. బందును ప్రతిఘటించండి. సోదరులారా! ఒక రౌడీకోసం బందు జరిపే సంప్రదాయం మంచిదికాదు. రాజకీయాలను రౌడీలకు అప్పగించి గూండాలతో పరిపాలన నిర్వహించేచోట శాంతిభద్రతలు వుండవు. సాధారణ పౌరులు నిర్భయంగా జీవించలేరు. హత్యలు, దోపిడీలూ చేస్తూ క్రమంగా ముఠా రాజకీయాలలో దూరి అదే రాజకీయాలలో హతులవుతున్న సంఘవిద్రోహుల కోసం నిరసనలు, బందులు జరిపించటం వారి గూండా రాజకీయాలను సమర్థించినట్టే! వీధిరౌడీలకు నీరాజనాలు పలికినట్టే! ఈ దేశస్వాతంత్రం కోసం ఎన్నో బలిదానాలను చేసిన మన పుణ్యమూర్తులను అగౌరవపరచినట్లే!" అంటూ గాంధీ అలా చెప్తూనే వుంటే దూరంనించి అంతా వింటోన్న శివయ్య ముఖం చిట్లించి-

"వీడేందిరా... నటించమంటే జీవిస్తున్నాడు, ప్రతిపక్ష పాత్రలో. వాడికి మైకు దొరికితే మైకం కమ్ముతుంది. ఇంకా అలా తెలియక ఏం మాట్లాడ్తాడో కానీ వాడికి అలాంటి అవకాశం ఇవ్వకుండా పని కానివ్వండి" అన్నాడు పక్కనే వున్న గబ్బర్తో.

అలాంటి ఆదేశం కోసమే ఎదురుచూస్తోన్న గబ్బర్ తన అనుచరులకు సైగచేసి, వ్యాన్లోంచి కిందికి దిగాడు. అనుచరులు కూడా వాహనాల్లోంచి దిగి గబ్బర్ వెంట ముందుకు కదిలారు.

రోడ్డువారగా గబ్బర్ సిద్ధంగా వుంచిన నాలుగు గోలీషోడా బండ్లను ఎవరో తోసుకుంటూ ముందుకు తెచ్చి గబ్బర్ పక్కనే నిలిపారు. బీభత్సం సృష్టించేందుకు ఆ షోడాల్లో నీళ్లతోపాటు గుండుసూదులు కూడా వేసి ప్రత్యేకంగా తయారుచేయించారు.

ముందుగా గబ్బర్ రెండు సోడాసీసాలను గాల్లోంచి విసిరివెయ్యగానే అతని అనుచరులంతా సీసాలు విసురుతూ ముందుకు సాగిపోతోంటే ఆ పేలుడు శబ్దాలకూ, గాల్లోంచి విసురుగా ఎగిరివచ్చి శరీరాల్లోకి గుచ్చుకుంటున్న గుండు సూదులకూ, గాజుపెంకులకూ దూరంగా పారిపోతోన్నారు. అంతవరకూ ఆ దృశ్యాన్ని ప్రేక్షకుల్లా చూస్తోన్న సాధారణ జనం!

గాంధీవర్గంవాళ్లు లారీల్లోంచి, వ్యాన్లలోంచి కిందికి దూకారు. చేతుల్లో సిద్ధంగా



వున్న గొడ్డళ్లను ఎక్కుపెట్టి, శివయ్యవర్గం ఒక వేపునించి సోడాలతో బెదిరించి జనాన్ని పారదోలుతోంటే మరోవేపునుంచి ముందుకు వెళ్లి బంగారం కొట్లమీద దాడి ప్రారంభించారు.

షాపుల తాళాలు పగిలిపోతున్నాయి. షట్టర్లు ఇనుపరాపిడి శబ్దాలుచేస్తూ తెరుచు కుంటున్నాయి. ఆ క్షణంలో శివయ్యవర్గం గాంధీవర్గం అన్న తేడాలు లేవు! పార్టీల విభేధాలు లేవు. బందు జయప్రదం కావా లని కానీ, విఫలం చెయ్యాలని కానీ ఎవ్వరూ ఆలోచించటంలేదు.

ఉభయపార్టీల కార్యకర్తలూ కలిసి షాపుల్ని దోచుకుంటున్నారు. బంగారం కొల్లగొడుతున్నారు. గల్లాపెట్టెల్లో వుంచిన నగదును తస్కరిస్తున్నారు. దోపిడి పూర్తికా గానే ఆనవాళ్లు లేకుండా షాపుల్ని పెట్రోలుపోసి తగలపెడుతున్నారు.

ఇక దోచుకుందుకు ఏదీ మిగలలేదని నిర్ధారణ కాగానే గబ్బర్ ఒక పెద్దసంచి మోసుకుంటూ జనాన్ని తప్పించుకుంటూ శివయ్య దగ్గరికి వెళ్ళాడు. చేతిలో వున్న సంచిని కొంచెం పైకి లేపుతూ ఆయనకు చూపించి "అంతా ఓ.కే. బాస్" అన్నాడు ఆనందంగా.

సంచిని చూడగానే శివయ్య కళ్లు మిల మిలా మెరిశాయి. "అవ్వన్నీ బంగారు నగ లేనా? " అడిగాడు ఆత్రంగా.

"కొంచెం వెండి కూడా వుంది"

"క్యాషేం దొరకలేదా? "

"ఏదో... చిల్లర మల్లర! అది కూడా మన కార్యకర్తలే నొక్కేశారు. పోనీలే అని వది లేశాం"

"గాంధీకి ఏమైనా గిట్టుబాటు అయిన ట్లేనా? లేకపోతే మనమీదపడి భోర్న ఏడు స్తాడు"

"గిట్టుబాటు కాకపోవటం ఏంటీ... మాకన్నా ముందుగానే ఒక సంచి బంగారం వేసుకొని ఉడాయించాడు" అని చెప్పాడు గబ్బర్.

శివయ్య ఒక్కక్షణం మౌనం తర్వాత "సరే... ఇక మనవాళ్లను ఇక్కడ్నించి వెంటనే వెళ్లిపొమ్మని చెప్పు! ముఠాల నాయ కుల్ని మాత్రం మన ఇంటికి రమ్మని చెప్పు! వాళ్లకూ కాస్తో కూస్తో ముట్టచెప్తేనేకదా మనకోసం వాళ్లు పనిచేసేది. ఇంకా మనం భవిష్యత్తులో ఎన్ని బందులు చెయ్యాలో" అని గబ్బర్ చేతిలో వున్న సంచిని అందు కొని హుందాగా కారెక్కి వెళ్ళిపోయాడు శివయ్య.

పది నిముషాల్లో అక్కడ అంతా సద్దుమ ణిగింది. ఉభయపార్టీల కార్యకర్తలూ ఎవరి దారిన వారు వెళ్ళిపోయాక పోలీసువాహ నాలు సైరన్లు మోగిస్తూ వేగంగా వచ్చి వీధుల్లో ఆగాయి! పోలీసులు లాఠీలతో కిందికి దూకారు. కార్యకర్తలంతా వెళ్ళిపో యాక నిర్భయంగా వీధుల్లోకి వచ్చి మంటల్లో కాలుతూ పొగలు విరజిమ్ము తోన్న దుకాణాలను చోద్యంగా చూస్తూ నిల్చున్న జనంమీద విరుచుకుపడి లాఠీలతో చావబాదుతున్నారు.



ఆ రాత్రంతా పోలీసు వాహనాల సంచారం, విజిల్లు, కేకలతో దుర్భరంగా గడి చిపోయింది. తెల్లవారే సరికల్లా శివయ్య

ఇల్లు జనంతో కిటకిటలాడ్తోంది. వివిధ పేటలనించి శివయ్య అభిమానులు వచ్చి బందును జయప్రదంగా నిర్వహించినందుకు ఆయన్ను అభినందిస్తున్నారు.

కెమికల్ ఫ్యాక్టరీలో పనిచేసే ఇద్దరు కార్మికులను వెంటపెట్టుకుని పొద్దున్నే శివయ్య ఇంటికి వచ్చాడు కార్మిక నాయకుడు అమరలింగం.

"రావోయ్... ఇలా వచ్చి కూర్చో" అని అమరలింగాన్ని లోనికి ఆహ్వానించాడు శివయ్య.

అతను వచ్చి శివయ్య ఎదురగా వున్న కుర్చీలో కూర్చోగానే "నిన్న జరిగిన బందులో నువ్వు ఉడుతాభక్తిగా నీ కార్మికులను వెంటతెచ్చి చాలా ఉత్సాహంగా పాల్గొన్నందుకు చాలా సంతోషం" అన్నాడు శివయ్య ముఖం విప్పారుస్తూ.

"మిత్ర పక్షాలుగా మీతో చేతులు కలిపిం తర్వాత మీరు చెప్పిన కార్యక్రమాల్లో పాల్గొనకుండా ఎలా వుంటాం?" అని అమరలింగం గర్వంగా చూశాడు.

"బందు ఖర్చులు ముట్టాయా? గబ్బర్ ఎంత యిచ్చాడేమిటి?"

"అలాంటి లావాదేవీల విషయంలో మీతో ఎప్పుడూ పేచీరాదు! మా పన్నెండు మందికే పన్నెండు అరతులాల బంగారం రాత్రే యిచ్చాడు గబ్బర్" అని చెప్పాడు అమరలింగం.

"సరే... బందులో పాల్గొన్నంత ఉత్సాహంగా యూనియన్ ఎన్నికల్లో కూడా పని చెయ్యండి. మనం గెలిచి తీరాలి..."

"ఆ విషయం మాట్లాడేందుకే వచ్చాను. మీరు మాకు యిస్తానన్న స్థలాల విషయంలో విచారణ పెట్టించారు ఐక్యవేదిక వాళ్ళు. ఆ స్థలాలు మాకు దక్కుతాయన్న ఆశ యిక లేదు. అలాంటప్పుడు మీ తరపున ఎన్నికల్లో పనిచెయ్యాలంటే ముందుగా మనం లావాదేవీలు మాట్లాడుకోవాలి కదా?" అన్నాడు అమరలింగం.

"మాట్లాడూ...!" చివాల్న తలెత్తి చూస్తూ కొంచెం చిరాగ్గానే అన్నాడు శివయ్య.

అమరలింగం అదేం అంతగా పట్టించుకోలేదు! చిన్నగా దగ్గి గొంతు సవరించుకుని "మిత్రపక్షాలుగా మనం కలిసే ఎన్నికల్లో పోటీ చేద్దాం. ఉమ్మడి ప్యానల్ను తయారు చేసి పోటీ పెడదాం. యూనియన్ అధ్యక్షులు మీరైతే, కార్యదర్శిగా నన్ను పోటీ చేయించండి. అదే మా చిన్న కోర్కె" అన్నాడు అమరలింగం శివయ్యకేసి అభ్యర్థనగా చూస్తూ.

శివయ్య అమరలింగం వేపొకసారి చూసి వెంటనే తలదించుకున్నాడు. మాటల్లో కానీ, ముఖంలోకానీ ఎలాంటి భావాలనూ వ్యక్తీకరించకుండా అలా మౌనంగా కొంతసేపు ఆలోచించి "అలాగే చేద్దాం అమర్లింగం! నేనూ మాపార్టీవాళ్లతో మాట్లాడి ఒక నిర్ణయానికి వస్తాం. ఏది ఏమైనా నీ స్థాయికి తగ్గకుండా నీ గౌరవం నీకు దక్కించే ప్రయత్నంచేస్తాను. అంతా సవ్యంగానే జరుగుతుంది!" అని, మళ్ళీ ఒక్కక్షణం ఆగి-

"ఇక మీరు వెళ్ళి ఎన్నికల పని చూడండి!" అన్నాడు నిర్వికారంగా.

అమరలింగం తన ఇద్దరు అనుచరులను వెంటపెట్టుకుని వెళ్ళిపోయాడు.

"ఏంటి సార్ వాడి గోల?" అమరలింగం బైటికి వెళ్ళిపోగానే శివయ్యను అడిగాడు గబ్బర్.

శివయ్య పకపకానవ్వి, "వీడూ తక్కువ వాడేం కాదురా... నాంచారయ్య తల్లోంచి దూరిపోయాడు! ఉదారంగా లెక్కేసినా వాడి బలగం డజనుమంది! మిత్రపక్షాల పేరుతో వాడిపొట్టూ, మన పప్పూ కలిసి ఊదుకొని చెరి సహం తిందామంటున్నాడు. యూనియన్ సెక్రటరీ పదవి కావాలట వాడికి!" అని మళ్ళీ పగలబడి నవ్వి-

"వీడి గోల ఇట్లావుంటే ఆ గాంధీగాడిది ఇంకొక గోల! మీ పార్టీలో చేర్తానూ... మీ

పార్టీలో చేర్తానూ అని రోజూ ఫోన్లోనే మారాం చేస్తున్నాడు. ఎక్కడైనా తటస్థపడ గానే పీక్కుతింటున్నాడు. అంసెబ్లీ సీటు కావాలట వాడికి ఒకేపార్టీలో మేమిద్ద రమూ నాయకులు కావటం ఎలా కుదు ర్తుంది? ఒకవరలో రెండు కత్తులు యిమ డవు కదా! ఆ విషయం గాంధీ తనకు తానే అర్థంచేసుకోవాలి కానీ "ఛీ... పో..." అని ముఖాన చెప్తారా ఎవరైనా? " అని శివయ్య తన ధోరణిలో అలా ఇంకా ఏదో మాట్లాడు తూంటే ఎవరో వచ్చి, ఫోన్ చేతికి అందిస్తూ-

"సార్! డిఎస్పీగారు లైన్లో ఉన్నారు" అని చెప్పారు.

"ఆ... శివయ్యనే చెప్పండి!" అన్నాడు రిసీవర్ను చెవిదగ్గర పెట్టుకుని.

"గుడ్‌న్యూస్ సార్..."

"ఏమిటో అది? "

"శాయి కేసులో ఐక్యవేదిక నాయకులను అనుమానంమీద అదుపులోకి తీసుకొని 'గది'లో విచారించమని పైనుంచి ఆదేశాలు వచ్చాయి!"

శివయ్య అది వినగానే పగలబడి నవ్వాడు. "బందుకు ఏదో ఒక కారణం కావాలి కనుక అలా ప్రభుత్వాన్ని అడిగేం కానీ నిజంగా వాళ్ళను అరెస్టు చేస్తే నష్టపో యేది మేమే! యూనియన్ ఎన్నికలు దగ్గరి కొచ్చాయి కనుకనే, వాళ్ళు మా బ్రాందీషా పులు ధ్వంసం చేసినా సహించి ఊరు కున్నాం కానీ అరెస్టు చేయించలేదు. అందు వల్ల ఆ ఫైల్ను ఎలక్షను అయ్యేదాకా పెండింగులో ఉంచండి" అన్నాడు శివయ్య.

"ఇక, నిన్న జరిగిన బందు సందర్భంగా జరిగిన దోపిడి, దహన కాండలకు సంబం ధించి మీపార్టీ తరఫున ఎవరైనా అనామ కుల్ని అరెస్టు చెయ్యమన్నారు. అలా చెయ్య కపోతే ప్రతిపక్షాలు అల్లరి చేస్తాయిట! అలాంటి అవకాశం వాళ్ళకు ఇవ్వకుండా అలా చెయ్యమని ఆదేశించారు".

శివయ్య ఒక్కక్షణం ఆలోచించాడు. "అయితే వెంటనే ఒకపని చెయ్యండి! అమ రలింగం పార్టీవాళ్ళు మిత్రపక్షంగా మాతో కలిసి బందు చేయించారు. కనుక మా అందరి తరఫునా అమర్లింగాన్ని వెంటనే అరెస్టు చెయ్యండి" అన్నాడు శివయ్య.

"మరి, గాంధీ పార్టీలో ఎవర్ని అరెస్టు చెయ్యమంటారు? "

"ఎవరినో ఎందుకూ, గాంధీనే అరెస్టు చెయ్యండి. కానీ అది ఇప్పుడుమాత్రం కాదు. ఎలక్షను పూర్తయిన మరుక్షణమే గాంధీనీ, చైతన్యనూ అరెస్టు చెయ్యండి." అని ఫోన్ పెట్టేశాడు శివయ్య.

ఫోన్లో డిఎస్పీకి శివయ్య చెప్పిందంతా విన్న గబ్బర్ శివయ్యకేసి నిర్ఘాంతపోయి చూస్తూంటే శివయ్య నవ్వాడు. "అమరలిం గాన్నీ, గాంధీనీ అరెస్టు చెయ్యమని ఎందు కలా చెప్పానా? అనికదూ నీ అను మానం? మిత్రపక్షంగా అమరలింగం తన అనుచరులను చాలాకాలంగా మనవెంట తిప్పుతున్నాడు. ఆ కారణంగా వాళ్ళుకూడా మనవల్ల ప్రయోజనం పొందారు. ఉడు ముకు తేనెబొట్టు రుచి చూపిస్తే ఆ తేనె కోసం కోట గోడలైనా అవలీలగా ఎక్కు తుంది! అలాగే వాళ్లకు మనం రుచి చూపించినవి స్వల్పమైన ప్రయోజనాలే. అయినా వాళ్ళు స్వార్థంకోసం మనవెంట తిరగక తప్పదు. వాడి డజనుమంది కార్యకర్తలకూ, మనకూ మధ్యదళారీగా అమ ర్లింగం పాత్రకిక కాలం చెల్లిపోయింది. అతని ఇష్టాయిష్టాలతో కార్యకర్తలకిక ఎలాం టిప్రమేయం ఉండదు. తేనె రుచి మరిగిన వాళ్ళంతా మన ప్రాపకంకోసమే పాకులా డ్తారు తప్ప మనల్ని విడిచి వెళ్లిపోరు. అదే సూత్రం గాంధీ విషయంలోనూ వర్తిస్తుంది. ఏరు దాటేందుకు తెప్ప అవసరం అన్నది నిజమే! కానీ దాటాక తెప్పను తగలెయ్యక పోతే ఆ తెప్పలోనే శత్రువులు కూడా ఏరు




దాటి వచ్చి మనవెంట పడతారు. రాజ కీయం అంటేనే అది!" అని పెద్దగా నవ్వాడు శివయ్య.

అంతలోనే అతడి ముఖం గంభీరంగా మారింది! "అరే... గబ్బర్! బందుఘట్టం జయప్రదమైంది. ఇక జయప్రదం కావాల్సింది ఎన్నికల ఘట్టమే! నువ్వు ఈ రాత్రికే వెళ్ళి బాంబులు కొని తేవాలి. ఎంత డబ్బు ఖర్చయినా పర్లేదు. పనిమాత్రం త్వరగా జరగాలి. వీలుంటే ఎన్నికల రోజుకు కొన్ని గ్యాంగుల్ని ఇక్కడికి పంపించమని వాళ్ళకు నా మాటగా చెప్పు. ఇక నీదే ఆలస్యం!" అని విసురుగా నడుస్తూ వెళ్ళిపోయాడు శివయ్య.



రోజూ పగటివేళ ఏదో ఒక సమయంలో ఆస్పత్రి క్వార్టర్సు నుంచి బైటికి వెళ్ళి సుందరిని కలుస్తూనే వుంది రమణి. రాత్రివేళల్లో డ్యూటీచెయ్యటం, పగలు కొంత సమయాన్ని సుందరికి కేటాయించి ఆమె వెంట కార్మికవాడలకు వెళ్ళటం విధిగా పెట్టుకుంది. అలా ఇద్దరూ కలిసి కెమికల్ ఫ్యాక్టరీ యూనియన్ ఎన్నికల్లో ఐక్యవేదిక విజయంకోసం వాడవాడల్లో ప్రచారం సాగిస్తున్నారు.

చైతన్య సాధ్యమైనంతవరకు వీధుల్లో తిరక్కుండా ఎన్నికల కార్యాలయంలోనే వుంటూ ఓటర్ల లిస్టు చూసి ఫ్యాక్టరీ సెక్షన్ల వారీగా ఓటర్ల పేర్లు రాయటం, శివయ్య అభిమానులు అధికంగా వున్న కొద్ది సెక్షన్లలోని కార్మికులను తమవేపుకు తిప్పుకుందుకు వాళ్ళతో చర్చలు జరపటం చేస్తున్నాడు.

రమణిద్వారా రామ్మూర్తి వాళ్ళకు బందు జరిగిన సాయంత్రమే కబురు పెట్టాడు చైతన్యను వీధుల్లో తిరగవద్దని! రామ్మూర్తి సలహా ప్రకారం ఆరోజు ఐక్యవేదిక కార్యకర్తలు బందును గురించి అస్సలికి పట్టించుకోకుండా దూరంగా వున్నారు. యూనియన్ ఎన్నికలను మాత్రమే దృష్టిలో వుంచుకొని విజయంకోసం కృషి చేస్తున్నారు.

ఈరోజు తూర్పు కొండలవేపుకు ఇద్దరూ కలిసి నడుస్తూ వెడుతున్నప్పుడు రమణిని అడిగింది సుందరి, "రమణీ! ఒక విషయం అడుగుతాను, నిజంచెప్తావా? "

"ఏమిటా విషయం? " అంది రమణి ముఖం చిట్లిస్తూ.

"బాంబులు పేలి శాయి చనిపోయిన రాత్రి మావారు ఆస్పత్రినుంచి బైటికి వెళ్ళారు కదూ? "

రమణి అనూహ్యంగా ఆమె అడిగిన ప్రశ్నకు వెంటనే సమాధానం చెప్పలేక తటపటాయించింది.

"నిజం చెప్పు వారా రాత్రి ఆస్పత్రినుంచి బైటికి వెళ్ళలేదూ? " రెట్టించి అడిగింది మళ్ళీ సుందరి.

రమణి చూపుల్ని మరోవేపుకు మరలుస్తూ "ఏమో మరి, నాకేం తెలుసు? " అంది మంద్రంగా.

ఇద్దరూ మౌనంగా ముందుకు నడుస్తున్నారు. కొంతదూరం అలా వెళ్ళి ఓ పెద్ద అగాధం దగ్గర ఆగిపోయింది సుందరి. చుట్టూ ఒకసారి కలియచూసింది. అక్కడ కొండల్ని తొలిచిన అగాధాలూ, ఆ అగాధాలకు అవతల దూరంగా అడవీ, దక్షిణంవేపున రెండు ఫర్లాంగుల దూరంలో కార్మిక వాడా.

"మనం వెళ్ళాల్సింది కార్మిక వాడకైతే ఇక్కడికి తెచ్చేవేం? " అని సుందరిని అడిగింది రమణి.

"బాంబులు పేలి శాయి చనిపోయింది ఈ ప్రాంతంలోనే! అంటే ప్రత్యర్థులు ఇక్కడే ఎక్కడో బాంబుల్ని దాచేందుకు వెళ్తోంటే అవి పేలి ఉండవచ్చు మొత్తం బాంబులు పేలిపోయాయా, ఇంకా కొన్ని రహస్యంగా ఈ అగాధాల్లో ఎక్కడైనా ఉన్నాయా? అన్నది అర్థం కావటంలేదు!" అని సుందరి రమణి ముఖ కవళికలను గమనిస్తూ ఆమె



వేపే కన్నార్పకుండా చూస్తూ నిల్చుంది.

"బాంబులు పేలింది ఇక్కడో, మరెక్కడో నాకు తెలియదు కానీ ప్రత్యర్థుల దగ్గర ఇంకా బాంబులున్నాయని నేను అనుకోను! ఎందుకంటే బాంబులు తెచ్చేందుకు రాత్రి గబ్బర్ బస్టాండు బుక్‌స్టాల్ ఆంజనేయుల్ని వెంటపెట్టుకుని బైల్దేరి వెళ్ళాడు!" చెప్పింది రోజారమణి.

సుందరి ముఖంలో సందిగ్ధం ఏదో తొలిగిపోయిన రిలీఫ్ కనిపించింది. "వాళ్ళు బాంబులకోసం ఊరెళ్ళారని నీకెలా తెలిసింది? " అడిగింది చూపుల్ని ఆమె ముఖం మీంచి మరల్చకుండానే.

"తెలిసింది- **అంతే!**" అంది రమణి క్లుప్తంగా.

"ఎప్పుడు తెలిసింది? "

"ఇందాక, నీ దగ్గరికి వచ్చేముందే? "

"మరైతే ఈ రాత్రి డ్యూటీకి వెళ్లగానే ఈ విషయం మా వారితో చెప్తావుకదూ? "

"చెప్పాలిగా మరి!"

"ఆరోజు శాయి బాంబుల్తో ఇక్కడికి వస్తాడన్న విషయం కూడా ముందుగా తెలుసుకుని వారితో చెప్పింది నువ్వే కదూ? " అని సూటిగా అడిగి, రమణి భుజాలమీద రెండు చేతులూ వేసి తన వేపుకు తిప్పుకుంటూ

"రమణీ! నా దగ్గర నువ్వు నిజం దాస్తావని నేను అనుకోలేదు! నిజంచెప్పు. ఆరోజు రాత్రి వారు రహస్యంగా ఆస్పత్రినుంచి బైటికి వెళ్ళింది నిజం. అలా వెళ్ళేందుకు వారికి నువ్వు సహకరించింది నిజం. అవును కదూ? " అంది సుందరి రమణిని రెండు చేతులతో బలంగా కుదిపివేస్తూ. అప్పుడు ఆమె గొంతులో ధ్వనించిన అభిమానానికీ, ఆర్ద్రతకూ చలించిపోతూ "నిజమే!" అంది రమణి అసంకల్పంగానే.

"అంత సాహసం ఎందుకు చేసేవ్? ఎవరైనా గమనించి ఉంటే ఎంతప్రమాదం? "

రమణి పేలవంగా నవ్వింది! బతుకు పుస్తకంలో కనీసం ఒకపేరా అయినా జీవిత సార్థక్యానికి తపనపడ్డ జ్ఞాపకాలు మిగలాలంటే ఆమెకు మరోమార్గం తోచ లేదు. ఆ సాహసంలోనే ఆమెకు ఆనందం కనిపించింది.

రమణి తన కళ్లతోటే కనపరిచిన ఎన్నో భావాలను నిశ్శబ్దంగా చదివింది సుందరి. రమణి హృదయాంతరాళాల్లో తుళ్ళిపడుతోన్న భావోద్వేగాన్ని మరోమార్గంలో స్వస్తపరిచేందుకు- "ఇక మనం కార్మికవాడకు వెళ్దామా? " అంటూ ఆమె భుజాలమీంచి చేతులు తొలగించింది సుందరి. రెండు అడుగులు వేసి ఆగింది. "అక్కడే నిలబడిపోయావేం? " అంది వెనక్కు తిరిగి చూస్తూ.

"అక్కడికి నేనిప్పుడు రాలేను" అంది రమణి.

"ఇందాక వెళ్దామనే బైల్దేరి వచ్చావు కదా? "

"శిలగా ఉన్న నా గుండె ఎందుకో ఇప్పుడు ద్రవించిపోయింది! రాలేను. అక్కడే ఆనాడు నాంచారయ్యకు నా జీవితాన్ని అర్పణచేసి వక్రమార్గంలో ప్రయాణం ప్రారంభించింది. ఈరోజుకిక నన్ను విడిచిపెట్టు" అని దీనంగా చూసింది రమణి.

సుందరి మౌనంగా ఒక్కక్షణం ఆలోచించింది. ఏదో నిర్ణయానికి వస్తూ, "సరే... మనం వెనక్కు తిరిగి వెళ్ళిపోదాం!" అంటూ రమణి చెయ్యిపట్టుకుని ఊరువేపుకు నడిపించింది సుందరి.

ఇద్దరూ అలా నడుస్తూ ఊళ్లోకి ప్రవేశించారు. మరికొంత దూరం నడిచి ఆస్పత్రి దగ్గరికి చేరుకున్నారు.

"రమణీ! నువ్వింక నీ క్వార్టర్సుకు వెళ్ళి హాయిగా విశ్రాంతి తీసుకో! నేను కార్మికవాడకు వెళ్తొస్తాను. రాత్రి డ్యూటీలో మావార్ని కలిసినప్పుడు యూనియన్ ఎన్నికల కార్యక్రమాలన్నీ సవ్యంగానే జరుగుతున్నాయని వారికి చెప్పు" అంది సుందరి.




# ఏరిన ముత్యాలు

★ మౌనం ఓ శక్తి, ఓ సాధనం, ఓయోగం, ఓ ఆనందం. మౌనం విలువ తెలిసిన మనిషి బ్రతుకే ఆనందమయం.

–ఓ సూక్తి

★ రేపటి సూర్యుడికోసం ఈ రాత్రంతా ప్రసవవేదన పడేదే అసలైన కళారూపం.

–మాగ్జిమ్ గోర్కీ.

★ కాలం ఒక తేలని ప్రశ్న, తీరని తృష్ణ. విరామంలేదు విజ్ఞానానికి, సందేహం తీరదు వేదాంతికి.

–ఆరుద్ర

★ సూర్యుడు ఈ లోకంలో చాలామంది కష్టాలను చూస్తాడు. కానీ... సూర్యుడి కన్నా చంద్రుడే వారి ఆవేదనలు అర్థం చేసుకుంటాడు.

–రావిశాస్త్రి

★ సంఘర్షణలేని జీవితం నిరర్థకం.

–జవహర్‌లాల్ నెహ్రూ

★ జీవితం ఆలోచించేవారికి విషాదమయం. అనుభవించేవారికి ఆనందమయం.

–హోర్స్‌వాల్‌పోల్

★ జీవితంలో ఎదిగి రావాలంటే నిరంతరం పరిశ్రమ, పొదుపు అవసరం.

–బెంజిమిన్ ఫ్రాంక్లిన్

★ మహమ్మద్, క్రీస్తు, బుద్ధుడు మంచివాళ్ళే. అయితే నీకేమిటి ప్రయోజనం? నీవు మంచివాడివి కానప్పుడు నిన్నెవరూ రక్షించలేరు.

–ఒక సూక్తి

★ అక్షరరూపం దాల్చిన ఒకే ఒక్క సిరాచుక్క లక్ష మెదళ్లకు కదలిక.

–కాళోజీ

★ ఈ లోకం మారదనే వాదానికి తావులేదు. రాక్షసవృక్షం సైతం రంపానికి లొంగుతుంది.

–ఒక సామెత

★ నేను కవిని. నా గేయం అహింసాక్రాంతి. నా ధ్యేయం విశ్వశాంతి.

–వానమామలై వరదాచార్యులు

★ అయిష్టంగా ఎవరికీ ఏమీ ఇవ్వనవసరంలేదు. కానీ లేదని అబద్ధం చెప్పగూడదు. ఇవ్వలేనని చెప్పాలి.

–షిర్డీ సాయిబాబా

సేకరణ : **దేవులపల్లి శ్యామసుందరరావు**

రమణి 'అలాగే' అన్నట్టు తల ఊపి ఆస్పత్రి మెయిన్‌గేటు వేపుకు వెళ్లబోతుంటే ఎందుకో ఆమెను మళ్ళీ వెనక్కి పిల్చింది సుందరి.

"ఏమిటి? " సుందరి దగ్గరికి వెళ్ళి అడిగింది రమణి.

"ఇందాక చెప్పటం మర్చిపోయాను! ఒక్కో సందర్భంలో సాహసం చెయ్యటం అనివార్యమే కానీ అలా చేసేటప్పుడు ఎప్పటికన్నా మరింత జాగ్రత్తగా ఉండాలి!" అంది సుందరి.

"అలా ఎందుకు చెప్తున్నావ్? " ప్రశ్నార్థకంగా చూస్తూ అడిగింది రమణి.

"మా వారిని నువ్వు బైటికి పంపించిన రాత్రి వారు మళ్లీ తన గదికి కిటికీ గుండా తిరిగి రాగానే అక్కడ్నించి తొలగించాల్సిన నిచ్చెన విషయం నువ్వు మర్చిపోయావు. సమయానికి ఒక ఆపద్బాంధవుడు ఆ నిచ్చెన్ను చూసి దాన్ని అక్కడ్నించి తొలగించాడు కనుక సరిపోయింది కానీ లేకపోతే ఎంత గొడవ జరిగేదో!" అంది సుందరి.

రమణి వళ్ళు గగుర్పొడిచింది! నిజమే. ఆ రాత్రి కానిస్టేబులు ఏసుపాదాన్ని భోజనానికి ఆహ్వానించటం, అతడ్ని మాటల్లోపెట్టి కాలహరణం చేస్తోంటే వెంకటస్వామి రావటం జరిగింది. రామ్మూర్తి గది తాళం వేసి ఉన్నందునా, అక్కడ కాపలా ఉండాల్సిన ఏసుపాదం గది దగ్గర కనిపించనందునా వెంకటస్వామికి ఏదేనా అనుమానం వచ్చి గది వెనక్కు వెళ్ళి చూసి ఉంటే అతనికి నిచ్చెన తప్పకుండా కనిపించేది. తను రామ్మూర్తిని రహస్యంగా పంపించిన విషయం వెల్లడయ్యేది.

ప్రమాదం తప్పినందుకు మనసులోనే సంతోషిస్తూ "ఎవరా ఆపద్బాంధవుడు? " అడిగింది రమణి.

"అది చాలా రహస్యం! భవిష్యత్తులో కూడా మీకు అతని సహకారం అవసరమౌతుంది కనుక తప్పనిసరై అతనెవరో చెప్తున్నాను. ఎట్టి పరిస్థితుల్లో అతని పేరు వెల్లడి చెయ్యకూడదు. సరేనా? " అని రమణి ముఖంలోకి సూటిగా చూసింది సుందరి.

"ప్రాణంమీదికి వచ్చినా రహస్యం కాపాడ్తాను"

"అయితే చెప్తాను. విను! అతనెవరో కాదు, కానిస్టేబులు వెంకటస్వామి!" అంది సుందరి.

రమణి క్షణకాలం నిర్ఘాంతపోయింది!




ఆ రాత్రి కానిస్టేబులు ఏసుపాదం డ్యూటీలో లేడు. ఆరోగ్యం బాగాలేక సెలవు పెడితే రామ్మూర్తికి కాపలా కోసం వెంకటస్వామిని మాత్రమే కేటాయించి ఎన్నో జాగ్రత్తలు చెప్పి వెళ్లాడు ఎస్సై.

రాత్రి తొమ్మిది గంటలు దాటింది.

ఎస్సై ఆస్పత్రినుంచి వెళ్ళిపోయిన కొంచెం సేపటికి వెంకటస్వామి గదిముందు వరండాలో గోడకు చేరగిలబడి కూర్చుని నెమ్మదిగా జేబులోంచి విస్కీసీసా బైటికి తీసి కనీసం నీళ్ళుకూడా కలపకుండా ఒక్కో గుక్కా తాగుతూ కూర్చున్నాడు.

ఆ సీసా మొత్తం ఖాళీ కాగానే మరోజేబులోంచి ఇంకొక సీసా బయటికి తీసి పక్కనే పెట్టుకుని మైకంలో తేలిపోతూ ఏవో పాత కాలపు సినిమాపాటలని నిర్విరామంగా




పాడుతూ కూర్చున్నాడు.

పది గంటలు దాటింది.

రమణి స్టాఫ్ రూమ్‌లోంచి నెమ్మదిగా నడుచుకుంటూ రామ్మూర్తి గది దగ్గరికి వెళ్ళి కొంచెం దూరంనుంచే వెంకటస్వామిని గమ నించింది.

వెంకటస్వామి రెండో విస్కీ సీసాను కూడా ఖాళీ చేసాడు అప్పటికే. అతను కనీసం లేచి నిలబడేందుక్కూడా శరీరం సహకరించక కూర్చునే అలా నెమ్మదిగా ముందుకు జరిగి అక్కడ పరచి ఉన్న చాప మీదికి ఒరిగిపోయాడు.

రోజారమణి కొంచెంసేపు ఆలోచించింది. అతను తమకు సహకరిస్తాడని సుందరి చెప్పినా మరీ అత్యావసరమై గత్యంతరం లేక పోతేనే తప్ప ఆ విషయం సుందరి తనకు చెప్పినట్లు వెంకటస్వామికి తెలియకూడదను కుంది. అలా తెలిస్తే అతను తన రహస్యం వెల్లడైందని భయపడి ఇకపై సహకరించక పోవచ్చునని సంశయించింది.

ఆమె అలా ఆలోచిస్తూ నిల్చుంటే కొంచెం సేపటికి కానిస్టేబులు వెంకటస్వామి గాఢని ద్రలోకి జారుకున్నాడు. గాలివాలుకు అతడు పెడుతోన్న గురక స్పష్టంగా వినిపిస్తోంది. అడుగులో అడుగు వేసుకుంటూ అతడికి దగ్గరగా వెళ్ళి పరీక్షగా చూసింది రమణి!

గది తాళంచెవి వెంకటస్వామి దిండుప క్కనే మెరుస్తూ కనిపించింది. ఆమె ఆలస్యం చేయకుండా అమాంతం కిందికి ఒంగి తాళం చెవిని చేత్తో తీసుకుని తలుపు దగ్గరికి వెళ్ళి తాళం తీసింది. తలుపులు తెరుచుకుని లోపలికి ప్రవేశించింది.

రామ్మూర్తి ఆమెను చూడగానే మంచం మీంచి లేచి కూర్చున్నాడు. "పొద్దున్నే డ్యూటీ దిగి వెళ్తూ ఆరోజు వెంటిలేటరు గుండా బైటికి వెళ్ళే ప్రయత్నం వద్దని ఒక్క మాట చెప్పి హడావుడిగా వెళ్ళిపోయావు. దాంతో బైటికి వెళ్ళే అవకాశం చిక్కదేమో అని ఆందోళన పడ్డాను!" అన్నాడు రామ్మూర్తి.

"మరేం లేదు. ఈ గది వెనుక వార్డులో ఎవరో వివిపి పేషెంట్లు దిగారు. డాక్టర్లు, విజిటర్లు హడావుడి ఎక్కువగా వుంది. అందుకే అటువేపునుంచి వెళ్లవద్దన్నాను" అని చెప్పింది రమణి.

"ఇకనేం రాజమార్గాన్నే తెరిచావు కదా... బైటికి వెళ్ళి పని పూర్తిచేసి వచ్చేస్తాను. నువ్వు చెప్పినట్లు శత్రువులు అక్కడికి వస్తారు కదూ?" అడిగాడు రామ్మూర్తి.

"నాకు అందిన సమాచారం అది! గబ్బర్, ఆంజనేయులు కడపనుంచి బాంబులు తెచ్చి ముందుగా అక్కడికి చేరుస్తారు. ఆ తర్వాత వాళ్ల కార్యక్రమం ఏమిటో, వాటిని ఎక్కడ దాచిపెడతారో స్పష్టంగా తెలియదు!" అంది రమణి.

"సరే... నేనిక వెళ్లొస్తాను! ఈ సర్పయా గంలో నువ్వు అందిస్తున్న సహకారాన్ని ఎన్నడూ మర్చిపోలేను!" అని ఆమెను ఇంకొకసారి అభినందించి హుందాగా నడుస్తూ బైటికి వెళ్ళిపోయాడు రామ్మూర్తి.

రమణి కూడా గదిలోంచి బైటికి వచ్చింది. తలుపులు దగ్గరికి వేసింది. గడియ వేయకుండా తాళం కప్పను తగి లించి తాళంచెవిని మళ్లీ వెంకటస్వామి తల గడ దగ్గరే పెట్టి వెయిటింగ్ రూమ్‌కు వెళ్ళి పోయింది. ఆ రూమ్ కిటికీ గుండా బైటికి తొంగిచూస్తే రామ్మూర్తి గది అక్కడికి స్పష్టంగా కనిపిస్తుంది. అతను తన పని ముగించుకుని వెనక్కు తిరిగి రాగానే అతడ్ని గదిలోకి పంపించి యధావిధిగా తాళంవేసి రావాలన్నదే ఆమె ఆలోచన!

ఓరకంటితో అంతా గమనిస్తూ గుంభ నంగా నవ్వుకున్నాడు కానిస్టేబులు వెంకట

స్వామి.



అప్పటికే బాగా పొద్దుపోయింది. టీకొట్టు అయ్యరు సామాన్లన్నీ సర్ది, భోజనం చేసి పడుకున్నాడు. దూరంగా పారిశ్రామిక వాడలో ఉన్న ఫ్యాక్టరీల నుంచి నైట్ షిఫ్టు జరుగుతూన్న గుర్తుగా ఏవో శబ్దాలు, ఇంజన్ల హోరూ వినిపిస్తున్నాయి.

అప్పుడే అయ్యరుకు కునుకు పడుతోంది. బైటి వీధికుక్కల అరుపులు వినిపించేయి. అదే సమయంలో ఏదో వాహనం వచ్చి గబ్బర్ ఆధీనంలో ఖాళీగా వున్న పక్క గుడిసెముందు ఆగింది. ఆ చప్పుడుకు అయ్యరుకు నిద్రాభంగమైంది. మంచంమీంచి లేచి బైటికివెళ్ళి నిలబడి అటువేపుకు చూశాడు.

అప్పటికే వాళ్ళు జీపుదిగి బాంబుల పెట్టెల్ని గుడిసెలోకి చేర్చి నింపాదిగా నడుస్తూ అయ్యర్ టీ కొట్టుదగ్గరికి వచ్చారు. వాకిట్లోనే నిలబడి ఉన్న అయ్యర్ను చూసి "ఇంకా నిద్రపోలేదా? " అని అడిగాడు ఆంజనేయులు.

"లేదు సారూ..." అన్నాడు అయ్యరు.

గబ్బర్ ఎవ్వరినీ పట్టించుకోకుండా టీకొట్టు లోపలికి వెళ్ళి చెక్కకుర్చీలో కూర్చుంటూ అయ్యర్ని దగ్గరికి పిల్చి "మందు తాగాలి. గ్లాసులూ, నీళ్ళూ పెట్టి వెళ్ళు" అన్నాడు ఆజ్ఞాపిస్తున్న ధోరణిలో.

అయ్యరు వెళ్ళి రెండు గ్లాసులు, జగ్గుతో నీళ్ళూ తెచ్చి బల్లమీద పెట్టి దూరంగా వెళ్ళి నిల్చున్నాడు. ఆంజనేయులూ, గబ్బర్ గ్లాసుల్లోకి మందు ఒంపుకుని తాగుతూ కూర్చుని జరగాల్సిన కార్యక్రమాన్ని రహస్యంగా చర్చించుకుంటున్నారు.

"అయితే కొన్ని బాంబుల్ని కెమికల్ ఫ్యాక్టరీ సమీపంలో దాచిపెట్టి మిగిలిన బాంబుల్ని గుడిసెలోనే ఉంచుదాం. పోలింగు మొదలుకాగానే పరిస్థితి మనకు అనుకూలంగా లేనిపక్షంలో పోలింగు బూతుల మీద బాంబుదాడి జరుపుదాం. అదే సమయంలో ఐక్యవేదిక కార్యాలయం మీద పడి చైతన్యను ఖతం చేస్తే మన సమస్య కొంతవరకు పరిష్కారమైనట్లే!" అన్నాడు గబ్బర్ దీక్షగా శూన్యంలోకి చూస్తూ.

"పోలింగు బూతులమీద దాడి చేస్తే పోలింగు ఆగిపోతుంది కదా? " అడిగాడు ఆంజనేయులు.

"కావాల్సింది కూడా అదే! మనం ఓడిపోయే ప్రమాదం ఉన్నప్పుడు పోలింగు జరక్కపోవటమే మంచిది. మళ్ళీ ఎలక్షను పెట్టేందుకు కొంత సమయం పడుతుంది కనుక ఆ విరామంలో మనం ఏం చెయ్యాలో ఆలోచించుకోవచ్చు!"

"నీ వాదన ప్రకారమైతే మనం ఓడిపోవటం ఖాయం అనిపిస్తోంది"

"చెప్పలేం కదా... ఇది జనంతో వ్యవహారం! కడపనుంచి కూడా మన గ్యాంగులు పోలింగు సమయానికి వచ్చి చేరుకుంటాయి. అలా ఎన్ని గ్యాంగుల్ని సమీకరించినా మనకున్న మార్గాలు రెండే రెండు బూతుల్ని ఆక్రమించి మనమే ఓట్లు వేసుకోవటం ఒకమార్గం. బాంబులతో బెదిరించి ఎలక్షను జరక్కుండా ఆపటం రెండో మార్గం. అవేమీ పార్లమెంటు, అసెంబ్లీ ఎన్నికలు కావు కనుక రిగ్గింగు చెయ్యటం

సాధ్యం కాకపోవచ్చు. కార్మికులతో వ్యవహారం కదా..." అన్నాడు గబ్బర్, ఖాళీగ్లాసు కిందపెడుతూ.

ఆంజనేయులు కూడా గ్లాసు ఖాళీ చేశాడు. మళ్లీ రెండు గ్లాసుల్లో మందు నింపుతూ "నువ్వన్నట్లు పరిస్థితులు మన చెయ్యిదాటిపోతే ఎలాగోలా ఎన్నిక వాయిదా వేయించి చైతన్యను ఫినిష్ చేస్తే మాత్రం ప్రయోజనం ఏమిటి? అలా చేస్తే కార్మికులకు మనపట్ల మరింత ద్వేషం కలుగుతుందే తప్ప సానుభూతి పెరగదు కదా? "

గబ్బర్ తల ఎగురవేస్తూ "అదీ నిజమే! ఎలక్షను కాగానే చైతన్యను అరెస్టుచేయించి శాయి కేసులో ఇరికించాలన్నదే మన బాస్ ఆలోచన. ఎలక్షను జరిగి అతను గెలిచాక అరెస్టు చేయించినా కక్షసాధింపుతప్ప మనకు ఒరిగే మరో ప్రయోజనం ఉండదు. రాజకీయంగా ఆలోచిస్తే చైతన్యను హత్యచెయ్యటం మినహా గత్యంతరం కనిపించటం లేదు. నువ్వు అన్నట్లు అలాచేస్తే జనం నాలుగు రోజులు విడ్డూరంగా చెప్పుకునేది నిజమే కానీ ఆ వెంటనే అంతా మర్చిపోతారు. మనం ఎన్ని చేసినా జనం వాటిని మర్చిపోవటం, కాలక్రమేణా మళ్లీ మనకి తల ఒగ్గటం అలవాటేగా...!" అని పళ్ళిగా నవ్వాడు గబ్బర్.

"ఐతే మనం బాసుకు నచ్చచెప్పి చైతన్యకు ముహూర్తం పెడదాం. పథకం ఈసారి పకడ్బందీగా అమలు జరగాళి. కానీ రామ్మూర్తిలా చైతన్య ప్రాణాలతో బైటపడకూడదు" అని "గబ్బర్! శాయి చావుకు, బాంబుప్రేలుళ్లకూ రామ్మూర్తే కారణం అని ఎందుకో అనుమానంగా ఉంది. నువ్వేమంటావ్? " అడిగాడు ఆంజనేయులు గబ్బర్ ముఖంలోకి చూస్తూ.

"అలాంటి అవకాశం లేదు. రామ్మూర్తి పోలీసు కాపలా మధ్య కోరలు తీసిన పాములా ఆ గదిలోనే బుసలు పెట్టటం మినహా బైటికి వచ్చే అవకాశమే లేదు" అన్నాడు గబ్బర్.

ఆంజనేయులు ఆ ప్రసక్తి కట్టిపెట్టి అయ్యరు కోసం చూసాడు. అప్పటికే అయ్యరు ఒకమూలగా నులకమంచం వేసుకుని గాఢంగా నిద్రపోతున్నాడు.

"గబ్బర్! నువ్వు నిదానంగా మందు తాగుతూ కూర్చో! నేను బైటికి వెళ్ళి అర్ధగంటలో తిరిగి వస్తాను. ఆ తర్వాత బాంబుల్ని ఎక్కడికి చేర్చాల్సినవి అక్కడికి చేర్చి ఇద్దరం శివయ్యగారి ఇంటికి వెళ్దాం" అని ఆంజనేయులు కుర్చీలోంచి లేచాడు. తడబడే అడుగులు వేస్తూ నెమ్మదిగా బైటికి వెళ్ళిపోయాడు.

అతగాడి అలవాట్లు గబ్బర్‌కు తెలియనివేం కావు! కడుపులో మందు పడగానే ఆంజనేయులుకు స్త్రీ పొందు కావాలి. భౌతిక సుఖాలు అందించే వ్యాపారపు చిలుకల పంజరాల్లాంటి గుడిసెలకే అతడు వెళ్తున్నాడని గ్రహించి గుంభనంగా నవ్వుకున్నాడు గబ్బర్.

ఆంజనేయులు అయ్యరు గుడిసె హోటలు దాటి మరికొంచెం ముందుకు వెళ్ళి రోడ్డు దిగి, గుడిసెల కేసి నడుస్తున్నాడు. ఆ గుడిసెలకూ, అయ్యరు హోటలుకూ మధ్య గబ్బర్ ఆధీనంలో ఉన్న ఖాళీ స్థలాలున్నాయి. అక్కడ అంతా చీకటిగా ఉంది.

తాగిన మైకంలో తూల్తూ అడ్డదిడ్డంగా అడుగులు వేస్తూ నడుస్తున్న ఆంజనేయుల్ని ఎవరో వెనుకనించి వచ్చి చెయ్యి పట్టుకుని ఆపారు. ఆ హఠాత్సంఘటనకు తత్తరపడుతూ "ఎ...ఎవరూ? " అంటూ తనను నిరోధించిన ఆకారంవేపు చూడగానే ఆంజనేయులు ఉలిక్కిపడ్డాడు.

కండలు తిరిగిన గ్రీకుశిల్పంలా ఎదురుగా కనిపించాడు రామ్మూర్తి.

ఆంజనేయులుకు ఎదురైన ప్రమాదం

అర్థమైంది. మెరుపు వేగంతో జేబులోంచి కత్తిని బైటికి తీసి రామ్మూర్తి మీదికి దూకేం తలోనే రామ్మూర్తి బలంగా పొడిచిన పిడి బాకు అతడి గుండెలోకి గుచ్చుకుంది!

పరిసరాలు ప్రతిధ్వనించేలా "అమ్మా...!" అని అరిచాడు.

రామ్మూర్తి అతడి గుండెలో గుచ్చుకున్న పిడిబాకును బైటికి లాగి కసిదీరా అతని శరీరంమీద ఐదారు పోట్లు పొడిచి పరిసరాలను అప్పుడు గమనించాడు.

ఆంజనేయులు ఆర్తనాదం విని దూరం నుంచి ఎవరో పరుగెత్తుతూ అటువేపే వస్తున్నారు. అయ్యరు హోటల్లోంచి గబ్బర్ బాణంలా దూసుకువస్తూ కనిపించగానే రామ్మూర్తి ఆవేశంతో కంపించిపోతూ అతడికి అభిముఖంగా రెండు అడుగులు వేసాడు. కానీ అంతలోనే వివేకం అతడ్ని వారించింది.

చుట్టుపక్కల ఇళ్లలో లైట్లు వెలుగుతున్నాయి. ఫ్యాక్టరీలనుంచి కూడా జనం అక్కడికి గుంపులుగా వస్తుంటే రామ్మూర్తి క్షణంలోనే పరిస్థితిని అంచనా వేశాడు. ఇక అక్కడ తను ఒక్కక్షణం ఆలస్యం చేసినా పట్టుపడే అవకాశం ఉంది! అయ్యరు హోటలు ముందునుంచి వెళ్తేనే తప్ప ఆస్పత్రికి చేరుకునే అవకాశంలేదు. కానీ, అటువేపునుంచి గబ్బర్, మరికొంతమంది వస్తున్నారు కనుక అటు వెళ్లేందుకు వీల్లేదు.

ఇకపోతే అక్కడ్నించి తప్పించుకుని ఆస్పత్రి దగ్గరికి వెళ్లాలంటే మిగిలిన ఒకే ఒక్కమార్గం ఆ గుడిసెలన్నీ దాటి ఇండస్ట్రియల్ ఏరియాను దాటి, కెమికల్ ఫ్యాక్టరీ వెనుక గుండా చుట్టూ తిరిగి వెళ్లాలి. అలా వెళ్లేందుకు చాలా సమయం పడుతుంది. ఐనా గత్యంతరం లేదు!

రామ్మూర్తి సంధించి విడిచిన బాణంలా ఆ చీకట్లోంచి పరుగు లంకించుకున్నాడు.

రామ్మూర్తి వెళ్లిన రెండు నిముషాల్లోనే గబ్బర్, ఇంకా కొంతమంది జనం అక్కడికి చేరుకున్నారు. అక్కడ కనిపించిన దృశ్యానికి చలించిపోయాడు గబ్బర్!

రక్తపు మడుగులో నిర్జీవంగా పడి ఉన్న ఆంజనేయులు శరీరాన్ని చేత్తో తాకి చూసి, అతను చనిపోయాడని నిర్ధారించుకుని శివయ్యకు ఆ విషయం ఫోన్ చేసి చెప్పాలని హడావుడిగా పారిశ్రామిక వాడ కార్యాలయం దగ్గరికి పరుగు తీశాడు. అక్కడ ఉన్న టెలిఫోన్ బూత్‌నుంచి శివయ్య ఇంటికి ఫోన్ చేశాడు.

"కడప వెళ్లిన పని పూర్తయిందా? " ఫోన్ చేసింది గబ్బర్ అని తెలియగానే శివయ్య ముందుగా అడిగిన ప్రశ్న అది.

"ఆ పని పూర్తి చేసుకునే వచ్చాం కానీ రాగానే మన ఆంజనేయుల్ని ఎవరో అయ్యరు హోటలుకు కొంచెం దూరంలో హత్య చేసేరు" చెప్పేడు గబ్బర్.

హత్యను గురించి వివరంగా అంతా తెలుసుకున్న శివయ్యకు రామ్మూర్తి మీద అనుమానం వచ్చింది. అప్పుడు బాంబు ప్రేలుళ్లలో శాయి చనిపోవటం, ఇప్పుడు ఆంజనేయులు హత్య చెయ్యబట్టం అంతకుమించి తన అనుమానానికి హేతువు తట్టకపోయినా అతని మనసలా శంకిస్తూనే ఉంటే క్షణం ఆలోచించి ఫోన్లో డిఎస్పీతో మాట్లాడేడు శివయ్య. హత్య విషయం చెప్పి రామ్మూర్తిని తను అనుమానిస్తున్న విషయం కూడా హెచ్చరించి వెంటనే ఆస్పత్రికి వెళ్లి అతడ్ని విచారించవలసిందిగా కోరేడు.

శివయ్య ఫోన్లో అలా చెప్పగానే సిబ్బందిని వెంటపెట్టుకొని క్షణాల మీద ఆస్పత్రికి చేరుకున్నాడు డిఎస్పీ.

తన వెయిటింగ్ రూమ్ కిటికీలోంచి బైటికి చూస్తూ కూర్చున్న రమణికి గుండె ఆగినట్లయింది. డిఎస్పీ అలా సిబ్బందితో సహా అక్కడికి రావటం గమనించి హడావుడిగా గది దగ్గరికి పరుగుతీసింది.




కార్లోంచి దిగిన డిఎస్పీ నాలుగే నాలుగు అంగల్లో గది దగ్గరికి వెళ్లి వరండాలో నిలబడి చూసేడు. గది తలుపులు తీసే ఉన్నాయి. గడియ వెయ్యటం, తాళం పెట్టటం జరుగలేదు. బూటు కాల్తో తలుపుల్ని బలంగా తన్ని అవి భళ్లున తెరుచుకోగానే గదిలోపలికి వెళ్లి చూసేడు. ఖాళీ మంచం తప్ప రామ్మూర్తి కనిపించలేదు.

తన పక్కనే వినయంగా నిలబడి భయంతో ఒణికిపోతోన్న కానిస్టేబులు వెంకటస్వామిని చూసి కోపంతో రెచ్చిపోతూ బండబూతులు తిడుతూన్నాడు డిఎస్పీ. కానిస్టేబులు నుంచి ఇంకా చవుకరకం విస్కీ వాసన గుప్పుమని కొడుతోంది.

సరిగ్గా అప్పుడు అక్కడికి చేరుకుంది రమణి. డిఎస్పీతో ఏదో మాట్లాడబోతూ యాదృచ్ఛికంగా వెంకటస్వామి వేపు చూసింది.

ఆమెను మాట్లాడవద్దని కళ్లతోటే సైగచేసి చెప్పి డిఎస్పీ ఎదురుగా వెళ్లి నిలబడి "దొరా! బుద్ధి గడ్డితిని ఈ రోజు ఎక్కువగా తాగి డ్యూటీకి వచ్చాను. ఆ మైకంలో గది తలుపులు వేసి తాళం పెట్టటం మర్చేపోయాను. ఇలా తలుపులు వెయ్యకుండా అజాగ్రత్తగా ఉండటం నాకు ఇవాళ కొత్తేం కాదుకదా దొరా! అలాంటి అజాగ్రత్త వల్లనే ఒక వీధి రౌడీ రాజకీయ నాయకుల అండ చూసుకొని ఇంట్లోకి దూరి నా భార్యను మానభంగం చేసినా చట్టాన్ని కాపాడే కానిస్టేబుల్ని అయ్యుండి కూడా ఆమెను కాపాడలేకపోయాను. వాడిమీద కనీసం కేసు కూడా పెట్టలేకపోయాను. ఆ విషయం మీకు అంతా తెలుసుకదా దొరా! అజాగ్రత్త నాకు కొత్తేం కాదని" అంటూ కానిస్టేబులు వెంకటస్వామి భోరుమని ఏడుస్తుంటే డిఎస్పీ ముఖం వివర్ణమైంది. అయినా మేకపోతు గాంభీర్యం తెచ్చిపెట్టుకుంటూ "యూ ఆర్ సస్పెండెడ్.. గెట్ లాస్ట్!" అని గర్జించి వెంకటస్వామి వరండాలోకి వెళ్లగానే తను కూడా విసురుగా బైటికి వెళ్లేడు. సిబ్బందిని వెంటపెట్టుకొని ఆంజనేయులు హత్య జరిగిన చోటుకు వెళ్లిపోయేడు.

దుర్భరమైన నిశ్శబ్దం పరుచుకుంది అక్కడ. రమణి వరండాలోకి వెళ్లి చూసింది. కానిస్టేబులు వెంకటస్వామి గోడకు చేరగిలపడి దోసిట్లో ముఖం దాచుకుని కూర్చున్నాడక్కడ. అతడ్ని సమీపించి చేత్తో తట్టి పిల్చింది.

అతను నెమ్మదిగా తలెత్తి ఆమెవేపు చూసేడు.

"తప్పును నీమీద ఎందుకలా మోపుకున్నావ్?" అడిగింది.

అతను సమాధానం చెప్పకుండా తాత్వికంగా నవ్వేడు.

"సస్పెండు అయినందుకు బాధపడుతున్నావా?"

"లేదు.. లేదు! గుండెలో ఎంతటి దావానలం దాచుకుని నేను యాంత్రిక జీవనం సాగిస్తున్నానో నా అంతరాత్మకు మాత్రమే తెలుసు. నాకు జరిగిన అన్యాయానికి ప్రతీకారం తీర్చుకోవాలని ఎంత కాలంగా ఎదురు చూస్తున్నానో కూడా నాకు మాత్రమే తెలుసు. ధర్మ సంస్థాపన కోసం కృష్ణపరమాత్ముడు ఈ యుగంలో అవతరిస్తాడో లేదో నాకు తెలియదుకానీ ఆ కర్తవ్యాన్ని కొంతవరకైనా రామ్మూర్తి నిర్వర్తిస్తుంటే అతనికి సహకరించటం ధర్మంగా తోచి ఇలా చేస్తున్నానమ్మా"

"ఇందాక డిఎస్పీతో నువ్వు మాట్లాడుతుంటే అంతా విన్నాను. ఒక వీధి రౌడీ అంత కిరాతకంగా మీ కుటుంబంపట్ల ప్రవర్తిస్తే మీ పోలీసుశాఖ మీకే న్యాయం చెయ్యలేదంటే ఆశ్చర్యంగా ఉంది"

"ఏం చేస్తాం. అతను శివయ్యకు ముఖ్యమైన అనుచరుడు. మా అధికారులు శివయ్యకు నమ్మకస్తులైన బానిసలు"

"ఇంతకూ ఆ వీధి రౌడీ ఎవరూ"



"ఆంజనేయులు!" అని చెప్పేడు కానిస్టే బులు వెంకటస్వామి.

★ ★ ★

**అందరూ** ఎదురు చూస్తోన్న కెమికల్ ఫ్యాక్టరీ యూనియన్ ఎన్నికలు ఆరోజే!

బందు సందర్భంగా జరిగిన అల్లర్ల కేసులో పోలీసులు శివయ్య చెప్పినట్లు అమ రలింగాన్ని అరెస్టు చేసి రోజులు గడు స్తున్నా అతని విషయం ఎవ్వరూ పట్టించు కోవటంలేదు. బెయిలు కూడా రాక అత నింకా రిమాండులోనే సబ్ జెయిల్లో ఉన్నాడు. అతని అనుచర కార్మికులు మాత్రం యూనియన్ ఎన్నికల పనుల్లో శివయ్య వర్గంతో కలిసి చాలా హడావుడిగా తిరుగుతున్నారు.

ఎన్నికలకు నాలుగు రోజుల ముందే గాంధీ ఒక ప్రకటన పత్రికలకు ఇచ్చేడు. శాంతి కాముకులైన తాము ఐక్యవేదిక హత్యా రాజకీయాలను ప్రతిఘటించేందుకూ ఐక్యవేదికను ఓడించేందుకూ భావ సారూ ప్యతగల శివయ్య వర్గాన్ని యూనియన్ ఎన్నికల్లో సమర్థిస్తున్నట్లు గాంధీ ఆ ప్రకట నలో పేర్కొన్నాడు.

అలా శివయ్య వర్గం కార్మికుల ఐక్యవేదిక రెండు శత్రు శిబిరాలుగా మోహరించి ఎన్ని కల్లో విజయం సాధించేందుకు చాలా రోజు లుగా చేస్తోన్న ప్రయత్నాల ఫలితం వెలు వడే ఎన్నికల రోజు రానేవచ్చింది.

సుందరి ప్రొద్దున్నే ముస్తాబైంది. తమ పెళ్లి సందర్భంగా రామ్మూర్తి స్వహస్తాలతో మగ్గంమీద నేసిన జరీచీర కట్టుకొని యూని యన్ కార్యాలయం దగ్గరికి చేరుకుంది.

చైతన్య, ఇంకా చాలామంది ఐక్యవేదిక కార్యకర్తలు కెమికల్ ఫ్యాక్టరీకి కొంచెం దూరంగా నిలబడి కార్మికులను తమ ప్యాన ల్‌కు ఓట్లు వెయ్యవలసిందిగా కోరుతు న్నారు. వాళ్లకు అటువేపు శివయ్య వర్గం వాళ్లు కూడా అదే పనిలో నిమగ్నమై ఉన్నారు.

ఉదయం ఎనిమిది గంటలకల్లా పోలింగు మొదలైంది.

కెమికల్ ఫ్యాక్టరీ ఎడ్మినిస్ట్రేటివ్ బిల్డిం గులో పోలింగు బూతుల్ని ఏర్పాటు చేసి అక్కడ భారీగా. పోలీసు బందోబస్తును మోహరించారు.

కడపనుంచి శివయ్య నేర్పుగా బాంబులు విసిరే గ్యాంగుల్ని రప్పించాడనీ, ఏ నిము షంలోనైనా ఆ గ్యాంగులు రంగంలోకి దిగ వచ్చుననీ వార్త ప్రచారంలోకి రానే వచ్చింది. త్వరగా ఓట్లువేసి ఇళ్లకు వెళ్లిపో వాలన్న ఉద్దేశంతో కార్మికులు పోలింగు బూతు దగ్గరికి ముందుగానే చేరుకుని ఓట్లు వేసేందుకు బారులుతీరి నిల్చున్నారు.

పోలింగు మొదలై ఒక గంట గడిచింది.

శివయ్య శిబిరం దగ్గర అతని గూండా అనుచరులు, గాంధీ అతని వెంట కొద్ది మంది కార్మికులూ తప్ప మరెవ్వరూ లేరు. గబ్బర్ బృందం, అతను మాట్లాడి తెచ్చిన ఇతర గ్యాంగులూ అయ్యరు హోటలు దగ్గర సిద్ధంగా ఉండి శివయ్య ఆదేశాలకోసం చూస్తున్నారు తప్ప ఓటర్లు అంతగా శివయ్య పక్షాన ఎక్కడా కనిపించటంలేదు. కడప నుంచి వస్తాయనుకున్న గ్యాంగుల కోసం ఆత్రంగా ఎదురు చూస్తూ ఎన్నికల కార్యాలయంలో చిందులు తొక్కుతోన్నాడు శివయ్య. క్షణక్షణానికీ అతనిలో ఆవేశం, కసి పెరుగుతోంది.

మరో గంట అలా గడిచింతర్వాత పోలీసు అధికారి ఒకరు డిఎస్పీ ఆదేశం మీద శివయ్య దగ్గరికి వచ్చి "సార్ పరిస్థితి మీకు అనుకూలంగాలెదు. జరిగిన రెండు గంటల పోలింగులో నలభై శాతం ఓట్లు పోలైతే అందులో మీ ప్యానల్‌కు మహా పడితే పది శాతం ఓట్లు పడి ఉంటాయని డిఎస్పీగారు చెప్పమన్నారు" అని సమా చారం అందించి వెళ్లిపోయేడు.

శివయ్య ఆగ్రహంతో కంపించిపోతూ




చేతికి అందుబాట్లో బల్లమీద ఉన్న ఫ్లవర్ వాజును చేత్తో పైకెత్తి దూరంగా విసిరేడు. అది భళ్లున పగిలి గాజుముక్కలు దూరంగా ఎగిరిపడ్డాయి. "అరే గబ్బర్!" అంటూ పెద్దగా అరిచేడు శివయ్య.

ఎవరో గబ్బర్ని పిలుచుకొని వచ్చేందుకు అయ్యారు హోటలు దగ్గరికి పరుగుతీసేరు.

శివయ్యనే అలా నిర్ఘాంతపోయి చూస్తూ మౌనంగా ఆలోచిస్తోన్నాడు గాంధీ. అధికారం అంతరించే అంతిమ సమయంలో ఉన్మాదంతో ఊగిపోతూ వెర్రిగా అరుస్తోన్న నియంతలా ఉన్నాడు శివయ్య.

గబ్బర్ వచ్చేడు. పొద్దుట్నించి అయ్యారు హోటల్లో కూర్చుని విపరీతంగా తాగేడతను. కళ్లు కొలిమిల్లా ఎర్రగా మండుతోన్నాయి. మాటలు నంగిగా వస్తోంటే ఎంతో ప్రయత్నం మీద కూడపలుక్కుంటూ "బాస్ కడప గ్యాంగు ఇంకో గంటలో వస్తుందని సమాచారం అందింది" అన్నాడు శివయ్యతో.

"ఎందుకురా బాంబులూ, గ్యాంగులూ? అంతా సర్వనాశనమైంది. మనం ఓడిపోవటం ఖాయంరా గబ్బర్"

"ఏం చేద్దామో చెప్పండి బాస్! బాంబుల వర్షం కురిపించేదా? పోలింగు బాక్సుల్ని గల్లంతు చేసేదా? " కళ్లు విప్పారుస్తూ బొంగురు గొంతుతో అడిగేడు గబ్బర్.

"నువ్వేం చేస్తావన్నది నాకు అనవసరం. పోలింగు మాత్రం ఆగిపోవాలి. శవాల మీంచి నడిచి వెళ్లయినా కార్యం సాధించాలి. ఎలాగైనా ఓటమి నుంచి బైటపడాలి" అన్నాడు శివయ్య ఆవేశంగా.

గబ్బర్ అక్కడ క్షణం కూడా ఆలస్యం చెయ్యలేదు. మెరుపు వేగంతో అయ్యారు హోటలు దగ్గరికి వెళ్లి సీసాలో మిగిలిన విస్కీ మొత్తాన్ని గటగటా తాగి ఖాళీసీసాను దూరంగా విసిరేస్తూ "బాస్ ఆర్డరైంది. ఇక వెళ్దాం పదండి" అన్నాడు అనుచరులతో.

ఎవరో వెళ్లి పక్క గుడిసెలోంచి బాంబుల పెట్టెలు తెచ్చి గబ్బర్ ముందు పెట్టేరు. వేగంగా పెట్టెలు తెరిచి తలా రెండు బాంబుల్ని చేతులతో పట్టుకుని సమరానికి సమాయత్తమై కెమికల్ ఫ్యాక్టరీ దగ్గరికి వెళ్లేందుకు సిద్ధమయ్యారు.

గబ్బర్ ఒక ఖాకీ సంచిని భుజానికి తగిలించుకొని అనుచరులతో కలిసి వెళ్లబోతోంటే శివయ్య, గాంధీ అక్కడికి వచ్చి గబ్బర్ను పక్కకు పిలిచేరు.

అయ్యారు కళ్లన్నీ గబ్బర్ భుజానికి వేలాడ్తోన్న సంచిమీదే ఉన్నాయి. ఆ ఖాకీ సంచిలో అత్యంత శక్తివంతమైన బాంబులే కాకుండా వైర్లు అమర్చి వెలిగిస్తే పెద్దపెద్ద భవనాలను కూడా క్షణంలో ధ్వంసం చెయ్యగల బాంబులు కూడా ఉన్నాయి. ఆ విషయం అయ్యారుకు గబ్బరే చెప్పేడు మైకంలో.

"మన గాంధీ ఏమిటో అంటున్నాడు. అది విన్న తరువాత మాత్రమే ఏం చెయ్యాలో ఎలా చెయ్యాలో ఆలోచించు" అని. గాంధీ వేపుకు తిరిగి "ఆ.. గాంధీగారూ! ఆ విషయం గబ్బర్తో మీరే చెప్పండి" అన్నాడు శివయ్య.

"గబ్బర్! విషయం ఏంటంటే. జిల్లా కలెక్టరు జోక్యంతో ఫ్యాక్టరీ పరిసరాల్లో అంతటా వీడియో కెమేరాలు అమర్చేరు. మనం ఏం చేసినా ఆ కెమేరాలు స్పష్టంగా రికార్డు చేస్తాయి. పోలింగు జరిగే ఎడ్మినిస్ట్రేటివ్ బిల్డింగులోనూ, చుట్టుపట్లా స్థానిక పోలీసులను కాకుండా కేంద్ర పోలీసు బలగాలను నియమించారు. ఇలాంటి పరిస్థితుల్లో బూతులమీద దాడి చెయ్యటం వివేకం కాదు. పైగా ప్రమాదం" అని చెప్పేడు గాంధీ.

"ఇక పోలింగు ఆపటం సాధ్యం కానట్లే! ఎంత ఆలోచించినా మరో మార్గం తోచటం లేదు. ఏం చేద్దాం? " అని తనలోతనే గొణుగుతోన్న శివయ్య పరిస్థితిని అర్థం చేసుకు

న్నాడు గబ్బర్. ఏదో ఒక దృఢమైన నిర్ణ యానికి వస్తూ,

"బాస్! అధైర్యపడకండి. నేను ఒంటరి గానే వెళ్లి పోలింగు ఆపివేస్తాను" అన్నాడు గబ్బర్ ఆకాశంలో మేఘాలు ఢీకొని ఉరు ములు ఉరిమినట్టు!

"ఎలా సాధ్యం? " అడిగేడు గాంధీ.

"చెప్పను చేసి చూపిస్తాను" అని గబ్బర్ అక్కడ్నించి కదిలి తన అనుచరుల దగ్గరికి వెళ్లేడు. వాళ్లందర్నీ ఫ్యాక్టరీ ముందు గుమి కూడి మళ్లీ ఆదేశాలు అందేదాకా అక్కడే ప్రశాంతంగా ఉండమని చెప్పేడు.

అలా చేస్తే అందరి దృష్టి వాళ్లవేపుకు మళ్లుతుందనీ, ఆ సమయంలో తన పని ముగించుకుని రావాలనీ ఆలోచించేడు గబ్బర్.

అనుచరులందరు ఫ్యాక్టరీ వేపుకు వెళ్ల గానే గబ్బర్ వేగంగా నడుస్తూ వెళ్లిపో యేడు.



**పొ**య్యిమీదున్న గిన్నెలో టీ మరుగు **తుంటే** అయ్యరు స్టౌమంట తగ్గించి తలెత్తి ఒకసారి పరిసరాలను గమనించేడు. జనం అక్కడక్కడా గుంపులుగా నిలబడి పోలిం గును గురించే మాట్లాడుకుంటున్నారు. వాళ్లు తనను గమనించటం లేదని నిర్ణయిం చుకుని నెమ్మదిగా హోటల్లోంచి బైటికి వచ్చేడు అయ్యరు. అక్కడ క్షణంసేపు నిల బడి వేగంగా కదిలి పక్క వీధిలోంచి ఐక్య వేదిక కార్యాలయం దగ్గరికి వెళ్లేడు.

సుందరి అప్పుడే ఫ్యాక్టరీ దగ్గర్నించి కార్యాలయానికివచ్చింది. అడిగినవాళ్లకు తనకు తెలిసిన సమాచారం చెప్పటం ఎవ రైనా వచ్చి ముఖ్యమైన సమాచారం ఏదైనా చెప్తే దాని ప్రాముఖ్యతనుబట్టి ఫ్యాక్టరీ దగ్గరే ఉన్న చైతన్యకు చేరవెయ్యటం చేస్తుంది సుందరి.

రమణి అక్కడికి వచ్చింది. "హాయ్ సుందరీ! మీరు విజయం సాధించబోతో న్నట్లు జనం చెప్పుకుంటున్నారు కంగ్రాట్స్" అని ముందుగానే అభినందించి సుందరి ఎదురుగా ఉన్న కుర్చీలో కూర్చుంది.

"మా వారు ఎక్కడున్నారు? " అడిగింది సుందరి.

"అక్కడే! తూర్పు కొండల దగ్గర అడ విలో కార్మికులను ప్రొద్దున్నే వెళ్లి ఓట్లువేసి రమ్మని తొందర పెడుతూ ఆయన కూడా ఎన్నికల పనిలోనే ఉన్నారు" చెప్పింది రమణి.

సుందరి మళ్లీ ఆమెను ఏదో అడగబో యేంతలో అయ్యరు వచ్చేడు. సుందరిని బైటికి పిలిచి చెవిలో ఏదో రహస్యంగా చెప్పి వేగంగా వెనుదిరిగి వెళ్లిపోయేడు.

సుందరి ఒక్క క్షణం ఆలోచించింది. గబ్బర్ బాంబుల సంచిని వెంట తీసుకొని కెమికల్ ఫ్యాక్టరీ దగ్గరికి వెళ్తోన్నాడని అయ్యరు చెప్పిన విషయాన్ని చైతన్యకు తెలి యజేస్తే అక్కడ వాళ్ల పనికి అంతరాయం కలుగుతుంది. వాళ్లంతా గబ్బర్‌కోసం వెడితే ఆ సమయంలో ప్రత్యర్థులు కొత్త ఎత్తులు వెయ్యటం జరుగవచ్చు లేదా గబ్బర్ వర్గంతో ఘర్షణ మొదలై ప్రశాం తంగా తమకు అనుకూలంగా జరుగుతున్న పోలింగుకు అంతరాయం కలుగవచ్చు అందువల్ల తనే స్వయంగా వెళ్లి గబ్బర్ కద లికల్ని గమనించాలని అనుకుంది సుందరి.

రమణిని అక్కడే ఉంచి హడావుడిగా బైటికి వెళ్లిపోయింది.

గబ్బర్ తల వంచుకుని వేగంగా నడుస్తున్నాడు. కెమికల్ ఫ్యాక్టరీ మెయిన్‌గేటుకు కొంచెం దూరంలో ఒక్క క్షణం ఆగి తలెత్తి అటువేపుకు చూసేడు. నిజమే గాంధీ చెప్పినట్లు అక్కడ బందోబస్తు చాలా కట్టుదిట్టంగా ఉంది. తల ఒంచుకుని మళ్లీ నడవ సాగేడు. ఫ్యాక్టరీ ప్రహరీ గోడను చుట్టివెడుతూ పది నిముషాల్లో వెనుకవేపుకు చేరుకున్నాడు.

మెయిన్‌గేటు దాటగానే ఉంది ఎడ్మినిస్ట్రేటివ్ బిల్డింగు. అక్కడ జన సంచారం, పోలీసుల హడావుడీ ఉందికానీ ఫ్యాక్టరీ వెనుక అంతా నిశ్శబ్దంగా ఉంది.

గబ్బర్ ఒక్కక్షణం అలుపు తీర్చుకొని తలెత్తి చూసేడు, ప్రహరీగోడ పక్కనే ఉన్న ఓ పెద్ద చింతచెట్టూ, దాని కొమ్మలు గోడ మీదికి విస్తరించి కనిపించేయి.

భుజానికి వేలాడ్తోన్న సంచికి ఏమాత్రం ఒత్తిడి తగలకుండా జాగ్రత్తగా చెట్టు ఎక్కి కొమ్మలమీంచి గోడమీదికి చేరుకున్నాడు గబ్బర్. తనను ఎవరైనా గమనించారా? అన్నట్లు ఒకసారి చుట్టూ చూసి అమాంతం ఫ్యాక్టరీ ఆవరణలోకి దూకేడు. అక్కడి పొదలచాటున నక్కి కూర్చుని బిల్డింగుకేసి చూపులు సారించాడు.

ఎవ్వరూ చూడకుండా ఆ ఎడ్మినిస్ట్రేటివ్ బిల్డింగు వెనక్కు చేరుకుని బాంబులు పేర్చి పేల్చగల్గితే అంతా సవ్యంగా జరిగిపోతుంది. బిల్డింగు మొత్తం ధ్వంసమై పోలింగు బాక్సులు, సిబ్బంది, ఓటర్లు, పోలీసులూ అంతా విస్ఫోటనంలో తునాతునకలై రక్తపు ముద్దల్లా మానవ శరీరాల శకలాలు దూరంగా ఎగిరిపడుతోంటే...

ఆ దృశ్యాన్ని ఊహించుకోగానే గబ్బర్ శరీరం పులకించింది. జేబులోంచి విస్కీ సీసా బైటికి తీసి ఒకే విడతగా మొత్తం తాగి ఖాళీ సీసా తుప్పల్లోకి విసిరేడు. మందు నెమ్మదిగా తలకెక్కుతోంది.

ఇప్పుడు గబ్బర్ కళ్లముందు కదిలిపోతోన్న దృశ్యాలు అతడ్ని మరింత మానసిక వత్తిడికి గురిచేస్తూంటే బాంబు విస్ఫోటంలో శరీరం చితికిపోయిన శాయి, కత్తిపోట్లకు గురై మరణించిన ఆంజనేయులు, ఓటమి అంచున నిలబడి దీనంగా చూస్తోన్న శివయ్య, విజయపథంలో సాగిపోతూ తనను చూసి హేళనగా నవ్వుతోన్న రామ్మూర్తి, సుందరి, చైతన్య...

పళ్లు పటపటా కొరుకుతూ ఆవేశంగా లేచి నిల్చున్నాడు గబ్బర్. చెట్లనూ, పొదలనూ చాటు చేసుకుంటూ కొంచెం ముందుకు వెళ్లి చూసేడు. సరిగ్గా అప్పుడే కొంతమంది సాయుధ పోలీసులు బిల్డింగు వెనక్కు వచ్చి అక్కడ చెట్లకింద తాపీగా కూర్చున్నారు.

ఇక బిల్డింగు వెనక్కు వెళ్లి బాంబులు అమర్చి పేల్చే అవకాశం లేదు. ఒకవేపు తొందర పెడుతోన్న ఆవేశం, మరోవేపు ఏమీ చెయ్యలేని నిస్సహాయతా... బూటుకాళ్లతో పొదలను కసిగా తన్ని భోర్న ఏడుస్తూ కూలబడిపోయేడు గబ్బర్.

క్షణాలు దొర్లిపోతోన్న కొద్దీ దుఃఖం ఉపశమించింది. క్రోధం అతడి గుండె లోతుల్లోంచి పెల్లుబుకుతూ మెదడు రాక్షసుల కర్మాగారమై ఉన్మాదంతో ఊగిపోతూ సంచీలోంచి బాంబుల్ని బైటికి తీసేడు.

ప్రహరీగోడను ఆనుకుని వరుసగా ఉన్న గ్యాస్ స్టోరేజి టాంకుల మీదికి చూపులు గుచ్చేడు. క్షణం తర్వాత ఎవరో మంత్రించి పంపించినట్లే అక్కడికి వెళ్లి గ్యాస్ టాంకులకు ప్లాస్టర్తో బాంబులు అమర్చేడు. వాటి వైర్లను మరొక పొడవాటి వైరుకు కలిపి ఆ వైరును చింతచెట్టు కొమ్మలదాకా పరిచేడు.

ఆ వైరుకు నిప్పు అంటిస్తే అది కాలి బాంబులు పేలేందుకు కొంత సమయం పడుతుంది. ఆ సమయంలో గోడమీంచి బైటికి దూకి సురక్షితంగా వెళ్లిపోవచ్చునని



నిర్ణయించుకున్నాడు గబ్బర్.

"ఏయ్ గబ్బర్ ఆగు! మూర్ఖంగా ప్రవర్తించకు! నువ్వు చేస్తోన్న పని ఎంత ప్రమాదకరమో తెలుసా?" అన్న మాటలు గోడ మీంచి వినిపించేయి.

అగ్గిపుల్ల గీసి వైర్ను అంటించబోతోన్న గబ్బర్ ఉలిక్కిపడి తలెత్తి చూసేడు. సుందరి కనిపించింది. అప్పుడు కాలం విలువ అనంతం. తన తొట్రుపాటును నిగ్రహించుకుంటూ అగ్గిపుల్ల వెలిగించేడు.

సుందరి క్షణం ఆలస్యం చెయ్యకుండా గోడమీంచి అమాంతం గాల్లోకి ఎగిరి అతడిమీదికి దూకింది. ఇద్దరూ ఆ విసురుకు తూలి కిందపడిపోయేరు.

క్షణం ఆలస్యం జరిగినా జరిగే అనర్థం తెలిసిన సుందరి, ఆ అవకాశం కోల్పోకుండా ఎట్టి పరిస్థితుల్లోనూ బాంబులు పేల్చాలనుకున్న గబ్బర్ ఇద్దరూ లేచి నిల్చున్నారు.

గబ్బర్‌కు గత్యంతరం కనిపించలేదు, జేబులోంచి కత్తిని బైటికి తీసి సుందరి కడుపులో రెండు పోట్లు పొడిచేడు. ఆమె నోటి నుంచి ఎలాంటి శబ్దం వెలువడకుండా ఒక చేత్తో ఆమె కంఠనాళాల దగ్గర బలంగా బిగించి పట్టేడు.

ఒక నిముషంలోనే సుందరి నిశ్శబ్దంగా కిందికి జారి నేలమీద పడిపోయింది. బాంబుల వత్తికి నిప్పు అంటించి వేగంగా గోడ ఎక్కి చెట్టుమీంచి కిందికి దిగి పరుగు లంకించుకున్నాడు గబ్బర్.

కాల్తోన్న వైరునుంచి కదిలే నిప్పు ముద్దల్లే గ్యాసు టాంకర్లవేపుకు వేగంగా దూసుకుపోతోంది. గుండ్రని మంట.

★ ★ ★

విస్ఫోటనం! చెవులు గళ్లుపడేలా భయంకర విస్ఫోటనం! గ్యాసు టాంకర్లు పేలిపోతున్నాయి. సీసాల్లో ఎంతో కాలంగా బంధించబడ్డ పొగదెయ్యాలు పైకి లేచినట్టు నీలిరంగు విషవాయువు మృత్యుమేఘాల్లా టాంకర్లనుంచి బైటపడి వీస్తోన్న గాలి వెంట ఊరికి పడమటి దిశగా సాగిపోతోంది.

ఆ విస్ఫోటనాలకు కెమికల్ ఫ్యాక్టరీ ఎడ్మినిస్ట్రేటివ్ బిల్డింగు కూడా కంపిస్తోంటే అక్కడ ఉన్న వాళ్లంతా గుండెలవిసిపోతూ నిశ్చలంగా నిల్చుండిపోయేరు.

ఆ గ్యాసు ఎంత ప్రమాదకరమైందో తెలిసిన ఫ్యాక్టరీ సిబ్బంది "పారిపోండి... పారిపోండి" అని గొంతు చించుకుని అరుస్తూ తాము కూడా ప్రాణాలు దక్కించుకుందుకు పరుగు ప్రారంభించేరు. కానీ అప్పటికే ఆ విషవాయువులు కారు మబ్బుల్లా పరిసరాలను కమ్మివేసేయి క్షణంలో.

తూర్పు కొండల వెనుక అడవిలో తలదాచుకున్న రామ్మూర్తికి ఆ విస్ఫోటనం వినిపించగానే కెమికల్ ఫ్యాక్టరీ దగ్గర శివయ్య వర్గం బాంబులతో దాడి ప్రారంభించి ఉంటుందని భావించేడు. అడవినుంచి పరుగెత్తుతూ పది నిముషాల్లో కార్మిక వాడకు చేరుకున్నాడు.

"కెమికల్ ఫ్యాక్టరీ గ్యాసు టాంకర్లు పేలిపోయి విషవాయువులు వ్యాపిస్తోన్నాయి. పారిపోండి... పారిపోండి" అన్న అరుపులు వినిపిస్తోంటే వాడలోని జనం తోచిన దారులగుండా ఎలాంటి గమ్యమూ లేకుండానే పరుగులు తీస్తోన్నారు.

రామ్మూర్తి ఒక ఎత్తైన బండరాయి మీదికి ఎక్కేడు. తల ఎత్తి కెమికల్ ఫ్యాక్టరీ ఉన్న దక్షిణంవేపుకు చూసేడు. ఆకాశంలో నీలి మబ్బుల్లా గాలివాటుకు కదలిపోతూ క్రమంగా విచ్చిపోతున్న విష వాయువులు అక్కడికి స్పష్టంగానే కనిపించేయి.

రామ్మూర్తి గుండె ఝల్లుమంది. తన వాళ్లంతా ఫ్యాక్టరీ దగ్గరే ఉన్న విషయం మననం చేసుకుంటూ అమాంతం బండరాయి మీంచి కిందికి జారి అటువేపుకు పరుగుతీసేడు.

ఊరంతా హాహాకారాలు వినిపిస్తు




న్నాయి. రోడ్ల మీద వాహనాలు ట్రాఫిక్కు నిబంధనలను విస్మరించి ఊరికి సాధ్యమైనంత దూరంగా పారిపోయే ప్రయత్నంలో అడ్డదిడ్డంగా నడుపుతూ వెళ్తోన్నారు.

ఆ వాహనాలను తప్పించుకుంటూ వేలాదిమంది జనం భార్యాబిడ్డలతో సహా ప్రాణ భయంతో పారిపోతూ మధ్యమధ్యలో ఆకాశంకేసి చూస్తున్నారు భయంభయంగా.

ఎవ్వరూ ఇళ్లకు తాళాలు కూడా వెయ్యకుండానే తమ సమస్త ఆస్తులనూ ఎక్కడివి అక్కడే విడిచిపెట్టి వెళ్లిపోయేరు. పారిపోతోన్న ప్రతిక్షణం ఒక యుగంలా భావిస్తూ ప్రాణాలు దక్కితే అంతే చాలుననుకుంటున్నారు.

అప్పుడు ప్రతి మనిషీ కోరేది తన ప్రాణం తప్ప మరేదీ లేదు! సహజమైన వ్యామోహాలు ఎవ్వరికీ గుర్తుకు రావటం లేదు ప్రాణం తప్ప. ఇళ్లకూ ఆస్తులకూ, అధికార పీఠాలకూ యజమానులు ఎవ్వరూ లేరు. ఎక్కడైనా యధేచ్ఛగా తలదాచుకోవచ్చు.

అక్కడ పోలీసులు లేరు. చట్టంలేదు. దాన్ని పరిరక్షించే యంత్రాంగం లేదు. ప్రభుత్వం లేదు. దండనలు లేవు. న్యాయస్థానాలూ, జైళ్లూ లేవు. తన మనుగడకు మనిషి సృష్టించుకున్న వ్యవస్థంతా ధ్వంసమై అప్పుడు మనిషికి మిగిలింది ప్రాణభయం ఒక్కటే.

"ఏయ్! పిచ్చి పట్టిందా. ఫ్యాక్టరీ వేపుకు వెళ్తున్నావ్? " రామ్మూర్తికి ఎదురుగా ఉరుకుతూ మందలించేరెవరో.

"ఏం జరిగిందో చెప్పరూ? "

"అంతా సర్వనాశనమైంది. విషవాయువు నరమేధం సాగిస్తోంది. అంతటా పీనుగలే! విషవాయువు పీల్చగానే రక్తం కక్కి చస్తున్నారు. ఆస్పత్రులు లేవు. డాక్టర్లూ, సిబ్బందీ ఎప్పుడో పారిపోయారు. నువ్వూ వెనక్కు తిరిగి వెళ్లిపో... ప్రాణాలు దక్కించుకో"

"ఎలా పారిపోను? నా వాళ్లంతా ఫ్యాక్టరీ దగ్గరే ఉన్నారు"

"అయితే వెళ్లి నువ్వూ చావు" అని అతను పరుగెత్తుతూ వెళ్లిపోయేడు.

రామ్మూర్తి ఫ్యాక్టరీ వేపుకు దూసుకుని వెళ్తోంటే ఫ్యాక్టరీ సమీపంలోకి వెడుతోన్న కొద్దీ రోడ్డు మీద శవాలు గుట్టలు గుట్టలుగా. అక్కడ నరమేధం ముగించుకుని విషవాయు మేఘాలు గాలివాలుకు దూరంగా వెళ్లిపోయేయి.

పారిశ్రామిక వాడకు చేరుకున్నాడు రామ్మూర్తి.

మంచినీటి చెరువును పూడ్చి ఫ్యాక్టరీలు కట్టిన స్థలం అదే! భవనాలు, రోడ్లు, విద్యుద్దీపాలు, మురుగు కాల్వలు, టెలిఫోన్ స్తంభాలూ అన్నీ చెక్కు చెదరకుండా అలాగే ఉన్నాయి కానీ ఆ సౌకర్యాలన్నింటినీ ఏ మనుషుల కోసమైతే కనుగొన్నారో ఆ మనుషులు మాత్రం నిర్జీవులై వీధుల్లో పడి ఉన్నారు దిక్కులేని శవాలై.

గల్లా పెట్టెమీద తలవాల్చి డబ్బుల్ని గుండెకు హత్తుకుని చనిపోయేడు హోటలు అయ్యరు. సుఖాల వ్యాపారంతో వేళకింత అన్నం తింటూ గబ్బుర్ని బతికిస్తోన్న చిలుకలు రోడ్డువారగా పడి ఉన్నాయి చలనరహితంగా.

రామ్మూర్తి ఐక్యవేదిక కార్యాలయం దగ్గరికి పరుగు తీస్తున్నాడు, గత కాలపు జ్ఞాపకాల అలల మధ్య సుళ్లు తిరుగుతూ.

ఆ మంచినీటి చెరువు మీంచి ఆహ్లాదకరమైన ఎంచక్కని గాడ్పులు వీచేవి. నీటి పిట్టలు అలలమీద తేల్తూ తమకంగా కదుల్తూ ఎంతగా ఆనందంలో తేలిపోయేవో. తుళ్లిపడే వెండిచేపలూ, నీటిమీంచి పరావర్తనం చెంది కళ్లను జిగేల్మనిపించే సూర్యకిరణాలు. సాయం సంధ్యకల్లా పంట చేలమీంచి వీస్తోన్న పరిమళ పూరితమైన గాలిని సందిట్లో బంధించి గట్ల మధ్య పులకించి కదిలే నీటి అలలూ, తుడుచుకుని

ముస్తాబైన అద్దంలా ఆకాశం. మినుకు చుక్కల్ని మెరుపు చుక్కల్ని చేసేందుకు సమాయత్తమవుతూ ఆ మంచినీటి చెరువు, ఆ చెరువుగట్టున చంద్రోదయం, తర్వాత సాధువు తాత తత్త్వాలూ, ఆ తత్త్వాలు పాడేప్పుడు అతడి కంఠంలో ఒణికే జీవితపు విషాదం.

రామ్మూర్తి కళ్ల వెంట కన్నీళ్లు ధారాపాతంగా కురుస్తున్నాయి.

ఐక్యవేదిక కార్యాలయం వచ్చింది. లోపలికి వెళ్లేడు రామ్మూర్తి. కన్నీటి పొరల గుండా దృశ్యాలన్నీ బూజరగా కనిపిస్తున్నాయి. అక్కడ సుందరి కనిపిస్తుందని ఆత్రంగా చూసేడు. సుందరి కనిపించలేదు. కుర్చీల పక్కగా కింద నిర్జీవంగా పడి వుంది రమణి.

సుందరి ఫ్యాక్టరీ దగ్గరే ఉందేమో అనుకుని వేగంగా బైటికి వచ్చి మళ్లీ పరుగు ప్రారంభించేడు రామ్మూర్తి.

మనిషి అవసరాలకోసం గుర్రాల నెత్తురు పిండి మందులు తయారుచేసే కంపెనీ దగ్గర గుట్టలుగా పడి చనిపోయిన గుర్రాలూ, వాటి మధ్యలో రక్తం తీసే మనుషులూ.

దారిలో శివయ్య ఎన్నికల కార్యాలయం కనిపించింది. అది మనిషి రాగద్వేషాలకూ, ఈర్ష్య అసూయలకూ, కక్షలూ కార్పణ్యాలకూ అతీతమై, అనంతమైన ఆవేదనలో పుటం పడి కాలిపోతూ మాలిన్య రహితమై మనసు వికశించే అరుదైన సమయం.

కార్యాలయం లోపలికి తొంగి చూసేడు రామ్మూర్తి.

కార్యకర్తల శవాల మధ్య గాంధీ, ఆ శవాలకు కొంచెం దూరంగా గబ్బర్ శవం.. శివయ్య కనిపించలేదు.

రామ్మూర్తి బైటికి వచ్చేడు. కెమికల్ ఫ్యాక్టరీ వేపుకు దూసుకొని వెళ్లేడు. అప్పుడే రెస్క్యూ ఆపరేషన్సు మొదలైనట్టుంది. వైద్య, ఆరోగ్య శాఖవాళ్లూ, పోలీసులూ వాహనాల్లో హుటాహుటిగా వస్తున్నారు. వీధుల్లోంచి శవాలను వాహనాల్లో తరలిస్తున్నారు. శవాల గుట్టల్లో ఇంకా ప్రాణాలు కోల్పోకుండా కొట్టుకుంటోన్న వాళ్లను పక్కకు తీసి ప్రథమ చికిత్స చేస్తున్నారు.

ఫ్యాక్టరీ మెయిన్ గేటుదగ్గర కనిపించిన అనంతరామయ్య శవాన్ని చూడగానే రామ్మూర్తి పెద్దగా ఏడ్చేడు.

అప్పుడే ఫ్యాక్టరీ ఆవరణలోంచి ఎవరో ఒక స్త్రీని స్ట్రెచర్‌మీద మోసుకుంటూ ప్రథమ చికిత్స చేస్తోన్న డాక్టర్ల బృందం దగ్గరికి తెచ్చి కింద పెట్టేరు.

"డాక్టర్! ఈమె ఎవరో కత్తి పోట్లకు గురై ఫ్యాక్టరీ వెనుక పడిఉంది. గాలి ఈ వేపుకు వీచింది కనుక గ్యాస్ ప్రభావం ఆమెమీద లేదుకానీ కత్తిపోట్లవల్ల చాలా రక్తం పోయింది!" అంటోన్న మాటలు రామ్మూర్తికి వినిపించేయి.

రెండేరెండు అంగల్లో అక్కడికి దూకి స్ట్రెచర్‌వేపు చూసేడు. ఆమె సుందరే! "సుందరీ!" అని గావుకేక పెట్టి ముందుకు ఒంగి ఆమె చేతిని తన చేతుల్లోకి తీసుకున్నాడు. ఆమె నాడి ఇంకా కొట్టుకుంటూనే ఉంది.

"డాక్టర్! ప్లీజ్ సేవ్ హర్..." అంటూ దీనంగా చూసేడు రామ్మూర్తి.

డాక్టర్లు నిర్వికారంగా తమ విధిని తాము నిర్వర్తిస్తోనే ఉన్నారు. సుందరికి ప్రథమ చికిత్స చేస్తూనే "హోప్‌లెస్! ఆపరేషన్ చేసినా ప్రయోజనం ఉండదు!" అన్నాడొక డాక్టరు జూనియర్‌తో!

ఆ మాటలు రామ్మూర్తికి వినిపించేయి. "ప్లీజ్... ఆమెకు ఆపరేషన్ చెయ్యండి. మీ ప్రయత్నం మీరు చెయ్యాలి కదా డాక్టర్!" అన్నాడు రామ్మూర్తి అభ్యర్థనగా.

"ఈమె మీకు ఏమౌతుంది? " అడిగేడు డాక్టర్.

"నా భార్య!"




"వెంటనే జనరల్ హాస్పిటల్‌కు తీసుకొని వెళ్ళండి" అని డాక్టరు మరో కేసును చూట్టంలో నిమగ్నమయ్యేడు.

రామ్మూర్తి మెదడులో ఆలోచనలు గిర్రున తిరిగేయి! నిజమే. ఆపరేషన్ చెయ్యాలంటే డాక్టర్లకు అక్కడ వీలుకుదరదు. ఆపరేషన్ పరికరాలు, థియేటరు, కావాల్సిన గ్రూపు రక్తం అన్నీ అందుబాట్లో ఉండాలి. అవ్వన్నీ అందుబాట్లో ఉండాలంటే హాస్పిటల్‌కు తీసుకొని వెళ్ళాలి!

"డాక్టర్! హాస్పిటల్‌కు వెళ్ళేందుకు వాహనం ఏదైనా ఏర్పాటు చెయ్యగలరా?" అడిగేడు రామ్మూర్తి.

"చూద్దాం! ఉన్నది ఒకే ఒక్క అంబులెన్సు. హాస్పిటల్‌కు పంపించాల్సిన వాళ్ళింకా చాలామంది ఉండవచ్చు. అందర్నీ కలిపి ఒకే విడతగా అంబులెన్సులో పంపిస్తాం. ఒక్క క్షణం ఓపికపట్టండి!" అన్నాడు డాక్టర్.

పక్కనే గుర్రం ఒకటి సకిలించింది! యజమాని లేకుండానే అది ఎటువేపునుండో బండిని లాక్కుంటూ నింపాదిగా వెడుతోంది.

రామ్మూర్తి గుర్రబ్బండి దగ్గరికి గెంతి గుర్రపు కళ్ళేన్ని చేత్తో పట్టుకొని బండిని వెనక్కు తిప్పి స్ట్రెచర్ దగ్గరికి తీసుకొని వెళ్ళేడు. "కొంచెం సాయంపడితే నా భార్యను ఈ బండిలో ఆస్పత్రికి తీసుకొని వెళ్తాను" అడిగేడు రామ్మూర్తి డాక్టర్ల బృందంవేపు జాలిగా చూస్తూ.

అందుకు వాళ్ళేమీ సంకోచించలేదు. అందరూ కలిసి సుందరిని గుర్రబండిలోకి చేర్చేరు.

రామ్మూర్తి బండిమీదికి గెంతేడు. ముందువేపు కూర్చుని కళ్ళేన్ని కదిలిస్తూ గుర్రాన్ని అదిలించేడు. బండి ముందుకు కదిలిపోతోంటే "గుడ్‌లక్!" అన్నాడు ఎవరో డాక్టర్. బండి వేగం అందుకొని ఆస్పత్రివేపు దూసుకుపోతోంది.

బండి ఆస్పత్రిదాపుకు రాగానే ముందువేపునుంచి ఉరుకుతూ వస్తోన్న కానిస్టేబులు వెంకటస్వామి రామ్మూర్తిని చూసి ఆగేడు. "రామ్మూర్తిగారూ... ఎక్కడికి వెళ్తున్నారు?" అని అడిగేడు ఆయాసంతో వగరుస్తూ.

రామ్మూర్తి బండిని ఆపకుండానే "ఆస్పత్రికి! సుందరి ప్రమాదంలో ఉంది. అర్జంటుగా ఆపరేషన్ చేయించాలి!" అన్నాడు పెద్దగా.

వెంకటస్వామి ముఖం వివర్ణమైంది! వెనక్కు గిర్రున తిరిగి బండివెంటే పరుగెత్తుతూ "సారీ! ఆస్పత్రికి వెళ్ళి ప్రయోజనం లేదు!" అన్నాడు రామ్మూర్తికి వినిపించేట్లు.

బండి ఆగిపోయింది! రామ్మూర్తి తల పక్కకు తిప్పి "ఏం? ఎందుకని ప్రయోజనం లేదు?" అని అడిగేడు ఆత్రంగా.

"చావుబ్రతుకుల్లో ఉన్న శివయ్యను ఆస్పత్రికి తెచ్చారు. డాక్టర్లు ఆయన్ను బతికిస్తోంటే ఆవరణలోకి నాలుగు నాటుబాంబులు విసిరి, అవి పేలగానే గ్యాస్... పారిపోండి అని వార్డుల్లో తిరుగుతూ అరిచేను. దాంతో సిబ్బంది అందరూ పారిపోయారు. శివయ్యకు వైద్యం పూర్తిగా అందక ఇప్పుడే చచ్చిపోయాడు. ఆ శుభవార్తను నా భార్యకు చెప్పాలని ఇంటికి వెళ్తోంటే దార్లో మీరు కనిపించేరు" అని జరిగిందంతా వివరంగా చెప్పాడు కానిస్టేబులు వెంకటస్వామి.

రామ్మూర్తి అప్పుడు అడిగేడు. వెంకటస్వామిని "పోనీ... ప్రైవేటు ఆస్పత్రులు ఏవైనా పని చేస్తున్నాయా?" అని.

అతను విషాదంగా నవ్వి "లేదు... ఊరంతా ఖాళీ అయింది. ఎక్కడా ఎవ్వరూ లేరు. అందరూ పారిపోయారు" అన్నాడు వెంకటస్వామి.

రామ్మూర్తి ఒక్క క్షణం తలదించుకొని మౌనంగా కూర్చున్నాడు. ఆవేదన, ఆందోళన నెమ్మదిగా సమసిపోతూ శాశ్వతం కాని



దేనికోసమూ వెంపర్లాడని ఏదో తాత్త్వికత మనసంతా నిండుతోంటే నెమ్మదిగా జరిగి సుందరి ముఖం మీదున్న తల వెంట్రుకలను చేత్తో సరిచేస్తూ "సుందరీ!" అని పిల్చేడు ఆర్ద్రంగా.

ఆమె పలుకదని తెలిసి కూడా అలా పిలిచిన తన అత్యాశకు తనే పేలవంగా నవ్వుకొని గుర్రబ్బండిని దారిమళ్ళించి తూరుపు కొండల వేపుకు సాగిపోయేడు.

ఆనాటి పాటిచేల గాలులూ... పాలపిట్టల కువకువలూ... వాన కురవగానే నేల తడిసి కమ్మగా ముక్కుపుటాలకు సోకే పాటిమట్టి వాసనా... ఆ నాటి గొబ్బెమ్మలూ... పల్లెపడుచుల పాటలూ... లేగదూడల అరుపులూ... పొలాలకు వెడుతూ పశువుల లయబద్ధమైన అరుపులూ... అరకల చప్పుళ్లూ.

ప్రకృతికి తూర్పు దిక్కున బాలసూర్యుడ్ని చూపించి ఊరిస్తూ భూపాల రాగంతో ఊరికి మేలుకొలుపులు పాడే కొండలూ... పచ్చటి పొగల్లా కనిపించే పచ్చిక బయళ్లూ... రంగు రంగుల పిట్టలను అక్కున చేర్చుకొని ఆనందంగా ఊగే చెట్లూ... నిప్పు ముద్దల్లా ఎర్రగా పండిన బాదంపండ్లూ.

కరణంగారి తోటలో జాజిపందిరి కింద కూర్చుని మినుకుచుక్కలకేసి ఆకాశంవేపుకు చూస్తూ....

రామ్మూర్తి జ్ఞాపకాల్లోంచి తేరుకుని చూసేడు! సాయంసంధ్య అయింది. సూర్యుడు పడమటి కనుమలవేపుకు సాగిపోతోన్నకొద్దీ భవనాలు, చెట్లు- ప్రకృతి చిత్రాల ఛాయలన్నీ తూర్పు వేపుకు సాగుతూ క్రమంగా నేలలోకి ఇంకిపోతోన్నాయి.

ఊరు దాటేడు. మనిషి అవసరాల కోసం గాయపడి ధ్వంసమైన తూర్పు కొండల ఆనవాళ్ళూ దాటేడు. అడవి దారిపట్టేడు.

"నువ్వు మనిషివి కదూ... ఆగాగు!" అడవి గద్దించినట్టు ఏదో న్యూనతాభావం లోంచి జనించిన భ్రమ!

ఉలిక్కిపడి "అవును, మనిషిని!" అన్నాడు రామ్మూర్తి.

"అడవిలో ఏం పని నీకు? "

"నాకు అడవి అంటే ఇష్టం. ప్రకృతి అంటే ఆనందం"

"మనిషికి ఆనందపు నిర్వచనం కూడా తెలుసా? "

"మా నిరంతరాన్వేషణ ఆనందం కోసమే కదా"

"ఇతరుల ఆనందాన్ని భగ్నంచెయ్యటమే మీకు ఆనందం కదూ? "

"..."

"ఇక చాలులే వెళ్ళిపో! మా అడవి చెట్ల మీది పిట్టలు కూడా నీ రాకతో భయపడి గూళ్లలో దాంకుని నక్కి చూస్తోన్నాయి. ఆనందంగా ఉయ్యాలలూగే గిజిగాళ్ళు విస్తుపడి పోతున్నాయి. అడవి చెట్లు కలవరపడుతున్నాయి. మీరు మనుషులనీ, ప్రకృతిని కూడా ధ్వంసం చేసి సొమ్ముచేసుకొని పెట్టెల్లో దాచుకుంటారనీ, స్వార్థంకోసం మీరు ఎంతటి దారుణాలు చేసేందుకైనా వెనుకాడరనీ, మమ్మల్ని గొడ్డళ్లతో, ఆధునిక యంత్రాలతో నిర్దాక్షిణ్యంగా నరికివేసి, మా శరీరాలతో మీరు వ్యాపారం చేస్తారనీ, మా గుండెలమీద ఎల్లలు గీసి యజమానులుగా స్థిరపడతారనీ, భావి తరాలవారికి కూడా రవ్వంత మిగల్చకుండా ప్రకృతిని సైతం కొల్లగొడతారనీ... మీ నరజాతి చరిత్ర సమస్తం మాకు తెలుసులే!"

"క్షమించు! నేను వెనుదిరిగి వెళ్ళలేను"

"ఎందుకని? "

"అక్కడ జననం ఒక మరణం! ఇక్కడ మరణం ఒక జననం! కనుక నా పయనం ముందుకే"






# చతుర కథలు

## ఎన్నికలు

ప్రొద్దుటే పక్కింటాయన అరుపులతో మెలుకువ వచ్చేసింది. అప్పటికే లేచిన శ్రీమతి వంటింట్లో తంటాలు పడుతున్నట్టుంది. లేచి బయటకు వెళ్ళాను, బ్రష్ చేసుకుందామని.

పక్కింటాయన కొడుకుని చావబాదుతున్నాడు. "స్కూల్ కి వెళ్ళవూ? పైగా మాష్టారికి ఏం రాదంటావా? అన్నీ తప్పులే చెపుతుందంటావా? మేష్టార్ని ఎంచేంతటివాడివయ్యావా నువ్వు?" అంటూ ఏమిటేమిటో అనేస్తున్నాడు.



కుర్రాడు ఏదో చెప్పే ప్రయత్నం చేస్తున్నా వాణ్ణి మాట్లాడనివ్వకుండా బాదుతున్నాడు. పాపం పిల్లాడి తల్లి ఏదో సర్దిచెప్పబోతే "ముందు నువ్వు నోర్ముయ్. నీ అలుసు చూసుకొనే వాడు అలా పేట్రేగిపోతున్నాడు. ఏరా స్కూలుకి వెళ్తావా, లేదా? చంపేస్తాన్రా, నిన్నూ... నిన్నూ... చంపేస్తానొరేయ్" అంటూ ఆవిణ్ణి పక్కకితోసేసి వాడిమీదికి విజృంభించబోయాడు. ఆ దృశ్యాన్ని చూస్తూ ఊరుకోలేకపోయాన్నేను. అలా వదిలేస్తే ఆ కుర్రాడు ఏమైపోతాడో నన్న భయం కలిగింది.

నెమ్మదిగా పక్కవాటావైపు నడిచాను.

నన్ను చూసి నా వెనక్కి పరుగెత్తుకు వచ్చేశాడు ఆ కుర్రాడు. వెక్కివెక్కి ఏడుస్తున్నాడు.

"ఊరుకోండి బ్రహ్మానందంగారూ! స్కూల్ కి వెళ్ళనన్నంతమాత్రాన అలాగేనా పిల్లవాణ్ణి కొట్టడం" సముదాయించబోయాను.

"మీకు తెలీదు మాష్టారూ. మీరు ఊరుకోండి. వీడి సంగతి ఇవ్వాళ తేల్చేస్తాను. రా... రా... రాయిటు" గద్దించాడు బ్రహ్మానందం.

అయినా పిల్లవాడు నా వెనకనుంచి కదల్లేదు.

"చూడండి బ్రహ్మానందంగారూ... నేను

కనుక్కుంటానుగా. మీరు కాస్త ఉద్రేకం తగ్గించుకోండి" అన్నాను. ఏమనుకున్నాడో తగ్గాడు బ్రహ్మానందం.

పిల్లవాణ్ణి అనునయంగా దగ్గరకు తీసుకున్నాను. ఏడ్చి ఏడ్చి ఉన్నాడేమో ముఖమంతా ఎర్రగా కందిపోయివుంది. వీపు మీద వాతల్లా తేలివున్నాయి చేతివేళ్ళ ఆనవాళ్లు. ఫష్టుఫారం చదువుతున్నాడు. శ్రద్ధగా చదివే కుర్రాడే. మరి ఏమయిందో!

"ఏం నానీ! స్కూలుకెందుకెళ్ళనన్నావు. ఏమైందీ? " బుజ్జగింపుగా అడిగాను.

వెక్కిళ్ళ మధ్యన చెప్పాడు నానీ.

"అంకుల్... మరే, మా టీచర్‌కి ఏమీ రాదు..." ఇంకా ఏదో చెప్పబోతుండగానే మధ్యలో అందుకున్నాడు బ్రహ్మానందం.

"అదిగో అదే. ఆ మాటే అనద్దంటున్నాను. మీరుండండి మాష్టారూ. వీడు మంచి మాటలకి లొంగడు" అని ముందుకు రాబోయాడు.

రెండు చేతుల్తోనూ అతణ్ణి ఆపి నానీని అడిగాను. "ఏం జరిగింది నానీ! విషయం ఏంటో చెప్పమ్మా..."

"అంకుల్... మరి పార్లమెంట్ ఎలక్షన్లు జరిగి రెండేళ్ళేగా అవుతా...? " అన్నాడు నాని.

"అవును..." అన్నాను దానికీ దీనికీ ఏమిటా సంబంధం అనుకుంటూ.

"మళ్ళీ ఇప్పుడు పార్లమెంట్ ఎన్నికలు జరిగాయా లేదా..." అన్నాడు నానీ.

"అవును..." అన్నా మళ్ళీ.

"మరి మా టీచర్ పార్లమెంటుకు ఎలక్షన్లు అయిదేళ్లకోసారి జరుగుతాయంది. కాదు రెండేళ్లకే అంటే నోర్మూయ్యమంది. ఆవిడకేం తెలీదన్నమాటేగా!"

నానిగాడి మాటలకి అందరం అవాక్కయ్యాం.

**-ఫణిప్రియ**

---

## కిల్లర్ బిల్

**ప**దేళ్ళ వెయిటింగ్ తరువాత ఇంటికి టెలిఫోన్ వచ్చిందన్న ఆనందం ఏడాదిపాటయినా నిలవకుండానే రాంగ్ బిల్లింగ్ అగచాట్లు ఆరంభమయ్యాయి రాఘవరావుకి.

గుణకారాలు తప్ప గణకారాలు తెలీవన్నట్టు టెలికాం డిపార్టుమెంటు కట్టవలసిన మొత్తాన్ని ఎంతో కొంతతో గుణించి మరీ బిల్లు వేస్తూన్న కారణంగా ప్రతిసారీ అయిదారు వందలు ఎక్కువే కట్టవలసి వస్తోంది. బిల్లు చెల్లించకపోతే, ఏడాది తిరక్కుండానే ఫోను పీకేసారన్న అప్రదిష్ట పాలవుతాడన్న భయం. అందుకని కట్టేయటం, తర్వాత టెలిఫోన్ డిపార్ట్‌మెంటు చుట్టూ తిరగటంగా ఉంటోంది.

లేటెస్టు బిల్లు వచ్చేసరికి రాఘవరావు ఇంట్లో లేడు.

భార్య లక్ష్మీదేవి బిల్లులోని ఎమౌంటు చూసి గుండె బాదుకుంది. అసలే ఆమధ్య హార్టు ప్రాబ్లెమ్‌తో ఆస్పత్రిలో వుండొచ్చాడు భర్త. ఇప్పుడు ఆ బిల్లుని చూస్తే అతని గుండె ఆగిపోవడం ఖాయం.

పక్కింట్లో వుంటూన్న డాక్టర్ భల్లా దగ్గరకు పరుగెత్తిందామె "భాయీసాబ్! ఈసారి పదిహేను వేలకు బిల్లొచ్చింది. ఈ ఫిగరు చూడగానే మావార్కి గుండె ఏమవుతుందోనని భయంగా వుంది" అంటూ వాపోయింది.

"తుమ్ ఫికర్‌మత్‌కరో బెహెన్! రాఘవ భాయ్ ఆఫీసునుంచి వచ్చేసరికి నేను మెడిసిన్ చెస్ట్‌తో మీ ఇంట్లో సిద్ధంగా వుంటాను. "అసలే అతనిది వీక్ హార్ట్. మెల్లగా ఆమాటా ఈమాట చెప్పి ఫోన్‌బిల్లు చూపించాలి" అన్నాడు డాక్టర్ భల్లా.

సాయంత్రం ఇంటికి వస్తూనే డాక్టర్ని చూసి, "క్యోం సర్దార్‌జీ, మెడిసిన్ చెస్ట్‌తో ప్రత్యక్షమయ్యారు, ఎనీ ప్రాబ్లెమ్? " అంటూ

పలకరించాడు రాఘవరావు. "నై భాయి సాబ్! బయటనుంచి వస్తూ, బెహన్‌జీని చూసి పోదామని వచ్చాను" అని బదులిచ్చాడు భల్లా.

కాఫీ తాగుతూండగా, రాఘవరావు ఆరోగ్యంతో మొదలుపెట్టి గవర్నమెంటు డిపార్ట్‌మెంట్లు ఎంత నిర్లక్ష్యంగా పనిచేస్తున్నాయో వరకు ప్రస్తావించాడు డాక్టర్. ఆ తరువాత లక్ష్మీదేవికి సైగచేస్తే ఆవిడ టెలిఫోన్ బిల్లు తెచ్చిచ్చింది. భల్లా దానిని రాఘవరావు చేతిలో పెడుతూ, "టెలికాండిపార్ట్‌మెంటు



నానాటికీ ఎంత నిర్లక్ష్యంగా తయారవుతోందో ఈ బిల్లులో వేసిన ఫిగర్ చూస్తే తెలుస్తుంది" అన్నాడు.

బిల్లును అందుకుని కొద్ది క్షణాలపాటు పరిశీలించాడు రాఘవరావు. లక్ష్మీదేవి, భల్లా ఆత్రుతతో అతనివంకే చూస్తున్నారు. ఎందుకైనా మంచిదని స్టెతస్కోపుని చెవులకు తగిలించుకుని సిద్ధంగా వున్నాడు భల్లా.

రాఘవరావు నిట్టూర్చి, "ఆ డిపార్టుమెంటు వేసే ప్రాక్టికల్ జోక్సు మరీ ఘోరంగా వుంటున్నాయి. తప్పుడు బిల్లిచ్చి వున్నపళంగా పదిహేనువేలు కట్టమంటే పాపం, ఎక్కణ్ణుంచి తెస్తావు నువ్వు?" అన్నాడు సానుభూతిగా.

"నేనా?" అన్నాడు భల్లా తెల్లబోతూ.

"నీ టెలిఫోన్ బిల్లు నువ్వు కట్టకపోతే ఇంకెవరు కడతారు?" అన్నాడు రాఘవరావు విస్తుపోతూ.

"ఇది నా బిల్లా?" అంటూ చటుక్కున అతని చేతిలోంచి లాక్కుని అందులోని ఫోన్ నంబర్ని చూసిన భల్లా "వాయే గురూ..." అంటూ అరిచి విరుచుకుపడిపోయాడు.

అయోమయంతో బిల్లు తీసి చూసిన లక్ష్మీదేవికి అప్పుడుగాని అసలు విషయం బోధపడలేదు. బిల్లు ఎమౌంటు చూడగానే బుర్ర మొద్దుబారిపోవడంతో అందులోని టెలిఫోన్ నంబర్ని చూడనేలేదు తాను. అది డాక్టర్ భల్లా ఇంటి ఫోన్‌కి చెందినది. పోస్ట్‌మాన్ పుణ్యమా అంటూ పక్కింటికి వెళ్ళవలసిన బిల్లు తమ లెటర్‌బాక్స్‌లో పడింది.

డాక్టర్ గుండెపైన చేయిపెట్టి చూసిన రాఘవరావుకి అది కొట్టుకుంటున్నదో లేదో తెలియలేదు. వెంటనే ఫోన్‌దగ్గరకు పరుగెత్తాడు అంబులెన్స్‌కి ఫోన్‌చేయడానికి!!

**-తిరుమలశ్రీ**

## వాయిదా...

"అబ్బబ్బ... ఈ పని మనుషులతో చచ్చే చావొచ్చిపడిందండీ ఎప్పుడొస్తారో ఎప్పుడు మానేస్తామంటారో తెలీదు" తనలోతనే అనుకుంటున్నట్టుగా గట్టిగానే అంది రత్న మాల.

"ఏమిటే... ఏమైంది మళ్ళీ. రోజూ సక్ర మంగానే పనిచేసి వెళ్తోంది కదే. ఇంతలో నీ గొడవేమిటీ..." పేపర్ చదువుకోవడానికి డిస్టర్బ్ అయినందుకు విసుక్కుంటూ అన్నాడు రామబ్రహ్మం.

"అయ్యో...ఎందుకు చెయ్యదూ. ఊరికే చేస్తోందా ఏం. మనం తిన్నా తినకపో యినా, తాగినా తాక్కపోయినా ఆవిడగార్కి రెండుపూట్లా కాఫీటిఫిన్లిచ్చి రెండ్రోజులకోసా రన్నా భోజనం పెట్టి నెలయ్యేసరికి బిళ్ళకు డుముల్లా, ఫెళఫెళలాడే రెండు వంద కాయితాలు దాని చేతిలో పెట్టడం లేదూ"

"అవును కదే. మరి ఇంతలోనే ఏమైం దిట" ముందు వేసిన ప్రశ్నే మళ్ళీ వేసాడు పదాలు మార్చి

"దానికి ఈ సంపాదన చాలడంలేదట. విదేశాలమ్మట పోతున్నారు కదా పనులకోస్ర మని. దాని మేనమామ కొడుకెవడో వీసా పంపించాట్ట దీనికి. రేపు ఫస్టునుంచి పన్లోకి రావట్లేదని శుభవార్త చెప్పింది పొద్దుటే"

మూర్ఛవచ్చినంత పనయింది రామబ్ర హ్మానికి. "మళ్ళీ కొత్త పనిమనిషిని ఎక్కడ వెతకన్రా భగవంతుడా! నామీద నీకింత నిర్దయేమిటయ్యా" అనుకున్నాడు మన సులో. పైకిమాత్రం 'సర్లేవే... ఎవరి ఆశ వాళ్ళది. ఈ చుట్టుపక్కలిళ్ళలో చేసేవాళ్ళెవ రైనా ఉన్నారేమో చూడు" అన్నాడు.

"అదీ అయ్యింది. మాకు వీల్లేదంటే మాకు వీల్లేదన్నారు. అక్కడికీ మరోయాభై ఎక్కువిస్తానన్నాను కూడా" అంది రత్న మాల.



"సర్లే నా ప్రయత్నం నేను కూడా చేస్తాన్లే" అన్నాడు రామబ్రహ్మం.

అనడమే తరువాయిగా ఫోన్‌ముందుకు లాక్కొని తన ఫ్రండ్సు అందరికీ తెల్సినవాళ్ళ ఇంకొందరికీ ఫోన్లు చేసాడు "తెల్సిన పనిమ నిషి ఎవరైనా వుంటే పంపమ"ని.

అందరినుంచీ ఒకటే సమాధానం "ఎవ్వ రూలేర"ని.

చివరిగా పతంజలికి ఫోన్‌చేసాడు.

"ఆడమనిషే కావాలంటే నేనేంచెయ్యా లేను. కాని మగవాడయినా ఫరవా లేదనుకుంటే మాత్రం ఒకతన్ని పంపగ లను. ఇంటి పనులన్నీ చక్కగా చేస్తాడు. అతనికి ఇల్లూ వాకిలీ ఏమీలేవు. మీతోపాటే ఇంతన్నం పెడితే మీ ఇంట్లోనే ఏమెట్లకిందో పడి వుంటాడు" అన్నాడు పతంజలి.

"మా ఆవిడతో ఆలోచించి మళ్ళీ ఫోన్ చేస్తాను" అని ఫోన్ పెట్టేశాడు రామ బ్రహ్మం.

"ఇరవైనాలుగ్గంటలూ ఇంటిదగ్గరే ఉండే మాటయితే ఎవరైతేనేం" అని రత్నమాల అనడంతో మళ్ళీ పతంజలికి ఫోన్‌చేసి పని వాణ్ణి పంపించమని చెప్పాడు.

మర్నాడు పొద్దుటే అడ్రసు పట్టుకొని వచ్చేసాడు పతంజలి పంపిన పనిమనిషి.

నడివయసువాడు. కాయకష్టం చేసినవా డిలాగే ఉన్నాడు. "ఫరవాలేదు" అనుకు న్నారు భార్యాభర్తలిద్దరూ.

కాఫీ టిఫిన్లయినాక పనిలోకి దిగాడు అతడు. గదులన్నీ శుభ్రంగా తుడిచాడు. కిచన్‌లో వంటసామగ్రినంతా శుభ్రంగా తోమాడు తళతళామెరిసేలా. గాబుల్లో నీళ్ళు నింపాడు. ఏ పనీ చెప్పకుండానే గబ గబా చేసుకుపోతున్నాడు.

మధ్యలో రత్నమాల పిలిచి "బట్టలుతక" మని చెప్పింది.

"బట్టలుతికే పని మధ్యాహ్నానికి వాయిదా వేయడమైనది" అన్నాడు అతడు.

కొంచెం ఇబ్బందిగా ఫీలయినా సర్దుకుంది రత్నమాల. మరికాస్సేపయిన తర్వాత సరు కుల లిస్టు, సంచులు ఇస్తూ బజారుకి వెళ్ళి రమ్మంది.

"బజారు కెళ్ళే పని సాయంత్రానికి వాయిదా వేయడమైనది" అన్నాడు.

ఈసారి గాబరాపడింది రత్నమాల. ఇంకే పనీ చెప్పకుండా అతని మానాన అతన్ని చేసుకుపోనిచ్చింది. అతనేమో అన్నీ చక చకా చేసుకుపోతున్నాడు.

సాయంత్రం ఆఫీసునుంచి వస్తూ పతంజ లిని కూడా వెంటబెట్టుకొని వచ్చాడు రామ బ్రహ్మం. వేడివేడిగా కాఫీలు పట్టుకొచ్చింది రత్నమాల.

కప్పు అందుకుంటూ అడిగాడు పతంజలి "ఏమంటున్నాడు మీ కొత్త పనివాడు" అని.

ఓసారి బెరుకుగా లోపలికి చూసి "ఏం చెప్పమంటారండీ బాబూ అదనంగా ఏ పని చెప్పినా "వాయిదా వేయడమైనది" అంటాడే విటి!" అంది రత్నమాల.

ఆ మాటలకి బిగ్గరగా నవ్వేసాడు పతం జలి. నువ్వేంకంగారుపడకమ్మా అతను ఇంతకుముందు అసెంబ్లీ స్పీకర్‌గారింట్లో పనిచేసాళ్ళే..." అన్నాడు నవ్వుతూనే.

**-సువర్చలా జ్యోతి**

---

## త్రీమచ్

"ఇక మనం మిగిలిన విషయాలు మాట్లాడుకుందామా?" అన్నాడు ఆదినారా యణ. ఆయనే ఆ పెళ్ళి సంబంధం తీసుకొ చ్చిన వ్యక్తి.

"మాట్లాడుకోవడానికేగా మనమొచ్చి కూర్చున్నది?" అని నవ్వాడు నాగేశ్వర రావు. అతను శ్రీలత తండ్రి.

పెళ్ళికొడుకు తండ్రి ముఖం కాస్త నవ్వుతో, మరెంతో టెన్షన్‌తో వుంది. తమ ప్రతిపాద నలకు పెళ్ళికూతురి తండ్రి ఏమంటాడోనని కావచ్చు.

గొంతు సవరించుకున్నాడు ఆదినారా యణ. "అబ్బాయి ఉద్యోగం, జీతభత్యాల గురించి మీకు తెలియనిది కాదు. ఇవ్వాళ రేపూ కంప్యూటర్ రంగానికి ఎంత అద్భుత మైన భవిష్యత్ వుందో మీకు తెలుసు! చాలామంది అయిదు లక్షలవరకూ ఇస్తా మని వచ్చారు. మరి మీరు?" అని అర్థో క్తిగా ఆగాడు.

నాగేశ్వరరావు గొంతులో గుటక పడ లేదు. "అయిదంటే కష్టం- మూడు లక్షలవ రకూ అయితే నేను తూగగలను" అన్నాడు.

కాసేపు తర్జన భర్జనల తర్వాత కట్నం నాలుగులక్షల రూపాయిలకు కుదిరింది.

తర్వాత పిల్ల వంటిమీద బంగారం అయి





దుకేజీలు వుంటుందన్నాడు నాగేశ్వరరావు.

అయిదు పెళ్లికొడుకు లక్కీనెంబర్ కాదట. ఆరు బెటర్ అన్నారు. మగపెళ్లివారిలో అతిముఖ్యులైన ఆడవాళ్లకి పాతిక పట్టుచీరలు పెట్టాలన్నారు.

అబ్బాయికి అమెరికా వెళ్ళే అవకాశమొస్తే ఖర్చులు భరించాలి.

పెళ్ళయ్యాక వచ్చే మొదటి దీపావళికి ఎస్టీమ్ అవసరం లేదటగానీ మారుతీ కారు ఎసి డీలక్స్ అయినా సరిపెట్టుకుంటాడట! అది ఇవ్వక తప్పదు.

మొదట ఆడపిల్ల పుడితే, ఆ పాప పేరిట ఏదో స్కీమ్‌లో యాభైవేలు డిపాజిట్ చెయ్యాలి.

హనీమూన్‌కి ఊటీ, మైసూరు, బెంగుళూరు, కొడైకెనాల్, గోవా పంపించాలి.

పెళ్లికొడుకు తరపువాళ్లు చెబుతుంటే నాగేశ్వరరావు భార్య మల్లిక ఓ కాగితం మీద అంకెలు వేసుకుని, లోపల్లోపలే గుండెలు బాదుకుంది.

నాగేశ్వరరావు 'వూ' అనడంలేదు. ఉహూ' అనడంలేదు.

కళ్లముందే గొప్ప సస్పెన్స్ సీరియల్ సాగుతున్నట్లు ఫీల్ కాసాగారు పెళ్లికొడుకు, అతగాడి తండ్రి.

ఈలోగా బయటినుంచి 'అమ్మా- మాతా! కబళం తల్లీ!' అని వినబడింది.

నాగేశ్వరరావు చటుక్కున లేచి బయటికెళ్లాడు. రెండే రెండు నిమిషాల్లో బిచ్చగాడి చావుకేకలు వినబడ్డాయి.

నాగేశ్వరరావు చొక్కా చేతులు మడత పెట్టుకుంటూ, ఆవేశంతో, రొప్పుతూ ఇంట్లోకి వచ్చాడు.

'ఏమైంది- ఏమైంది?' అని అందరూ అడిగారు.

నాగేశ్వరరావు పళ్ళు పటపటా కొరుకుతూ, "వెధవ...!" అని ఓ బూతుపదం తిట్టాడు. "అడుక్కునేవాడికి ఎంత గీర! అడుక్కునేవాడు మనం చద్దన్నం వేసినా, పచ్చడిమెతుకులు వేసినా 'మహా ప్రసాదం' అని వెళ్ళిపోవాలి.

వెధవది- చికెన్‌కర్రీ వేయండి, కోడిగుడ్డు సొన తీసివేయండి, పప్పులోకి వడియాలు వేపించండి' అని డిమాండ్ చేస్తాడా? అసలు అడుక్కునేవాడికి డిమాండ్ చేసే అధికారం వుందా? నోర్మూసుకుని ఇచ్చింది పట్టుకెళ్లాలిగానీ-

నా సంతోషం కోసమో, పుణ్యం కోసమో నేనిస్తానుగానీ, వాడడిగింది ఇస్తానా? పళ్ళు రాలగొట్టాను. ఇంకాసేపుంటే, కాళ్ళు చేతులు విరిచేసేవాణ్ణి" అని హుంకరించాడు నాగేశ్వరరావు.

"టూ మచ్!" అన్నాడు ఆదినారాయణ.

"త్రీమచ్" అని ఒకేసారి గొణిగారు పెళ్ళికొడుకు, అతని తండ్రి. ఆ తర్వాత వారి గొంతు పెగల్లేదు!

**-పుష్యమి**

# చతుర ప్రపంచం

## మిస్టీరియస్ లైట్

**1982** మార్చి రెండో తేదీ. ఉదయం 6 గంటలకు న్యూఫౌండ్‌లాండ్‌లోని బంగస్ నగరంలో విద్యుచ్ఛక్తి ప్రసరణలో విచిత్రమయిన మార్పులే కనిపించాయి. ఓల్టేజి హఠాత్తుగా పెరిగిపోయిన సూచనలు పొడగట్టాయి. అలా పెరిగి పెరిగి ఒక్కసారి నగరమంతా విద్యుత్ సరఫరా ఆగిపోయింది. ఎలక్ట్రికల్ ఇంజనీర్లు తక్షణం కదలి నగరమంతా తిరిగి విద్యుత్ సరఫరా యధావిధిగా జరిగేలా చూశారు గానీ విచిత్రమయిన విషయమేమంటే ఆనాటి విద్యుచ్ఛక్తి సరఫరా ఆగిపోవడానికి తగిన సాంకేతిక కారణాలు ఏవీ కనిపించలేదు. ఎలాంటి తుఫానూ రావడంగానీ, పెనుగాలులు వీచడంగానీ జరుగలేదు.




మరి... హఠాత్తుగా కరెంటు పోవడానికి గల కారణమేమిటని పరిశోధించగా 'ఉత్తర ధృవం నుంచి అనూహ్యంగా వచ్చిన శక్తివంతమైన విద్యుత్తరంగాల తాకిడి' అని తేల్చారు ఆ రంగంలోని మేధావులు.

శతాబ్దాలనుంచీ ఎందరో శాస్త్రజ్ఞులు అప్పుడప్పుడు దిఙ్మండలాన్నంతటినీ కప్పుతూ, కనిపించి క్షణంలో మాయమయ్యే ఆకుపచ్చ, తెలుపు, ఎరుపుల సమ్మిళిత కాంతిపై పరిశోధనలు జరుపుతూనే ఉన్నారు. ఈ వింతకాంతి అలా కనిపించి ఇలా మాయమవుతూ వుంటుంది. ఎంతమంది పరిశోధకులు ప్రయత్నించినా ఆ కాంతి పుంజం కథ మిస్టరీగానే వుండిపోయింది. ఈ కాంతిని చూడాలంటే అనువైన దేశం కెనడాయే. ఆకాశం నిర్మలంగా వున్నప్పుడు ఈ కాంతిని ప్రతిరోజూ చూడవచ్చునంటున్నారు పరిశోధకులు.

దక్షిణ ధృవప్రాంతంలో కొన్నిచోట్ల ఈ కాంతిని సంవత్సరంలో 10, 12 సార్లు

చూడవచ్చునంటున్నారు. 1981 ఏప్రిల్‌లో రెండుసార్లు కనిపించిన కాంతిపుంజం నిండుచంద్రుణ్ణికూడా తెలతెలబోయేలా చేసిందిట.

అసలు ఉత్తర ధృవంనుంచి వచ్చే ఈ కాంతి యొక్క పుట్టుపూర్వోత్తరాలేమిటన్న దానిపై పరిశోధనలు జరుగుతూనే వున్నాయి. 1896లో నార్వే శాస్త్రజ్ఞుడు క్రిస్టియన్ బెర్క్‌లాండ్ అనే ఆయన దీనిపై పరిశోధన చేసి చెప్పిందేమంటే ఈ కాంతి పుంజం సూర్యుడినుంచి వేగంగావచ్చే విద్యుచ్ఛక్తితో కూడిన అణువుల ప్రవాహం అని. అయితే దీన్ని గురించిన ఖచ్చితమైన పరిశోధన జరిగినది 28 సంవత్సరాల క్రితం మనిషి విజ్ఞానయుగంలోకి ప్రవేశించినప్పుడేనంటున్నారు కొందరు.

శాటిలైట్స్ ద్వారా వచ్చిన సూచనల ప్రకారం తేలిందేమంటే 'మనిషి మేధకు అందని, గజిబిజిగా ఉన్న సౌర కుటుంబ విన్యాసమే ఈ కాంతిపుంజాల కథ' అని.

మామూలు కిరణాలతోపాటు అతి శక్తివంతమయిన సౌర వాయువులు కూడా సూర్యుడినుంచి వెలువడుతూ వుంటాయని తెలుస్తోంది. ఈ గాలిలోని అణువులన్నీ కలిసి మొత్తం సౌర కుటుంబాన్ని సెకనుకు 400 మైళ్లవేగంతో చుట్టుముడుతూ వుంటాయి. అవి ఎప్పుడైనా భూమ్యాకర్షణశక్తికి దగ్గరగా వస్తే ఒక విధమైన ఒరిపిడి ఏర్పడి 100 నుంచి 1000 కిలోమీటర్ల ఎత్తులో ఈ అణువులన్నీ కలిసి ఓ కాంతిపుంజంలా కనపడతాయని తేల్చారు శాస్త్రజ్ఞులు. ఉత్తర ధృవ ప్రాంతంలో 6 నెలలు వరుసగా చీకటి వుంటుంది. అంతరిక్షంనుంచి భూమి వైపు చూసినట్లయితే భూమి ఓ కాంతివంతమయిన టోపీ కప్పుకున్న గోళంలా కనిపిస్తుంది. ఆ టోపీయే ఉత్తర ధృవ ప్రాంతంనుంచి వచ్చే నిగూఢ కాంతిపుంజం.

ఈ కాంతిమొక్క గాఢత మార్పులు చెందుతూ వుంటుంది. ఒక్కొక్కప్పుడు కెనడా, సైబీరియాలను మొత్తం ఆక్రమించుకున్నట్టు కనపడుతుంది. అప్పుడప్పుడు ఇది అక్కడక్కడ వెదజల్లబడినట్లు విడిపోయి కనిపిస్తుంది. ఇలా 1958లో మెక్సికన్ సిటీలోను, 1901లో సింగపూర్‌లోనూ కనిపించింది.

భూమినుంచి మనం ఈ కాంతియొక్క కొంతభాగాన్ని మాత్రమే చూడగలుగుతాం. ఎన్నో శాటిలైట్లు దీని ఫొటోలు తీసినప్పటికీ స్పష్టమైన ఫొటోలు తీసిన ఘనత మాత్రం తొలి అమెరికన్ డైనమిక్స్ ఎక్స్‌ప్లోరర్‌కే దక్కుతుంది. 1981లో ఉత్తర ధృవానికి పాతికవేల కిలోమీటర్ల ఎత్తుకి వెళ్ళి వివిధ కోణాలనుంచి ఈ వెలుగును కెమేరాలో బంధించింది.

'ఈ కాంతికి ఆధారం సూర్యుడే' అన్నది మాత్రం నిర్వివాదం. ఈ మిస్టీరియస్ లైట్ వచ్చేముందు సౌరకుటుంబంలో కలకలం ఏర్పడుతుంది. సూర్యుడిపై నల్లని అతుకులు కనబడినప్పుడు మర్నాడో, మూడోనాడో మిస్టీరియస్ లైట్ కనపడుతుందని నిశ్చయించుకోవచ్చు. సూర్యునిపై కనిపించే ఈ నల్లని అతుకులు గాఢమైన అయస్కాంత తరంగాలను ఉత్పత్తిచేసి ఈ మిస్టీరియస్ లైట్‌ని మరింత కాంతివంతం చేస్తాయి. ఈ కాంతిపుంజం యొక్క పైపొర 1000 కి.మీ.ల ఎత్తున వుండటంతో దక్షిణ ప్రాంతంనుంచి కూడా ఇది కనిపిస్తుంది. అప్పుడప్పుడు ఈ కాంతిపుంజం అడవులలో ఏర్పడే కార్చిచ్చేమో అనే భ్రమను కలిగిస్తుంది. అలాంటి అపోహ క్రీ.శ. 37లో రోమ్ ప్రజల్లో ఏర్పడింది. అప్పుడువారు 'ఆస్టియా నగరం అంటుకుందని' భ్రమపడ్డారు. క్రీ.పూ. 400 వ సంవత్సరంలో మొట్టమొదట ఈ కాంతిని గురించి వర్ణించింది ఓ గ్రీకు రచయిత. 'ఈ అతిపెద్ద మంటలు దేముని కోపచిహ్నాలు కావచ్చు. లేదా దేవతలమధ్య జరిగే యుద్ధాల ప్రభావాలు కావచ్చు' అని రాశాడాయన. ఈ కాంతిని ఆయన 'అరోరా బోరివియస్' అన్నాడు.




అటుపైన చాలాకాలం ఏ శాస్త్రజ్ఞులూ ఈ కాంతిని గురించి పట్టించుకోలేదు.

1779లో బెంజిమన్ ఫ్రాంక్లిన్ అనే శాస్త్రజ్ఞుడు "అతిశీతల ప్రదేశాల్లో మేఘాలు మంచు ముద్దలుగా మారి వాటినుంచి విద్యుత్తరంగాలు ఏర్పడుతాయి. ఆ మేఘాలే కాంతికిరణాల్లా భ్రమ కల్గిస్తాయి'' అన్నాడు. అయితే పరిశోధకులు తేల్చిందేమంటే సౌరకాంతులకి, ధృవప్రాంతానికి ఏదో అవినాభావ సంబంధం వుందని.

కొంతమంది ఈ మిస్టీరియస్ లైటునుంచి శబ్దాలు కూడా వస్తున్నాయన్నారు. దీనిపై 1923లో 'రాయల్ ఆస్ట్రోనాటిక్ సొసైటీ ఆఫ్ కెనడా' వారు ఓ పత్రికను ప్రచురించారు. "మొదట్లో ఈ కాంతినుంచి ఎలాంటి శబ్దమూ రాలేదు. అయితే ఆ కాంతి కొద్దిగా దగ్గరయినప్పుడు మాత్రం కొద్దిపాటి ధ్వనులు వినవస్తున్నాయి. మరీ దగ్గరయినప్పుడు ఆ శబ్దం మరింత పెరుగుతోంది'' అని తెలిపిందా పత్రిక.

అమెరికన్ అంతరిక్ష శాస్త్రవేత్త రిచర్డ్ చాపల్ "ఇలా క్రమబద్ధం లేకుండా వచ్చే ఈ హైఓల్టేజ్ కాంతివల్ల వాతావరణ సమతౌల్యం కూడా దెబ్బతింటుంది'' అంటున్నాడు. అంతేకాదు 'ధృవప్రాంతాలకీ, ఈ మిస్టీరియస్ లైటుకీ వున్న అనూహ్యసంబంధంపై మరింత విస్తృతంగా పరిశోధనలు జరగాల్సి వుందని' కూడా అంటున్నాడతడు.

---

## క్యాబేజీకథ

**చా**లా రకాల కూరగాయలు సీజనల్‌గానే దొరుకుతాయి. అన్ని కాలాల్లో దొరికేవి అరుదుగా వుంటాయి. ముఖ్యంగా శీతాకాలంలో వచ్చే కూరగాయలు... అంటే క్యాబేజి, క్యాలీఫ్లవర్, పచ్చిబఠాణీ... వగైరా కూరలు మిగిలిన కూరల కంటే ఎక్కువ ప్రొటీన్లు కలిగి వుంటాయని పరిశోధకులు అంటున్నారు. ముఖ్యంగా క్యాబేజీలో ఎన్నో బలవర్ధకమైన ప్రొటీనులు, రోగకారక క్రిములను నాశనం చేసే ఔషధగుణాలు వున్నాయంటున్నారు శాస్త్రజ్ఞులు.

శరీరాకృతిని అందంగా వుంచడంలోను, ఆరోగ్యాన్ని కాపాడడంలోను క్యాబేజి పాత్ర అనూహ్యమని తెలుస్తోంది. మధ్యయుగాల్లో ఒకానొక సమయంలో రోమనులు డాక్టర్లనందరినీ దేశంనుంచి తరిమేసి కేవలం క్యాబేజీ సహాయంతో తమ వైద్యాన్ని తామే చేసుకునేవారు.

పడిశం, దగ్గునుంచి...స్థూలకాయం వరకు క్యాబేజితోనే చికిత్స జరిగేది. ఇది పైకి ఆకుకూరలా ఆకుపచ్చగా పొరలుపొరలుగా కనిపిస్తుంది. ఈ పొరల మధ్యలో ఎన్నో ప్రొటీనులు, విటమినులు దాగివున్నాయంటున్నారు శాస్త్రజ్ఞులు. క్యాబేజీలో సల్ఫర్, క్లోరిన్, అయొడిన్ అత్యధిక మోతాదులో వున్నట్టు తెలుస్తోంది. మిగిలిన కొన్ని కూరగాయ ముక్కలులాగే దీన్ని కూడా పచ్చిగా తినడం మరింత ఆరోగ్యకరం. అయితే దీనిని ఉడకపెట్టి కూరలా తిన్నా, సలాడ్‌లా పచ్చిదే తిన్నా ఉప్పుమాత్రం తినడానికి ఒక్క సెకను ముందు మాత్రమే జల్లాలి. ఉప్పు దీనిలోని బలవర్ధక పదార్థాలని నిముషంలో మటుమాయం చేస్తుంది. దీన్ని పచ్చిగా, లవణరహితంగా తీసుకుంటే పొట్టను శుభ్రపరచి, జీర్ణశక్తిని వృద్ధిచేస్తుంది. ముఖ్యంగా ఇది అల్సర్స్ రాకుండా ఆపుతుంది. ఇంట్లో కోపధారి మనుషులెవరైనా వుంటే వారికి తరచు పచ్చి క్యాబేజీ పెట్టడం మంచిదంటున్నారు డాక్టర్లు. అలా వాళ్ల కోపాన్ని తగ్గించవచ్చు. పచ్చి కేబేజీ రసం అల్సర్‌ని నయం చెయ్యడమేకాక, రాకుండా కూడా ఆపుతుంది. కొన్ని రకాల క్యాన్సర్స్‌ని పచ్చి ఆకుకూరల రసంతో రాకుండా ఆపవచ్చు అంటున్నారు వైద్యులు.

క్యాబేజీలో సౌందర్య రహస్యం కూడా

దాగి వృ:దంటున్నారు. దీనిని తినడం వల్ల మనిషికెప్పుడూ వృద్ధాప్యభావంరాదని, తనకి తాను ఎప్పుడూ 'యంగ్'గానే వున్నట్టు భావన కలుగుతుందనీ తెలుస్తోంది. అలాంటి విటమినుల సమ్మేళనం క్యాబేజీలో వుంది. ఇది రక్తనాళాలను శక్తివంతం చేస్తుంది. దీనిలో వుండే టార్టానిక్ యాసిడ్ సుగర్ని, ఇతర కార్బోహైడ్రేట్స్ని కొవ్వులా మారకుండా నిరోధిస్తుంది. ఆ విధంగా స్థూలకాయం రాకుండా అరికట్టవచ్చు 100 గ్రాముల క్యాబేజీ 27 కిలో కేలరీల శక్తినిస్తే, అదే బరువుగల మరి ఏ ఇతర కూరగాయలూ అంతశక్తినివ్వవు. ఇది సులభంగా అరగడమే కాకుండా, కడుపు నిండినట్లున్న అనుభూతి కలుగుతుంది. అంటే తొందరగా ఆకలి అనిపించదు. ఇందులో విటమిన్ సి కూడా అత్యధిక పాళ్లలో వుండటంతో పళ్లకి, ఇగుళ్లకి కూడా గట్టిదనాన్నిస్తుంది.

పూర్వీకులు క్యాబేజీకి సంబంధించిన కొన్ని చిట్కాలు ఇలా చెబుతున్నారు.

1. డైటింగ్ చేసేవారు, పొట్టబరువుగా వుండకూడదనుకునేవారు క్యాబేజీ పొరలను ఒలిచి శుభ్రంగా కడిగి, కొద్దిగా నిమ్మరసం, మిరియాల పొడి జల్లుకుని వెంటనే తినాలి. ఉప్పులేందే తినలేనివారు తినడానికి కేవలం ఒక్కసెకను ముందు మాత్రమే ఉప్పు జల్లుకుని వెంటనే తినాలి. సాధ్యమయినంత వరకు ఉప్పులేకుండా తింటేనే సత్ఫలితాలనిస్తుంది.

2. చర్మ సౌందర్యానికి కూడా క్యాబేజీ ద్వారా ఓ చిట్కా వుంది. క్యాబేజీ బాగా వుడకపెట్టి వార్చి ఆ వార్చిన నీళ్లు చల్లబడ్డాక ఆ నీటితో ముఖం బాగా కడుక్కుంటే కాంతులీనుతుంది.

3. క్యాబేజీ రసం తాగడం అన్నివిధాల ఆరోగ్యకరం అంటారు పెద్దలు. రుచి కావాలంటే దానికి కొద్దిగా నిమ్మరసంగానీ, మిరియాల పొడిగానీ లేదా కొంచెం అల్లంగానీ ఏదైనా చేర్చవచ్చు.

క్యాబేజీని తరిగేటప్పుడు మరీ సన్నగా పొట్టులా తరుగుతారు కొంతమంది. దాని వలన ఎన్నో విటమినులు పోయే ప్రమాదముంది. కత్తితగలకుండా ఆకులను కేవలం చేత్తోనే ముక్కలు చెయ్యాలి. దానికిముందే ఆకులను నీళ్లలో కడగాలి. ఇన్ని జాగ్రత్తలు తీసుకుంటే అందులోని విటమినులు, పోషకపదార్థాలు చెక్కుచెదరకుండా వుంటాయి. ★



# 'తేనెజాబిలి' పై సమీక్షలు

సెప్టెంబర్ 'చతుర'లో ప్రచురితమైన నాగతిహళ్లి చంద్రశేఖర్ నవల 'తేనెజాబిలి'పై మాకందిన ఉత్తమ సమీక్షలు

## చక్కెరపూత

(ప్రథమ బహుమతి రూ. 100/- పొందిన సమీక్ష)

సున్నిత మనస్కుడైన ఒక భావుకుడు క్రూరమృగంలా ఎందుకు మారాడన్న ప్రశ్నకు అతిసామాన్యమైన సాధారణ సమాధానం చెప్పడం ద్వారా 'తేనెజాబిలి' నవల తేనె తీపినీ, జాబిలి చల్లదనాన్నీ కోల్పోయింది. స్టెల్లా, ప్రేమ పాత్రల చిత్రీకరణ చూస్తుంటే రచయిత 'స్త్రీద్వేషి' అయి ఉంటారన్న అనుమానం బలపడుతుంది! ఈ ఇద్దరూ కామంతో కళ్ళుమూసుకుపోయి అక్రమ సంబంధాలవైపు ఆకర్షింపబడిన వారే కావడం విశేషం! అద్భుత సౌందర్యరాశి అయిన ప్రేమ ఒక మామూలు బస్ డ్రైవర్‌తో రాసలీలలు నడపడం, తన భర్త వద్ద సంగీతం నేర్చుకునే శిష్యుడు రాబర్ట్‌కి తనను తాను వడ్డించుకోవడం వంటి సంఘ

టనలకి 'భావుకత' 'చక్కెరపూత' కాస్త అతిగా అద్దడంతో ఆ తీపికాస్తా వెగటుగామారి అసలు లక్ష్యాన్నే దెబ్బతీసింది.

అయితే కథనంలో స్పీడు ఉండడంతో మొదటి సగంకంటే రెండవసగం ఆసక్తికరంగా సాగింది. శృంగారం శృతిమించిన వాక్యాలు కోకొల్లలు! 'కామలక్ష్యాన్ని చేరటానికి ప్రేమమెట్లు వాడకూడదన్న డేవిడ్ మాటల్లోనే చెప్పాలంటే... ఒక 'క్రైం' కథకు చక్కని భావుకత ధ్వనించే 'తేనెజాబిలి'లాంటి శీర్షిక ఉంచడంకూడా ఎబ్బెట్టుగా అన్పించింది. అనువాదం కొన్ని చోట్ల నవ్వు పుట్టించేవిధంగా ఉంది... 'హృదయపు ఖాళీ', 'నిశ్శబ్దం కక్కడం'లాంటివి మచ్చుకి రెండు. ఇన్ని లోపాలు ఉన్నప్పటికీ 'కులూ మనాలి' లోయల అందాలు, సొగసుల వర్ణన మాత్రం పాఠకులని బాగా రంజింపజేస్తాయనడంలో సందేహంలేదు. శిల్పంలో ప్రత్యేకత ఉన్నప్పటికీ పసలేని ఇతివృత్తం కారణంగా ఇది కూడా నిష్ఫలం అయింది!

-కిల్లాన మోహన్‌బాబు,
బొబ్బిలి.- 535 558

## అమావాస్య జాబిలి

*(ద్వితీయ బహుమతి రూ. 75/- పొందిన సమీక్ష)*

**భా**వుకత రంగుతో మసిపూసి మారేడుకాయచేసిన సాదాసీదా క్రైమ్‌కథ నాగతిహళ్ళి చంద్రశేఖర్‌గారి సెప్టెంబర్ 'చతుర' నవల 'తేనెజాబిలి'. ఇందులో తేనెలేదు. జాబిలిలేదు. వెన్నెల లేనేలేదు. ఒక్క చదివించే శక్తి తప్ప, కథలో ఎటువంటి పసలేదు.

పాత్రల మనోభావాలను వ్యక్తీకరించడానికి అనువుగా కథనాన్ని పాత్రలచే చెప్పించే పద్ధతిననుసరించిన ఆ లక్ష్యం నెరవేరలేదు. ఒక మంచి నవలను అందించాలనే ఉద్దేశ్యంతోకాక, అలవోకగా మొదలుపెట్టి కథనం చేయిదాటి పోయాక ఆత్రుతగా ముగించబడింది. సస్పెన్స్ మాత్రమే పరమావధిగా పెట్టుకుని నాయిక, నాయకపాత్రలను భ్రష్టుపట్టించారు. ఒక్క రాజీవ్‌సక్సేనా పాత్ర తప్ప తక్కినవన్నీ లోపభూయిష్టమైనవే. కేవలం కొసమెరుపు థ్రిల్లింగ్ తప్ప ఎటువంటి ప్రయోజనం, విలువలు లేనట్టి వ్యర్థనవల ఈ 'తేనెజాబిలి'

'ప్రేమ' కాలాన్ని కూడా డబ్బుతో లెక్కకట్టుకునే పిసినారి. వ్యాపార లావాదేవీలతో తల పగులకొట్టుకునేది. పరువుగల కుటుంబానికి చెందినది. పేదవాళ్లంటే అసహ్యపడే పిల్ల. అలాంటి అమ్మాయి ఒక సిటీబస్ డ్రైవరుతో సంబంధం పెట్టుకున్నట్లుగా చిత్రీకరించడంలో ఔచిత్యంలేదు. ఇలా రాయడం అందమైన ప్రేమపాత్రకు మసిబొట్టు పెట్టడమే.

భావుకత కలిగిన సహృదయుడు వివేక్ ప్రేమను హత్య చేశాడనటం కృతకంగాను, ఎబ్బెట్టుగాను ఉంది. చిన్నప్పటినుంచి ఆరాధింపబడిన ప్రేమ వేరొకనితో కామకలాపాలు సాగించడం తెలుసుకున్న వివేక్ భగ్నహృదయుడై, దేవదాసు కావటమో లేక ప్రేమను లోబరచుకున్న డ్రైవర్ రాజును హతమార్చటమో చేసినట్లైతే చాలా సహజంగా ఉండేది. లేక ప్రేమకు, డ్రైవర్ రాజుకు వివేక్ వివాహం జరిపించినట్లైతే అతని హృదయవైశాల్యం తెలిసి వచ్చేది. పాత్రకు పుష్టిచేకూరేది. ప్రేమను చంపటం అత్తమీద కోపం దుత్తమీద చూపించినట్లుగా ఉంది. వివేక్ అవివేక్‌లా తయారయ్యాడు. పర్యవసానంగా ప్రేమ, పెళ్ళి, హనీమూన్ అనే విషయాలు పెళ్లికాని పాఠకులకు వెగటు పుట్టించేవిగా భ్రాంతి కలిగించారు.

ప్రయోజనాత్మకమైన, చిక్కటి విలువలు గల చక్కటి నవలలందించే 'చతుర' ఈ




నవలద్వారా చాలా నిరాశపరిచింది.

**వి. చంద్రశేఖర్,**
అనంతపురం- 515 001

## వ్యర్థప్రయత్నం

*(తృతీయ బహుమతి రూ. 50/- పొందిన సమీక్ష)*

సహజంగా అనువాద కథలు, నవలలు, 'డబ్బింగ్' సినిమాల్లా అతికీ అతకన ట్లుంటాయి. వాటికి భిన్నంగా చక్కటి భాష, భావవ్యక్తీకరణ, కథనం ఎంతో హత్తుకునేలా అనువదించి 'తేనెజాబిలి'ని మన ముందుంచిన రంగనాథ రామచంద్రరావుగా ర్కి ముందుగా కృతజ్ఞతలు తెలుపుకోవాలి.

జీవితాన్ని విశ్లేషించగల్గిన మేధావి డేవి డ్, భావుకుడు, సున్నితుడు అయిన వివేక్ లిద్దరూ అభిరుచులు, ఆలోచనలు కలవవని తెల్సీ కేవలం భౌతిక సౌందర్యానికి దాసులై 'స్టెల్లా', 'ప్రేమ'ల వెంటబడడం చూస్తే ఆశ్చర్యాన్ని కల్గిస్తుంది. ప్రేమనేది నిజంగా గుడ్డిదే అన్పిస్తుంది. అంతేకాదు ప్రేమకి పరాకాష్ఠ సెక్సేనా అని అనుమానమేస్తుంది.

నవల మొత్తం భావుకత్వపు గుబా ళింపుతో, ప్రకృతి సౌందర్యాల వర్ణనలతో ఆద్యంతం ఆపకుండా చదివిస్తుంది. హనీ మూన్‌ని చక్కని ప్రదేశాల్లోనూ, హెూటళ్లలో నూ జరిపించి పాఠకుడికి స్వయంగా ఈ హనీమూన్ ట్రిప్‌ని 'ఎంజాయ్' చేస్తున్న భావన కల్గజేస్తుంది.

సహజ సౌందర్యరాశి, సత్ప్రవర్తనగల్గి, ఉన్నత కుటుంబంలో పుట్టి అందరి మన్నన ల్నీ పొందిన ప్రేమ... జీవితం గురించి, డబ్బుగురించీ స్పష్టమైన అవగాహన ఉన్న ప్రేమ, ఓ నీచమైన వ్యక్తితో అదీ ఇద్దరు బిడ్డల తండ్రితో అక్రమ సంబంధానికి ఒడిగ ట్టడం విడ్డూరంగా ఉంది. అంత అనాలోచి తంగా వ్యవహరిస్తుందంటే నమ్మశక్యంగా లేదు. సహజంగా కాలేజీలో చదివే 'ప్రే మ'లాంటి అమ్మాయిలు, షోగ్గా ఉండి, కార్లు, షికార్లతో సర్దాగా తిరుగుతూ ఉండే అందగా ళ్లకు మనసు పారేసుకోడాన్కి ఇష్టపడ్తారు గాని, డ్రైవర్ రాజు లాంటి వాళ్ళని గాదు. ఓ కన్నెపిల్ల అంతటి 'జాణ'తనాన్ని ప్రద ర్శించడం అసహజంగా ఉంది.

నవల మొత్తం మైసూరు నుంచి కులూమనా లికి ఎలా వెళ్లాలి? ఎక్కడెక్కడ ఏముంటాయి అనే విషయం భావుకతని నింపిన కవితాధోరణిలో నడిచింది.

మొత్తంమీద స్త్రీని ఒక 'నయవంచకి'గా చిత్రీకరించడాన్కి రచయిత పడిన వ్యర్థప్ర యత్నంగా ఉంది.

**ఎన్. గిరిజ,**
నెల్లూరు- 524 004

## కథనం బాగుంది

*(నాల్గవ బహుమతి రూ.50/- పొందిన సమీక్ష)*

సెప్టెంబరు నెల 'చతుర'లో ప్రచురించిన నాగతిహళ్ళి చంద్రశేఖర్‌గారి 'తేనెజాబిలి' నవలలో కథ పెద్దగా లేకపోయినా కథనం మాత్రం ఆద్యంతం ఆహ్లాదంగా సాగింది. కథలో ముఖ్యపాత్రలు డేవిడ్, స్టెల్లా, వివేక్, ప్రేమలు అయినప్పటికీ వివేక్, ప్రేమలతోనే నవలంతా నడిపిస్తూ, ప్రకృతి సౌందర్యాన్ని వర్ణిస్తూ పాఠకునికి విసుగు లేకుండా నవ లంతా చదివేలా చేసిన రచయిత గొప్పదనా న్ని ఈ సందర్భంగా మెచ్చుకోవాలి. ఒక్క మాటలో చెప్పాలంటే ఒక సస్పెన్స్ థ్రిల్లర్ సినిమా చూసిన అనుభూతి కలిగింది. కులూ-మనాలి ప్రాంతాలను రచయిత బాగా వర్ణించారు. రోథాంగ్‌పాస్, మైసూరుల సౌందర్యాన్ని కళ్లకు కట్టినట్టు వర్ణించి, జీవి తంలో ఒకసారైనా ఆ ప్రదేశాలు చూడాలన్న



కోరికను పాఠకుల్లో కలిగించారు. ఇక నవలలో పాత్రల గురించి చెప్పాలంటే రచయిత నవలలోని పాత్రలద్వారా పాఠకులకిచ్చిన సందేశం ఏదీలేదు. ప్రేమ, స్టెల్లా ఈ రెండు స్త్రీ పాత్రల్లోనూ ఒకటే భావాలు... డబ్బు, కామం. ఈ రెండు భావాలు ఇద్దరిలోనూ కలిగించాడు. అక్కడక్కడ శృంగారం పాళ్ళు కూడా ఎక్కువగానే ఉన్నాయి. రాజీవ్ సక్సేనా పాత్ర సినిమాఫక్కీలో ఉంది. మొత్తంమీద నవల ఫరవాలేదనిపించింది.

పి.యస్.సి. మూర్తి,
కాకినాడ-533016

## సాదాసీదా నవల

*(అయిదవ బహుమతి రూ. 50/- పొందిన సమీక్ష)*

**ఇం**గ్లీష్ పదం హనీమూన్‌కు 'తేనెజాబిలి' అనే తెలుగు టైటిల్ చక్కగా వుంది. కథ మొత్తం హనీమూన్ నేపథ్యంలో జరగడంవలన ఈ నవలకు 'తేనెజాబిలి' అనే పేరు చక్కగా సరిపోయింది. కథనం, శైలి సాదాసీదాగావున్నా చివరలో సస్పెన్స్ కథకు బలాన్నిచ్చింది.

వివేక్, ప్రేమ పాత్రలను, పాత్రల స్వభావాలను, వ్యక్తిత్వాలన్ను, రచయిత చక్కగా రాయగలిగారు. మిగతా పాత్రల స్వభావాలను, కథలోని కొన్ని సంఘటనలను 'కట్టె, కొట్టె, తెచ్చె' అనే విధంగా రాశారు. కథ చెప్పిన తీరు వర్ణనలు లేకుండా పొడిపొడిగా వుంది. భావుకుడైన వివేక్ కథానాయకుడు అయినా కథలో భావుకత్వం లోపించింది. ప్రేమ, వివేక్‌లు హనీమూన్‌కు వెళ్లిన ప్రదేశాల గురించి రచయిత స్వయంగా తిరిగి రాసినట్టు అనిపించింది.

వివేక్ ప్రతీకారం తీర్చుకోవడానికి ప్రేమను చంపిన విషయం చివర వరకు సస్పెన్స్‌లో వుంచి రచయిత కొన్ని మార్కులు కొట్టేశారు. కేవలం డబ్బుకోసమే ప్రేమ తనను పెళ్లి చేసుకోవాలనుకోవడం, ప్రేమను దేవతలా ఆరాధించి, పూజించిన వివేక్ తట్టుకోలేక ఆమెను హత్య చేయడం సబబే అనిపిస్తుంది. ప్రేమించి పెళ్లిచేసుకొని ప్రేమను హత్య చేసిన వివేక్‌పట్ల పాఠకులకు సానుభూతి కలిగేలా రాయడంలో రచయిత కృతకృత్యుడయ్యాడనే అనిపిస్తుంది. ఒక్కొక్క సంఘటన చాలా చక్కగా, తెలివిగా, కథకు ఏమాత్రం ఆటంకం కలగకుండా, లోపాలు జరగకుండా రాయడంలో రచయిత ప్రతిభ బయటపడింది. అక్కడక్కడ సంభాషణలు బాగున్నా కథ మొత్తంలో సంభాషణలు తేలిగ్గా వున్నాయి.

కామం తీర్చుకోవడానికి ఒకడితో తిరిగి, డబ్బుకోసం మరొకడిని పెళ్లాడిన ప్రేమలాంటి కథానాయికలు ఈ సమాజంలో ఎందరో వున్నారు. కథానాయికను ఈవిధంగా చిత్రీకరించి రచయిత సాహసమే చేశాడనిపిస్తుంది.

పోలీసు అధికారి సక్సేనా దర్యాప్తు నిజాయితీగా వుండి పోలీసు డిపార్టుమెంట్‌పై గౌరవం కలిగించేలా వుంది. పూర్వ పరిచయాలు లేని సక్సేనాతో డేవిడ్ తన భార్య మరొకడితో లేచిపోయిన విషయాన్ని చెప్పడం ఎబ్బెట్టుగా వుంది.

వర్ణనలతో భావుకత్వాన్ని గుప్పించి మంచి శైలితో రాస్తే ఈ నవల సాదాసీదా నవలగా కాకుండా మంచి నవలగా పేరు తెచ్చుకునేది.

-యస్. శివానంద్
హైదరాబాద్-500 035

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd. Hyderabad Tel: 3730328, Office Address: CHATURA Monthly, Eenadu Compound, Somajiguda. Tel. Hyderabad: 3318181, 3398787; Madras: 8270434, 8251044; Vijayawada: 476685; Visakhapatnam: 552211; Tirupati: 75291; Anantapur: 33777: Rajahmundry: 79170; Karimnagar: 83216; Suryapet: 21146; Guntur: 353942; Nellore: 331080

Regd. No. H/HD/402-RNI/32186/78

# కొందరికి పులుపంటే ప్రేమ ఎక్కువ!!




ఔను... ఇప్పుడు కారం కారంగా, తియ్య తియ్యగా, పుల్ల పుల్లగా, ఘాటు ఘాటుగా, మీకు నచ్చే మీరు మెచ్చే ఏ రుచి కావాలన్నా అందిస్తోంది 'ప్రియ'. 23 రకాల 'ప్రియ' పచ్చళ్లు... మీ ముందు సిద్ధం.

నోరూరించే, మైమరిపించే 'ప్రియ' ఘుమ ఘుమలు పసందైన విందును ప్రేమించే మీ కోసమే ప్రత్యేకం సుమా!

వెల్లుల్లితోనూ, వెల్లుల్లి లేకుండానూ, ఆవనూనెతోనూ, నువ్వుల నూనెతోనూ కూడా సంసిద్ధమై లభిస్తోంది. సాటిలేని 'ప్రియ' మాధుర్యం... 300, 500 గ్రాముల సీసాల్లోనూ, 1 కే.జి., 5 కేజీలు, 20 కేజీల ప్యాకింగులలోనూ లభించును.







**Pickles**
**ఏ పచ్చడంటే ఆ పచ్చడి సంసిద్ధం**




**ఉషోదయ ఎంటర్‌ప్రైజెస్ లిమిటెడ్,** (ప్రియ ఫుడ్స్ డివిజన్), ఈనాడు కాంప్లెక్స్, సోమాజిగూడ, హైదరాబాద్ **500 482.**